పురాణవైర గ్రంథమాల - 7



# అమృతవల్లి

గ్రంథకర్త

కవిసమ్రాట్

విశ్వనాథ స[illegible]ణ




పబ్లిషర్సు

ఉమా పబ్లిష[illegible]

విజయవాడ — వి[illegible]

# పురాణ వైర గ్రంథమాల పీఠిక

ఇవి పురాణవైరమను శీర్షికతో వ్రాయబడుచున్న పదునాఱు నవలలు. ఏనవల కానవలే. పదునాఱింటను కలిపి ఒకటే కథయుండదు. ఒకదానితో నొకదానికి సంబంధ ముండదు. కొన్నింటియందు సంబంధమున్నను, అది ప్రధానము కాదు. కాని ఈనవల లన్నింటికి కలిపి పురాణవైరమన్న శీర్షిక ఎందులకు? పురాణవైరమన్న పే రెందులకు?

ఈవిషయము ఈనవలలలో నచ్చటచ్చటపరామర్శింపబడును. మనకు వేదశాస్త్ర పురాణేతిహాసములు గలవు. వానిలో పురాణమున్నది. పురాణమనగా నేమి? "పురాణం పంచలక్షణం" అని మనవారన్నారు. పురాణ మైదు లక్షణములు కలది. సర్గము, ప్రతిసర్గము, మన్వంతరములు, రాజవంశములు, అనువంశములు, అని ఈ అయిదు లక్షణములు పురాణములయందుండును. సర్గమనగా మొదటజరిగిన సృష్టిలక్షణము, మహాప్రళయము జరిగిన తరువాత తొలినారి సృష్టియొక్క స్వరూప మెట్లుండునో అది సర్గము. తరువాత కొన్ని కొన్ని ప్రళయములు జరుగును. అప్పుడు మరల సృష్టి జరుగును. దానిపేరు ప్రతిసర్గము. మన పురాణములలో ఒక మనువు చెరువునకు స్నానమునకు పోయినప్పుడు, ఒక చేప తన్ను రక్షించుమని అడుగగా, దానిని తన చెంబులో తీసుకొని వచ్చెను. అది చెంబునకు పెద్దదై నాకు ఈ చెంబు చాలుట లేదనగా పెద్దపాత్రలో వేసెను. అట్లు పెరిగి పెరిగి సముద్రములో బడవేయదగినంత దయ్యెను. ఆచేప ఆ మనువుతో కొలది దినములలో సముద్రములు పొంగి భూమి మునిగి పోవును. లోకములో నున్న జీవరాసులలో ఒక్కొక్క జీవ

రాశి కొక్కొక్కవ్యక్తిగా తీసికొనివచ్చి నాపైన నెక్కుము. ప్రళయాంతమున మరల సృష్టిని నిలుపుదువుగాని అని చెప్పగా నతడట్లు చేసెను. ఇది ప్రతిసర్గము. అనగా మహత్తు అహంకారము మొదలగు వాటినుండి మరల సృష్టి జరుగ లేదు. మహదహంకారాదులనుండి జరిగెడు సృష్టి సర్గము. తత్పూర్వమందున్న జీవరాసులయొక్క ప్రతులు మిగిల్చి వానినుండి మరల సృష్టి సాగుట ప్రతిసర్గము. బైబిలులో 'నోవాస్ ఆర్క్' అని యున్నది. నోవా అనువాడు ఒకయోడలో జీవరాసులయొక్క ప్రతులను తీసుకొని వచ్చినట్లు దాని వలన మరల సృష్టి ప్రారంభమైనట్లు చెప్పబడినది. అది ప్రతిసర్గము. సర్వ విద్యలు సర్వజ్ఞానము యితరదేశములకు భారత దేశమునుండియే వెళ్ళినవి. అట్లు వెళ్ళిన జ్ఞానములో బైబిలులోని కథ యొకభాగము. మూడవది మన్వంతరములు. కృత త్రేతాద్వాపార కలి యుగములు నాల్గు కలిసినచో నొక మహాయుగము. ఇట్టి మహాయుగములు 71 జరిగినచో నొక మన్వంతరము. అట్టి పదునాల్గు మన్వంతరములు జరిగినచో నప్పుడు మహా ప్రళయము వచ్చును. ఈ లెక్క ఎక్కడ? పాశ్చాత్యులు మనకు నేర్పెడి చరిత్రలోని లెక్క ఎక్కడ? అల్పమైన యూహగల వారి మార్గమును మన మనుసరించు చున్నాము. నాల్గవది రాజవంశము. సృష్ట్యాదియందు గల సూర్య చంద్రవంశ రాజుల చరిత్రములు మన పురాణము లలో నున్నవి. అనువంశములనగా వారినుండి కలియుగములో వచ్చిన బహు రాజవంశముల చరిత్రము. ఇది నేడు చరిత్ర యను పేరున కాలేజీలలో పాఠశాలలలో చదివింపబడు విషయము. దానిని పాశ్చాత్య చరిత్రకారులు పలువిధము

లుగా మార్చి పాడుచేసి వారి యిష్టమువచ్చినవి చదివించు చున్నారు. మన పెద్దలు వాని ననుసరించుచున్నారు. మనకు చరిత్ర జ్ఞానములేదని పాశ్చాత్య పండితులు నేర్పిరి. వారి చదువు చదివిన మన ఇంగ్లీషు పండితులు దానిని ప్రతిదినము చెప్పుచుందురు. కొందఱు నిజమే యనుకొనుచుండిరి. ఏ గూటిచిలుక ఆ గూటిపలుకే పలుకునని యాఇంగ్లీషు చదువే చదివి పాశ్చాత్య సాంప్రదాయమునందే దగులొన్న బుద్ధులు వారి మాటలే విశ్వసించుటలో దప్పేమియులేదు.

ఇంతకు చెప్పవచ్చిన దేమనగా మన పురాణములు చరిత్రయే మన ఋషులకు చరిత్ర జ్ఞానములేదనుట మన పూర్వ నాగరికతను ఎంత తక్కువ పరచినచో వారి ఏలుబడి అంత గొప్పగా సాగునని పాశ్చాత్యులు పన్నిన పన్నుగడ.

ఇంగ్లీషువారు క్రైస్తవులు. బైబిలునందు విశ్వాసము కలవారు. పాశ్చాత్యదేశములన్నియు నింతే. వారి బైబిలులో సృష్టిక్రీస్తుపూర్వము రెండు వేలఏండ్లక్రిందజరిగినది. నూటతొం బదియైదుకోట్ల సంవత్సరముల పూర్వము మనసృష్టిజరిగినదని మనవారు చెప్పుచున్నారు. ప్రతి సంవత్సరములో పంచాంగ మును తీసి చూడుడు. సృష్ట్యాది గతాబ్దాః సృష్టి మొదలు పెట్టిన తరువాత గడచిన సంవత్సరములు. అవి ఎన్ని? నూట తొంబదియైదుకోట్ల పై చిల్లర. కలిగతాబ్దాః కలిలో గడిచన సంవత్సరములు. అవి ఎన్ని? అయిదు వేల అరువది. ఇట్లు మన జ్యోతిష్కులు సంవత్సరము సంవత్సరము లెక్కపెట్టుకొని వచ్చుచున్నారు దానిని కాదనుట ఎట్లు? పాశ్చాత్యుల బుద్ధి ప్రమాణమెట్లు? క్రీస్తుశకము 1960 మరి పదిలక్షలసంవ త్సరములు జరిగిన తరువాత క్రీస్తుశకము నెట్లులెక్క పెట్ట

దును? వేలమీాదనున్నప్పుడు లెక్కపెట్టవచ్చును. లక్షలు కోట్లైనప్పుడెట్లు? క్రీస్తు పూర్వమున లెక్కవేసినను, కోట్ల మీాదనున్న సంఖ్య వారికెనమరుకురాదు.

మన కలియుగము ప్రవేశించినప్పటికే వారికి లెక్క కుదరలేదాయె. వారి సృష్టి అప్పుడు జరిగినట్లాయెను. ఇది ఏమి లెక్క! అయిదు వేల అరువది సంవత్సరముల క్రింద కలి ప్రవేశించెనని పంచాగములు చెప్పుచున్నవి. భారతయుద్ధ మప్పుడు జరిగినదని భారతములో దాఖలాలున్నవి. ఆర్య భట్టు మొదలైన మనపూర్వ ఖగోళ శాస్త్రజ్ఞులు వ్రాసి పెట్టినారు. వాని నన్నింటిని పాశ్చాత్యులు కాదన్నారు. ఇంగ్లీషు నేర్చిన మన పెద్దలు వారినే విశ్వసించుచున్నారు, మనవాంధ్రకు పురాణములయందు చెప్పబడిన సర్గ ప్రతిసర్గ ములయందు విశ్వాసములేదు. డార్విను సిద్ధాంతమునందు విశ్వాసము.

మన దేశములో కొందఱుపెద్ద లీవిషయమును చాల పరిశ్రమచేసి పాశ్చాత్యుల సిద్ధాంతములు తప్పులని రుజువు పరచినారు. టి యస్. నారాయణశాస్త్రిగారు శంకరుని కాలము నిర్ణయించుచు ఈ విషయములను సమగ్రముగా చర్చించి మహాభారతయుద్ధము సుమారు అయిదువేలఏండ్ల క్రింద జరిగినట్లు నిరూపించిరి. తరువాత నడింపల్లి జగన్నాథ రావుగారు నిరూపించిరి. తరువాత కోట వెంకటాచలము గారు మన సర్వచరిత్రము విస్పష్టముగా విలిఖించినారు.

గ్రీకుల రచనలలో సాండ్రకోటస్ అన్నమాట యు న్నది. దానిని పాశ్చాత్యులు మౌర్యచంద్రగుప్తుడని యర్థము

చెప్పినారు. దానిలో పురాణములలోని కలిరాజవంశ ము౦తయు తారుమారైనది. ఈయన గుప్తచంద్రగుప్తుడు గాని మౌర్యచంద్రగుప్తుడు గాడు మనకు మగధరాజవంశ చరిత్ర యున్నది. కల్హణపండితుడు తన రాజతరంగిణిలో కాశ్మీర రాజ చరిత్రము పూర్తిగా వ్రాసినారు. నేపాళరాజవంశ చరిత్రను సమగ్రముగ గలదు. గుప్తచంద్రగుప్తుని వదలి పెట్టి మౌర్యచంద్రగుప్తు డనుటతో సర్వము నాశనమై పోయినది. పాశ్చాత్యచరిత్ర కారులు ఈ సిద్ధాంతము అకాండ తాండవము చేసినారు. మనచరిత్రను వారియిష్టము వచ్చినట్లు మలచిరి. మన పండితులదియే చదువుచున్నారు. విద్యార్థుల చేత అదియే చదివించుచున్నారు.

ఈ విషయము సమగ్రముగ నెఱుగగోరువారు భారతచరిత్ర భాస్కర బిరుదాంకితులైన పండిత కోట వెంకటాచలముగారి గ్రంథములను చదువ వలయును. భారత యుద్ధము అయిదువేల ఏండ్ల క్రితము జరిగినదని తెలిసికొనగోరు వారు, నడింపల్లి జగన్నాథరావుగారు వ్రాసిన మహాభారత యుద్ధకాలనిర్ణయమును, టి. యస్. నారాయణశాస్త్రిగారు వ్రాసిన శంకరాచార్యకాల నిర్ణయములను చదువవలయును. ఈ రెండు గ్రంథములు ఇంగ్లీషు భాషలో వ్రాయబడి యున్నవి. ఆ గ్రంథములు గ్రహములయొక్క చారము, వాని లెక్కలు మొదలైన వానితో నిండియుండును.

ఈ చరిత్రను పలుమంది పాశ్చాత్యులుదిద్ది పాడు చేసిరి. పంక్తులు తప్పుచదివి దుర్వ్యాఖ్యానములుచేసి హిందువులయొక్కయు, బౌద్ధులయొక్క యు వ్రాతలను పరిహసించి

దుర్మార్గములు చేసిరి. ఈ దౌర్మార్గ్యమును ప్రారంభించిన వాడు సర్ విలియమ్ జోన్సు. తరువాత చాలమంది పాశ్చాత్యచరిత్రకారులు వారి ననుసరించిరి. మన వేదాంతముల యందభిమానముగల మాక్సుముల్లరుకూడ చరిత్ర విషయములో దుష్టముగానే వ్రాసెను. ఇంగ్లీషులో నొక సామెత యున్నది. Blood is thicker than Water.

ఇంతకు సప్తర్షి మండలముయొక్క గమనముమీద మహాభారత యుద్ధకాల నిర్ణయము చేయబడవలయును. ఇది పెద్ద కథ. పోనిండు. పురాణముల ప్రకారము చూచినచో సప్తర్షిమండల చారమునుబట్టి లెక్కకట్టినచో సాండ్రకోటస్ గుప్తచంద్రగుప్తుడని అంగీకరించినచో, నన్నియు సరిపోవును. సరిపోయెడు నీలెక్కయుండగా, సరిపోని లెక్కకట్టి పురాణములు తప్పనుటలోని తెలివిఏమి? అందులోని న్యాయమేమి? దానియందు విశ్వాస మిట్టిది.

ఆలెక్క ప్రకారము కలి ప్రవేశము మొదలు సంయుక్తపృథ్వీరాజుల కథ వరకు పాశ్చాత్యులు తారుమారు చేసిరి. ఆ కాలము అనగా షుమారు మూడువేలసంవత్సరాల కాలము. మహమ్మదు గోరీ వచ్చునప్పటికు మన చరిత్రలో పాశ్చాత్యులు చేసిన యవకతవకలు కాదని నవలల రూపమున నిరూపించుటకు చేసెడి ప్రయత్నమిది.

అందుచేత దీనికి 'పురాణవైర'మని శీర్షిక ఏర్పరుపబడినది.

# పీఠిక

ఇది పురాణవైర గ్రంథమాలలో నేడవ నవల. శుంగ వంశపు రాజులైనతర్వాత మగధరాజ్యమును కణ్వవంశపు రాజులు పరిపాలించిరి. శుంగవంశపు రాజులలో ప్రథముడు పుష్యమిత్రుడు ఆయన యశ్వమేధము చేసినవాడు. ఆరవ నవలయైన అశ్వమేధము పుష్యమిత్రుడు రాజ్యమునకు వచ్చిన కథను నిరూపించును. ఈ పుష్యమిత్ర వంశపు రాజులు పది మంది. వారు క్రీ. పూ. 1218 మొదలు 918 వరకు 300 ఏండ్లు రాజ్యముచేసిరి. వారిలో చివరిరాజు దేవభూతి. అతనికే క్షేమభూతి అనియు పేరు. ఈక్షేమ భూతి కాముకుడై రాజ్యము మంత్రుల కప్పగించి దుష్టముగా సంచరించుచుండెను. ఆయనమంత్రి వాసుదేవుడు. ఈ వాసుదేవుడు కాణ్వాయన బ్రాహ్మణ వంశమునకు చెందినవాడు. ఈకథ కలియుగరాజ వృత్తాంతమునందును, భాగవతమునందును గలదు. అది యిట్లున్నది.

సనైకదా విప్రైః శ్రుత్వా వాసుదేవస్య మంత్రిణః
సుతాం మహారూపవతీం పద్మినీ లక్షణాన్వితాం
తయాగంతుం మనశ్చక్రే బ్రాహ్మణ్యా కాలచోదితః

వ్యాజేన తాం సమానీయ పత్న్యాసార్థం స్వసన్నిధౌ
గూఢంహత్వాని జైః చారైః సాధ్వ్యాః తస్యాః ప్రియంపతిం
తత్ రూపధృత్ నిశిప్రాప్య తస్యాః వాసగృహంనృపః
హఠాత్ తామ్‌ధర్షయామాస బ్రాహ్మణీం వరవర్ణినీం
సాతుజ్ఞాత్వాఽస్య దుర్వృత్తంప్రాణాన్ తత్యాజ తక్షణాత్
తచ్ఛ్రుత్వా వసుదేవస్తు శోకసంతప్తమానసః
విషదిగ్ధాం అలంకృత్య కాంచిత్ వారాంగనాంద్విజః
తస్యైవ ఘాతయామాస దేవభూతిం నృపాధిపమ్।

అని యున్నది. అనగా దేవభూతి తనమంత్రియైన వాసుదేవునికూతు రందగత్తియ యని విని, యామెను నమ్మకముమీద బిలిపించి, ఆమె భర్తను చంపించి, యామె భర్త వేషమును తాను వేసుకొని ఆమె వద్దకు పోయెను. ఆమె వానిని గుర్తుపట్టి నిరాకరించెను. అత డామెను బెదరించెను. ఆమె ప్రాణములను వదలెను. ఈ వార్త వాసుదేవుడు విని దుఃఖించి, రాజుమీదికి విషకన్యను ప్రయోగించి రాజును చంపెను. ఇది కథ. కథలోని విషాంగన వారాంగన. ఈ నవలలోని విషాంగన ఈ కథలో నాయికయైన అమృతవల్లి. ఆమెయు బ్రాహ్మణస్త్రీయే. ఈ కథ ఎట్లు మార్చబడినదో ఏ నూతనమైన కల్పన చేయబడినదో, నవల చదివినచో తెలియగలదు.

ఈ నవలా రచనలోని ప్రధాన విషయ మిదివరకే చెప్పబడినది. ఈ నవలలు మన పురాణములయందున్న కాల నిర్ణయమును ప్రతిపాదించుటకు వ్రాయబడుచున్నవి గదా ? భారతయుద్ధ మైనతర్వాత బార్హద్రథ వంశమువారు 1006 ఏండ్లు రాజ్యముచేసిరి. ప్రద్యోతవంశము 138 ఏండ్లు, శిశునాగవంశమువారు 360 ఏండ్లు, నందవంశము 100 సం॥లు, మౌర్యవంశము 316 ఏండ్లు, శుంగవంశము 300 ఏండ్లు, ఇప్పుడు కణ్వవంశము ప్రారంభించుచున్నది. వీరు 85 ఏండ్లు రాజ్యముచేసిరి. అనగా భారతయుద్ధ మైనతర్వాత నిప్పటికి 2220 ఏండ్లయినది. ఈ కణ్వులు 85 ఏండ్లు పాలించిరి. ఈ కణ్వు లైనంతనే, మగధరాజ్యము శాతవాహనుల యధీనము లోనికి వచ్చెను. ఆ కథ 8 వ నవల పులిమ్రుగ్గులో నిరూపింపబడును. అనగా శాతవాహనులు మగధసామ్రాజ్యమును స్వీకరించిన కాలము భారతయుద్ధ మైనతర్వాత 2305 ఏండ్లగును. ఇప్పటికి కలికాలము ప్రారంభించి సుమారైదు వేలేండ్లయినది. శాతవాహనులు నేటికి పూర్వము 2700 సం॥ల నాడు రాజ్యముచేసిరని యర్థము. ఇది నిజమైన లెక్క. పురాణములలోని లెక్క ప్రకారము చూచినచో నిట్లుండును. ఆధునిక చరిత్రల ప్రకారం కొన్ని వందలఏండ్లు భేదమువచ్చును. తక్కిన నవల లన్నియు వ్రాసినతర్వాతగాని దీనికి సంపూర్ణమైన విచారణ చేయబడిన పీఠిక వ్రాయుట సంభవించదు. పాశ్చాత్యులు చేసిన మార్పులన్నియు

పృథ్వీరాజు రాణీసంయుక్త కథవరకు చేసిరి. అచటినుండి మన పురాణములలోని కాలమును యదాతదముగాస్వీకరించిరి. అందుచే ఈ పురాణవైర గ్రంథమాలలోని నవలలు పృథ్వీ రాజు రాణీసంయుక్త కాలమువరకే వ్రాయబడును. ఇట్లొక నవలతరువాత నొక నవల వ్రాయబడుటకు కారణము పురాణములయం దున్న కాలముయొక్క యాథార్థ్యము నిరూపించుట కొరకు. ఇదియంతయు పురాణములయందున్నదే. దానిని పాశ్చాత్యులు విపరీతముగా బుద్ధి పూర్వకముగా మార్చిరనుటకు సాక్ష్యములున్నవి. తొలుత భారతయుద్ధము నాటికి సుమా రైదువేల ఏండ్లక్రిందట జరిగినదన్న విచారణయే పాశ్చాత్యు లంగీకరించరు. దానికి శాసనములు, మొదలైనవి వారి ప్రమాణములు. మన పురాణములకు ప్రమాణము అది కాదు. జ్యోతిర్విషయము వీరికి ప్రమాణము. సప్తర్షి మండలము నక్షత్రములయందు నొక్కొక్క దానియందు నొక్కొక్క 100 ఏండ్లుండును. ఆ నడక పశ్చాద్గమనము. అనగా భరణియందు 100 ఏండ్లుండి తరువాత 100 ఏండ్లు సప్తర్షిమండలముఅశ్వినియం దుండును. కృత్తికయందుండదు. ఇది లెక్క. సప్తర్షి మండలము ఒక్క యావృత్తి పూర్తిచేయునాటికి 2700 ఏండ్లగును. భారతయుద్ధము జరిగినపుడు సప్తర్షిమండలము మఖా నక్షత్రములయం దున్నది. అనగా మరల మఖా నక్షత్రమునకు వచ్చునప్పటికి 2700 ఏండ్లగును. భారతయుద్ధము జరిగి

ఈ నవలకాలమునాటికి 2220 అయినది. కణ్వవంశ రాజ్యము పూర్తి అయినప్పటికి 2305 సంవత్సరమగును. అనగా సప్తర్షి మండలము మఘల మఖానక్షత్రములోనికి వచ్చి యా 100 సంవత్సరములలో భారతయుద్ధము జరిగిననాటి కెన్నిసంవత్సరములు గడచినవో అన్ని సంవత్సరములు గడచునాటికి మరి 400 పై చిల్లర కావలయును. అప్పటికి శాతవాహనుల రాజులలో 26వ వాడు రాజ్యము చేయుచుండును. వారు ముప్పదియిద్దరు రాజులు, శివశ్రీ శాతకర్ణి 27 వ వాడు. అతని కాలమునాటికి ఈ సప్తర్షి మండలముయొక్క రెండవ భ్రమణము పూర్తి అగును. ఆ కథ 9 వ నవలలో యుండును. ఇది యేడవ నవల.

# అమృతవల్లి

## ౧

శ్రీమాలి ఈనాఁడు కనిపించలేదేమి? అని యొక వృద్ధుఁడు ప్రక్కనున్న మఱియొక పిల్ల నడిగెను. ఆ పిల్ల యిట్లనెను. "తాతా! నీకు శ్రీ మాలిమీఁద నంత ప్రేమ యెందులకు? శ్రీమాలి నావంటిదేకదా! అందఱు నేనును శ్రీ మాలియు నొక్క విధముగానే యుందుమని చెప్పుదురు. నన్నుఁ జూచినచో శ్రీమాలినిఁ జూడ నక్కఱలే దందురు. మేమిద్దఱము కవలపిల్లలమేమో యని చాలమంది యనుకొందురు. కవలపిల్లలము కాము సరికదా; యొక తండ్రి బిడ్డలముకాము; ఒక తల్లి బిడ్డలముకాము. చిన్నతాత యనునుగదా, మీ యిద్దఱినడుమ భేద మున్నది. దాని నెవ్వరును కనిపెట్టలేరు. నే నొక్కఁడనే కనిపెట్టఁ గలుగుదును" అనఁగా నావృద్ధుఁడు "ఆభేదమేమియో నీతో చెప్పినాఁడా?" యనెను. ఆబాలిక "అమ్మయ్యో! ఆయన చెప్పునా? ఆయన మనసులోనున్న రహస్యము బయటకు వచ్చునా? తాతా! ఆయన నీవంటివాఁ డనుకొనుచున్నావా? నాకిదియే యాశ్చర్యముగా నుండును. మీ యిద్దఱు నొక తల్లిబిడ్డలు. మీ నడుమ నింత భేదమున్నది. నేనును శ్రీమాలియు నొక తల్లి బిడ్డలము కాము సరికదా? బంధువులము కూడ కాము. ఆమె యెచ్చట పుట్టినదో నే నెచ్చట పుట్టితినో.

కాని మా యిద్దఱినడుమ నెంత పోలికయున్నది. అనఁగా
నా వృద్ధుఁడు "బిడ్డా! మీ పోలిక యాకారసామ్యమునందే
కదా?" యనెను. అనఁగా నమృతవల్లి యిట్లనెను. "తాతా!
మీ యిద్దఱినడుమ నాకారసామ్యముకూడ లేదుకదా! నీవు
సామ్యమూర్తివి. నీకన్నులలోనుండి జాలియు ప్రేమయు నొలికి
వచ్చుచుండును. నీనుదురు విశాలమైనది, నీ చెక్కిళ్లు మఱియు
పలుచగా నుండవు; మఱియు నుబ్బి యుండవు. నీ తలయు
మీసలును గడ్డమును నరసినను నీ ముక్కు నీ కన్నులు
నీ యెఱ్ఱని పెదవులు విస్పష్టముగా కనిపించుచుండును.
ఈ నీ చెవియొక్క పైభాగమునుండి గడ్డము క్రిందివఱకు
తెల్లని వెంట్రుకలు చిక్కగా నున్నవి. అంతయు కలిసి
యుండును. నిన్నుఁ జూచినచో భయమువేయదు. మీ తమ్ముఁ
డును మంచివాఁడే. ఆయనయు మమ్ము దగ్గఱకు తీసికొను
చుండును. లాలించుచుండును. అవియు నివియు కొనిపెట్టు
చుండును. అదియేమోకాని యాయన రెండుమూఁడుసార్లు
పిలిచినఁగాని యాయనవద్దకు పోవలె ననిపించదు. నీవు పిలువ
నక్కఱలేదు. నీవింకేదియో యోచించుచున్నప్పుడుకూడ
మేము నీమీఁద వచ్చి పడిపోదుము. నీవు విసివికొనవు.
మేము నీ బిడ్డలమే యన్నట్లు చూతువు. నీ మనుమరాండ్రు
నీకుఁ గలరు. వారితోపాటే మమ్మును చూతువుగాని వేఱుగా
చూడవు. జనుద్రథుఁడుతాత యట్లుకాదు. ఆయన యేదైన
యాలోచన చేయుచున్నప్పుడు మేమాయన వద్దకే పోము.
ఒకవేళఁ బోయితిమా యాయన కసరుకొనును. దూరముగాఁ
బొండనును. మేమంత దూరమే రానీయము. నీవు నమ్మును—

నమ్మకపోమ్మా. ఆయన యేదైన నాలోచించుచున్నప్పు డెట్లుండునో తెలియునా?"అని యమృతవల్లి యూరకుండెను. ఆ వృద్ధుని పేరు విదురుఁడు. విదురుఁ డిట్లనెను. "ఎట్లుండు నమ్మా!" - ఆమె సమాధానము చెప్పలేదు. విదురుఁడు రెండు మూఁడుసార్లు చెప్పుమని యడిగెను. ఆమె యిట్లనెను. "తాతా! నీవు పెద్దవాఁడవా? జయద్రథుఁడు తాత పెద్దవాఁడా? శ్రీమాలికి నాకును నీ విషయములో కొంచెము మాటమాట పెరిగినది. ఆమె నీవే పెద్దవాఁడవనును. నేను జయద్రథుఁడు తాతయే పెద్దవాఁ డంటిని. ఇద్దఱము పందెము వేసికొంటిమి" అనఁగా విదురుఁడు "పందెముకూడ వేసికొంటిరా? ఈమాత్ర మునకు పందె మెందుకమ్మా? మా యిద్దఱిలో నెవ్వరి నడిగినను చెప్పుదుముకదా? ఏమని పందెము వేసికొంటిరి?" అమృతవల్లి సమాధానము చెప్పలేదు. విదురుఁడును మాటాడలేదు. ఇంతలో శ్రీమాలి వచ్చుచుండెను. అమృతవల్లి యిట్లనెను. "అదుగో శ్రీమాలి నీ ముద్దు మనుమరాలు. ఇంక నేను వెళ్ళిపోదునా?" విదురుఁడనెను. "ఎచ్చటికి పోదువు? అమృతవల్లి:- ఎచ్చటికిఁ బోదును. జయద్రథుఁడు తాతవద్దకుఁ బోదును." విదురుఁడు:- అతఁ డేమైన నాలోచించుచుండు నేమో!" అమృతవల్లి :— ఏమైనను నాకు తప్పదుకదా! విదురుఁడు:— నీకును శ్రీమాలికినిఁగల భేదము జయద్రథునకు బాఁగుగా తెలియును, గదా! కనుక నీబదు లామెనుఁ బంపించినచో లాభములేదు. కనుక నీవే వెళ్లవలయును. అమృతవల్లీ! నాకు శ్రీమాలి యెట్టిదో నీవు నట్టిదానవే. మీ యిద్దఱినడుమ నాకు భేదము

లేదు. ఆమె నా కెంతటి ముద్దుబిడ్డయో నీవు నంతటి ముద్దు బిడ్డవే. తల్లీ! మీకిద్దఱేయేమి? ఈ చుట్టుపట్లగల పదిపదేను మంది పిల్లలు మగపిల్లలు నాడుపిల్లలు మా యింటికి వచ్చు చుందురు. వారందఱియందు నాకొక్కటే భావము. నేనొక రికి ప్రత్యేకము తల కెత్తినదిలేదు. మఱియొకరికి లేదు పొమ్మన్నది లేదు. ఈ చుట్టుపట్లనున్న పలు సంసారములలోని తల్లులు తమ పిల్లలను తీసికొనివచ్చి నావద్ద దించి పోదురు. నేను వారితో నాడుకొందును. వారికి నాయందు చనవు. అందఱు నన్ను 'తాతా!' యందురు. పసిపిల్ల లెంత యేడ్చు చున్నను నే నెత్తికొన్నచో నవ్వుదురు. ఏడ్పు మానుదురు. ఇంతలో నాయందుఁ జన వగుదురు. నేను చిరుచప్పట్లుచఱచి రమ్మని చేతులు చాచినచో నామీఁది కురుకుదురు. నీవును శ్రీమాలియు గొప్పయింటిబిడ్డలు. మీతల్లులు తీసికొనివచ్చి మిమ్ము నావద్ద నెప్పుడును దించలేదు. తక్కిన పిల్లలతో మీరే వచ్చుచుండిరి. మీ తల్లిదండ్రు లుదారులుకనుక యీ పేదవాని యింటికిఁ బోరాదని వారించలేదు. మీరు బ్రాహ్మణులు. నేను శూద్రుఁడను. మీరు ధనవంతులు. నేను పేదవాఁడను. మీ తండ్రు లధికారులు. నా కే యధికారమునులేదు. బ్రతుకంతయుఁ బూర్వులిచ్చిన యల్ప మైన యాస్తి తినుచుఁ గడపితిని. నా కొక్కఁడే కొడుకు. వాని కిద్దఱు కూతుండ్రు. ఈ చుట్టుపట్లనున్న యాడు పిల్లలు వారితో నాడుకొనుటకు రాఁగా మీరందఱు వారికిఁ దోడుగా నుందురని తొలుత మీయందఱనుకూడ వారితో పాటు ముద్దుగానే చూచితిని. అది యలవాటై పోయినది.

నాదొక మంచిజాతకము తల్లీ! ఇంతమంది మనుమలు మనుమరాండ్రుగల జాతకము. నే నన్నచో మీ యందఱును 'తాత తాత'యని యెంతయో చనువు సెప్పుదురు. ఎంతయో ప్రేమ వెలయింతురు. అసలు మీకుఁగల నిజమైన తాతగారలనుకూడ నన్ను ప్రేమించినంత ప్రేమించరు." అనఁగా నమృతవల్లి యిట్లనెను. "ఇది యేమి తాతా! ఈనాఁడు క్రొత్తకోరణి మొదలు పెట్టితివి?" అనుచుండఁగా శ్రీమాలి దగ్గఱకు వచ్చెను. ఏమే యమృతవల్లీ యని యామె యడుగఁగా నమృతవల్లి విదురుఁడన్నమాటలు శ్రీమాలితో చెప్పెను. శ్రీమాలి యిట్లనెను. "తాత పూర్వపు తాతకాఁడు. మాఱిపోయినాఁడు. మనము క్రమక్రమముగాఁ బెద్దవార మగుచున్నామట. ఆయన గడ్డము పుచ్చికొని లాగరాదట. ఆయన వీపుమీఁద పండుకొనరాదట. ఆయన చేతికఱ్ఱను తీసి దాచరాదట. ఇచ్చట నేమి? మీ యింటిలోసంగతి నాకు తెలియదు కాని మాయింటిలో సంగతి మ్రాఱినది. మా అమ్మగారు నన్ను విదురుఁడు తాతగారి యింటికి పోవద్దు. నీవు పెద్దదాన వగుచున్నావు. కాలిపాఁడుపిల్లవు. మీ నాయనగారు మహా సేనాపతి. ఎక్కడికైననుఁ బోయినచో నశ్వశకటము మీఁదఁ బోవలయును. సేవకులు తోడుగా నరుగవలయును. ఇన్నాళ్ళు నిన్నచ్చటకుఁ బోనిచ్చుటయే తప్పు అనుచున్నది. మా నాయనగారే "విదురుని యింటికిఁ బోయిన తప్పేమో? విదురుఁడనఁగా నిజముగా విదురుఁడే. ఇన్నివందల యేండ్లకు మఱల హస్తినాపురమును వదలి విదురుఁడు గిరివ్రజపురమున

నుదయించినాఁడు. విదురుని యింటికిఁ బోవుటకుఁగూడ గుఱ్ఱపుబండి కావలయునా? విదురుని యింటికి భగవంతుఁడైన కృష్ణుఁడే నడచిపోయెను. శ్రీమాలి బండియెక్కి పోరాదు" అనెను. మా యమ్మగా రూరకుండెను. నేను తాతను చూడకుండ నొక్కదినమైన నుండలేను. ఓసి యమృతవల్లీ! నిజానికి మాయమ్మ చెప్పినమాటయే నిజము. అని శ్రీమాలి విదురునివంకఁ జూచి తాతా! నేను పెద్దదాన నగుచుంటుట లేదా? యనెను. విదురుఁడు నవ్వి "చాల పెద్దదాన వగుచున్నావు. కాని తల్లీ! నాకు మీరెప్పుడును చిన్నపిల్లలవలెనే కనిపించుచుందురు." అనఁగా నమృతవల్లి 'తాతా! నీకు వయసెంత?' యనెను. విదురుఁడునవ్వి 'మే మేమి బ్రాహ్మణులమా? పుట్టినప్పుడు వేళ, లగ్నము, నక్షత్రము మొదలైనవి చూచికొనుటకు? ఎప్పుడు పుట్టితినో నాకే తెలియదు. నా తల్లిదండ్రులు నేను పుట్టినవేళ వ్రాసి పెట్టలేదు. అందుచేత నా వయస్సు నాకు తెలియదు.' అనఁగా శ్రీమాలి యిట్లనెను. 'అట్లయినచో నీ వయస్సెంత యైనను. కావచ్చును. వందయేండ్లు కావచ్చును. నాల్గు వందలయేండ్లు కావచ్చును. పదునేను వందల యేండ్లు కావచ్చును.' అనఁగా విదురుఁడు "అన్నివందల యేండ్లెవరు బ్రతికియుందురు?" అనెను. అమృతవల్లి "ఎవరు బ్రతికి యుందురేమిటి? జయద్రథుఁడు తాత తనకు రెండువేల రెండువందల పాతికయేండ్లని చెప్పెను. నీ వాయనకంటె పెద్దవాఁడ వైనచో నీకు మఱి యైదేండ్లెక్కువ యుండ వచ్చును." అనఁగా శ్రీమాలి "ఐదేండ్లెక్కువయేమి? మా

నాయనగారికి మా పిననాయనగారికి నడుమ సిరువదియే౦డ్లున్నవి. కనుక జయద్రథుఁడు తాతకంటె విదురుఁడు తాత యిరువదియేండ్లు పెద్దవాఁడు.” విదురుఁడు విఱుగఁబడినవ్వెను. “అమ్మా! మీ యిద్దఱు గణితశాస్త్రమునందు ప్రవీణలు. ఇంత చక్కఁగా లెక్కలు వచ్చిన మీకు భర్త లెట్టివాండ్రు కుదురుదురో తెలియదు. వారి యదృష్టము లెట్లుండునో తెలియదు.” అమృతవల్లి “వారి యదృష్టములమాట నాకు తెలియదుగాని వారి యాయుర్దాయముమాట జయద్రథుఁడుతాత చెప్పెను. సున్నలో సున్న తీసివేసినచో నెంత” అనెను. విదురుఁడు తన మొగమునందలి నవ్వునంతయు నుపసంహరించి యమృతవల్లి వంకఁజూచి యిట్లనెను. “నీవు జయద్రథుఁడు తాతవద్దకు పోకుము. అతఁడు మంచి మాటలు చెప్పఁడు. పరాచికముగానైన నశుభపు మాటలు మాటాడరాదు. అనఁగా నమృతవల్లి “తాతా! మీ యిద్దఱిలో నెవరు పెద్ద? ముందది తేల్చికొనవలయును. ఏమే శ్రీమాలీ! నీ వేమందు” వనెను. శ్రీమాలి కానిమ్మనెను. విదురుఁడు మీరు వేసికొనిన పందెములు చెప్పినచో నేను చెప్పెద ననెను. ఇద్దఱును మాటాడలేదు. విదురుఁ డిట్లనెను. “మీరిద్దఱేవో గడ్డుపందెములు వేసికొనియుందురు. అట్టి పందెములు వేసికొనరాదు. ఆ పందెము లేవో నాతో చెప్పుడు.” అనఁగా శ్రీమాలి “తాతా! పందె మిదివఱకే వేసికొంటిమి. ఇప్పుడు వెనుకకు పోవుట యేమున్నది?” అనఁగా విదురుఁడు. “అమ్మా! అయోగ్యమైన మాటలకు పట్టింపులేదు. అజ్ఞానములో ననిన మాటలకు పట్టింపులేదు.

మీరు చిన్నపిల్లలు. మీకు జీవితమనఁగా నేమియో తెలి యదు. మీ ప్రతిజ్ఞ లెట్టి సాహసముతో కూడియున్నవో నాకు తెలియదు. అందుచేత నేను మా యిద్దఱిలో నెవఁడు పెద్దయో చెప్పను.” అనఁగా నమృతవల్లి 'నీవు చెప్పక పోయినచో జయద్రథుఁడుతాత చెప్పు'ననెను. విదురుఁడు తా నతనితోఁ జెప్పవద్దని చెప్పెదు' ననెను. అమృతవల్లి నీవన్నను నతఁడు చెప్పుననెను. విదురుఁడు “అతఁడు నా సోదరుఁడు. నామాట వినునా మీమాట వినునా”యనెను. నాఁగా శ్రీమాలి తాతా! కౌరవ పాండవులు సోదరులేకదా! వారిలో వారి కెంత పడినది? అనఁగా విదురుఁడు వారు సోదరులుకారు. పినతండ్రి పెదతండ్రి బిడ్డలనెను. అమృతవల్లి “మీరును సోదరులు కారటకదా? మీరును పెదతండ్రి పినతండ్రి బిడ్డలేనటకదా!” యనఁగా విదురుఁడు. “వారికి రాజ్య మున్నది. మాకేమి రాజ్యమున్నది? మాకు పోరుపు లెందుకు రావలయును? మేము పంచికొనవలసిన దేమియు లేదు. నా కొడుకు సంపాదించుచున్నాఁడు. మేము తిను చున్నాము.” శ్రీమాలి యిట్లనెను. నీకొడుకు జయద్రథుఁడు తాత కన్నము పెట్ట ననవచ్చును.” అమృతవల్లి యిట్లనెను. “అట్లైనచో మీరిద్దఱికి నడుమ విరోధ మెట్లు వచ్చును? విదురుఁడు తాత రహస్యముగా తన తమ్మునకు నన్నము పెట్టవచ్చును.” అనఁగా శ్రీ మాలి “అదుగో తాత యూర కున్నాఁడు. ఈయనయే పెద్ద. ఆయనయే చిన్న” యనెను. విదురుఁడు “మీలో మీరే మాటాడుకొని మీరన్నమాటకు నే నూరకున్నచో నే నంగీకరించినట్లు భావించినచో నేనేమి

చేయవలయును? అనుకొనినచో ననుకొందు. నేనుమాత్రము నిజము చెప్పను" నాఁగా శ్రీమాలి యిట్లనెను. "తాతా! మీయిద్దఱిలో నెవరు పెద్దవారో చెప్పవలయును. చెప్పినచో మా యిద్దఱిలో నొకరికేనష్టము. చెప్పనిచో నిద్దఱికి నష్టమే." అనఁగా విదురుఁడు పందె మట్లెప్పుడు నుండ దనెను. అమృతవల్లి ఈ పందె మొల్లనన్నదనెను. విదురుఁడిది పందెము కాదనెను. అమృతవల్లి "నిజమే పందెముకాదు. ఇవి మా ప్రతిజ్ఞ"లనెను. విదురుఁ డిట్లనెను. "మీరు చిత్రమైన పిల్లలు." అనఁగా నమృతవల్లి "మేము పిల్లలముకాము. మేము పెద్దవారమైనాము. మాకు సంబంధములు వచ్చు చున్నవి. శ్రీమాలికి సంబంధ మిదివరకే నిశ్చయమైనది. నా వివాహము మఱి కొన్నాళ్ళు జరిగినతరువాతఁ గావచ్చును. కాని శ్రీమాలి పెండ్లి నాలుగైదు నెలలో నగును. మేము పిల్లము కా మనెను. విదురుఁడు "మీ వివాహముల కప్పుడే తొందరయేమమ్మా" యనఁగా శ్రీ మాలి యిట్లనెను. "తాతా! మేము శూద్రులము కాము. వైశ్యులము కాము. క్షత్రియులము కాము. మేము బ్రాహ్మణులము. తక్కిన యన్ని వర్ణములవారును పెద్దయైనతరువాత వివాహము చేసికొనవచ్చును. బ్రాహ్మణస్త్రీలు కన్యలుగా నుండగానే వివాహ మాడవలయును. మా కెనిమిదేండ్లు వచ్చువరకే వివాహ మగును." అనఁగా విదురుఁడు నీకిప్పు డెన్నియేం డ్లనెను. అమృతవల్లి యిట్లనెను. "తాతా! మేము బ్రాహ్మణులమే. మా తండ్రులు తపస్సులు చేయుట లేదు. యజ్ఞయాగాది క్రతువులు చేయుటలేదు. లౌకిక

మునం దున్నారు. శ్రీమాలి తండ్రి మహా సేనాపతి. బ్రాహ్మణులయ్యును క్షత్రియధర్మాచరణము చేయుచున్నారు. అంతదూరము వచ్చినచో మహాసేనాధిపతియైన వాసుదేవుం డేమి? మహారాజైన దేవభూతియే బ్రాహ్మణుండు. రాజును బ్రాహ్మణుండే. సేనాపతియు బ్రాహ్మణుండే - వారు పొద్దుననే లేచి సంధ్యావందనములు చేయుచు కూర్చున్నచో రాజ్యమెట్లు సాగును? సేనా నియోజకత్వ మెట్లుసాగును? లోకమునకును బ్రాహ్మణ్యమునకును సంబంధములేదు. శ్రీమాలి కిప్పుడు పదునేనేండ్లు. నాకును పదునేనేండ్లు. నిజానికి మేము పేరునకు బ్రాహ్మణులముకాని క్షత్రియుల మైపోయితిమి. మేమిచ్చటికి రారాదు. నీవు తాతవుగనుక వచ్చుచున్నాము. నీవుగనుక నా తల్లిదండ్రులు రానిచ్చు చున్నారు," అనంగా విదురుండు నేనుగనుక ననంగానేమి? అని యడిగెను. శ్రీమాలి యతని గడ్డమునులాగి యతనిచేయి పట్టుకొని గుంజి నీవనంగా నిది. అతండు శ్రీమాలి చెక్కిళ్లు పుణికి "బంగారుతల్లివి కదా" యనెను. అమృతవల్లి బంగారము కరిగించినచో నేమగును" అనెను. శ్రీమాలి కరిగించినచో నేమో చెప్పలేను. కరిగిపోయినచో నమృతవల్లి యగు ననెను. అమృతవల్లి అమృతమనంగా విషమనియు నర్థమున్న దనెను. విదురుం డనెను. "మీ రిద్దఱు నావద్దకు వచ్చుచుండుటయేగాక జయద్రథుని వద్దకుంగూడ పోవు చున్నారు. అతండు మీకిట్టి దుష్టపుమాటలు నేర్పుచున్నాం" డనెను. అనంగా శ్రీమాలి "తాతా! నీవు విదురుండవు. బాగుగనేయున్నది. ఆయనపేరు శకుని యని యేలపెట్ట

లేదు" అనెను. అమృతవల్లి యిట్లనెను. "జయద్రథుఁ డోరి గించినదిలేదు. శకుని యోరిగించనిది లేదు. నన్నడిగినచో జయద్రథునికంటె శకునియే మంచివాఁడు." నాఁగా విదురుఁడు "జయద్రథుఁడనఁగా నెవరనెను. అమృతవల్లి తాతా! నీకు భారతకథ తెలియదా! జయద్రథుఁడనగా సైంధవుఁడు. దుస్సల మగఁడు. వాఁడెంత మంచివాఁడనఁగా పాండవుల భార్య ద్రౌపది, వానికి తోఁడఁబుట్టినది కదా! ఆమెను రమ్మని యడిగెను" అనెను. శ్రీమాలి "అసభ్యపు మాటలు మాటాడుచున్నావు." అనఁగా నమృతవల్లి "ఇందులో తప్పేమున్నదే? రమ్మని యడుగుట యన్నమాట పరమసభ్యమైనమాట. ఆమెను కోరెను. ఆమెను వాంఛించెను. ఇవిమాత్రము సభ్యమైన మాటలా? అసలు సృష్టిలో సభ్యతయనియున్నదా? స్త్రీపురుష సంబంధముచేత సృష్టి సాగుచున్నది. సృష్టి సాగుట న్యాయమైన విషయమైనచో స్త్రీపురుష సంబంధము న్యాయ్యమైనది. సభ్యమైనది. స్త్రీపురుష సంబంధ మసభ్యమైనచో సృష్టియంతయు నసభ్యమైనది. సృష్టిజరుగుచున్నచోఁ బండితులు పుట్టినచో వారు సభతీర్చినచో వారు సభ్యులు. వారిభావము సభ్యత. అప్పుడు శ్రీమాలి యిట్లనెను. "ఇది యమృతవల్లి చేయవలసిన తర్కముకాదు. విషవల్లి చేయవలసిన తర్కము. సభ్యతయనఁగా నిదికాదు. సృష్టి జరుగుచుండఁగా నిందు కొన్ని జరుగక తప్పవు. అవి జరుగునని యందఱకును తెలియును. వానినిఁ గుఱించి ప్రస్తావింపకుండుట సభ్యత యందురు." అనఁగా నమృతవల్లి "దానిని నేను దొంగతనమందును. దాఁచి ప్రవర్తించుటయందును.

యని నిర్ణయించువా రెవరనెను. శ్రీమాలి పండితులైనవారు. విదురుఁడుతాత వంటివారు. అనెను. అమృతవల్లి 'జయద్రథుఁడుతాత యెందుకు కాకూడ'దనెను. శ్రీమాలి 'యెందుకు కాకూడదు? ఆయన మంచివాఁడే' యనెను. అమృతవల్లి "ఎవరు మంచివారో నాకు తెలియదు. జయద్రథుఁడుతాత యొక్క యాలోచన వేఱుగా నుండును. విదురుఁడుతాత యొక్క యాలోచన మఱియొకరీతిగా నుండును. ఇద్దఱి యాలోచనలు మంచివే యైనచో మంచిలోకూడ రెండు లక్షణము లుండవలయునన్నమాట." అనఁగా శ్రీమాలి యెందుకుండకూడదనెను. అమృతవల్లి యిట్లనెను. "ఉండకూడ దనియే నాయుద్దేశ్యము. ఉండవచ్చునో కాదో విదురుఁడుతాత చెప్పినచో నొప్పికొందు ననెను." విదురుఁడిట్లనెను. "తల్లులారా! మీరిద్దఱు పండితురాండ్రు. గొప్పయింటి బిడ్డలు. నాకీ సంగతులేమియు తెలియవు. పలుమంది పిల్లలు నావద్దకు వచ్చినట్లే మీరును వచ్చుచున్నారు. నేను చదువుకొనినవాఁడనుకాను. నాకు తెలిసిన దొక్కటియే విషయము. పిల్లలనినచో నాకు ముద్దు. ఏ పిల్లలనైనను దగ్గఱకుఁ దీయుదును. అందఱు నాయందుఁ జనవుగానుందురు. వారు నన్ను వదలిపెట్టి పోరు. ఒక్కటే చూడుడు. మీ కుటుంబము లెట్టివి? మీ వయస్సు లెట్టివి? మీ చదువు లెట్టివి? మీ యాలోచనలెట్టివి? మీరు నన్ను వదలిపెట్టి పోలేకున్నారు. వారమున కొక దినముననైనను తాతను చూచి పోవలయునని వత్తురు. వరుసగా నాలుగైదుదినములు మీరు నాకుఁ గనిపించనిచో నేనును బిడ్డలు కనిపించతే

దనుకొందును. అంతకంటె నా కేమి తెలియును?" అనఁగా శ్రీమాలి యిట్లనెను. "తాతా! నీ వబద్ధములు చెప్పు చున్నావు. మా నాయనగారు నీవు గొప్ప పండి తుఁడ వనెను. బహు విషయములు తెలిసినవాఁడ వనెను. సత్పురుషుఁడ వనెను. ఈ గిరివ్రజపురములో నీవంటి సజ్జనుఁడు లేఁడని చెప్పుచుండును. నీ వేమియు తెలియని వానివలె మాటాడుచున్నావు. మమ్ము మోసము చేయు చున్నావా? మేము బిడ్డల మనుచున్నావు. మానుండి నీ వివేకమును దాఁచుచున్నావు. ఎవ్వరును బిడ్డలను మోస గించరు." అనఁగా విదురుఁ డిట్లనెను. "అమ్మా! మీ నాయనగారికి నామీఁదఁ జాలదయ. ఆయన పూర్వము నా కేదియోం సైన్యములో నొక యుద్యోగమిత్తు ననెను. నాకు వలదంటిని. ఆయన నీ వెట్లు బ్రదుకుదువని యడిగెను. నేను 'ఆయురన్నం ప్రయచ్ఛతి' నాకుపోసినవాఁడు నీకుపోయఁడా' యంటిని. ఇట్లే బ్రదుకుచున్నాను. నాకు మేడలక్కఱ లేదు. మిద్దెలక్కఱలేదు. ఏదో గడచుచున్నది. గొప్ప వాండ్ర పిల్లలు మీ వంటివారుకూడ నూరి చివరనున్న నా పాకకు వత్తురు. మీరు నవ్వినచో నా ప్రాణములలో వెన్న లలు పోసినట్లుండును. మీరు నడచినచో నాకన్నులముందు రంగవల్లులు తీర్చినట్లుండును. మీ మాటలు విన్నప్పుడు నా చెవుల ముంగిళ్ళ నందనవన పారిజాతపు కొమ్మలమీఁద పికములు కూసినట్లుండును. నా బ్రతుకులోని పరమార్థ మింతియ" అనఁగా శ్రీమాలి "తాతా! నీ వెవరికైన నప కారము చేయఁగా నెప్పుడైన నెంచలేదా? అపకారముచేయ

లేక పోవచ్చును. అపకారము చేయవలయునన్న యూహ యైనను రాదా?" అనఁగా నమృతవల్లి "ఏమే శ్రీమాలీ! నీకెప్పుడు నట్టియూహలు వచ్చుచున్నమాట. నీకు విరోధు లెవరు? ఎవరెవరికి నీ వపకారముచేయ నెంచుచున్నావు? వారి పేరులు నాతో చెప్పుము. నేను వారి కపకారముచేసి పెట్టెదను." అనఁగా శ్రీమాలి నీకట్టిశక్తి కలదా? యనఁగా నమృతవల్లి నాకట్టి శక్తిలేదు. కాని నే నొకరిచేతచెప్పి యెవరి కైన నపకారము చేయింపఁగలను. — ఆయొకఁ డెవరు — చెప్పవలసిన యవసరము నాకులేదు. - వారిపేరు తెలియకుండ వారిచేత నింకొకరి కపకారము చేయించు నూహ నాకులేదు. అనఁగా నమృతవల్లి నీ మనసులోని యూహలు నీవే దాఁచికొనుము. నా కెవ్వరును విరోధులులేరు. నీవును నేనును స్నేహితురాండ్రము కనుక నీ కెవరిమీఁదనైన పగ గలిగినచో నామైత్రీ చిహ్నముగా నీ పగ తీర్చిపెట్టుదునంటిని. నీకక్కఱలేనిచో నా కేమి యవసర మనెను. విదురుఁడిట్లనెను. "తల్లులారా! ఎప్పుడును మీ ప్రసంగము లిట్లేయుండును. నన్ను చూచిపోవుటకు వత్తురు. ఇట్లేమో యేమో మాట్లాడుచుందురు. మీ వయస్సెంత? ఒకరిమీఁద పగబట్టుటకు? జీవితములో మీ రేభాగమును గడపితిరి? మీ కింకను ముక్కుపచ్చలారలేదు. మీమాటలు చిత్రములుగానున్నవి. ఇతరు లెవ్వరైన విన్నచో మిమ్ము చెడ్డపిల్ల లనుకొందురు. మీరు సురక్షితములైన కుటుంబములలో పెరిగితిరి. పగయేమి? తీర్చుటయేమి? ఎవ్వరైన నవ్విపోదురు. చాలునుగాని వచ్చి నన్నొక్కసారి కౌఁగిలించికొని మీయిండ్లకు మీరు

పొందు" అనెను. అమృతవల్లి యిట్లనెను. "తాతా! మేము నిన్నిప్పుడు కౌఁగిలించికొనరాదు." అనఁగా విదురుఁడు నాల్గు దినముల క్రిందవచ్చి కౌఁగిలించికొంటివి కదమ్మా యనెను. అమృతవల్లి "జ్ఞానోదయము కలుగుటకు నాలుగు దినము లెందుకు తాతా! నాల్గు గడియలు చాలు"ననెను. శ్రీమాలి నాల్గు లిప్తలే చాలు ననెను. విదురుఁడు "తల్లీ! మీకింత జ్ఞానోదయము కలిగినచో నాకును సంతోషమైన వార్తయే. తాతనుమాత్రము మఱచిపోకుడు" అనెను. అమృతవల్లి "మీ యిద్దఱిలో పెద్దయెవరో చెప్పవా?"యనెను. విదురుఁడిట్లనెను. మీరిద్దఱు నక్కసెల్లెండ్రుకారు. కవలపిల్లలు కారు. ఏకగర్భవాసినులుకారు. శ్రీమాలి తండ్రి వాసుదేవుఁడు. కోసలరాజ్యమునుండి వచ్చెను. నీ తండ్రియైన హరిసేనుఁడు మిథిలనుండి వచ్చెను. ఆయన మహాసేనాధిపతి. నీతండ్రి గొప్ప యధికారి. ఆయనకున్న యధికారముకంటె నాయనకుఁగల ప్రభుత్వము దొడ్డది. మీతండ్రి యొక చిన్న ప్రభువు. మీయిద్దఱకు నాయొద్దనే చెలిమి కుదిరినది. ఇద్దఱు నొక్కరీతిగనే యుందురు. మీలో నొక్కర్తుకనుచూచి మఱి యొక్కర్తుక యనుకొనవచ్చును. శ్రీమాలి నడచుచుండఁగా లేడి నడచినట్లుండును. అమృతవల్లి నడచు చుండఁగా చిఱుతపులి నడచినట్లుండును. శ్రీమాలి చూచుచుండఁగా రసాలవృక్షము నిలువెల్ల పూచినట్లుండును. అమృతవల్లివి నీవు వన్నెచీరలు ధరింతువు. ఎట్టిరంగన్నచో నీకిష్టము. బహిరాకృతిలో నెంతసామ్యమున్నను మీ మనస్సులలోని భేదము మీ నడకలందు మీ చూపులందు మీ ధరించెడు

నడుపులందు మీా యూహల తెన్నులందు వివిధముగాఁ గనిపించుచునే యుండును.

అంతలో పాతికమంది పిల్లలు, ఆఱేండ్ల మొదలు పండ్రెండేండ్లవఱకు వయస్సుకలవారు, కొందఱు మగపిల్లలు కొందఱాడుపిల్లలు బిల్లుమని లోనికి వచ్చిరి. విదురునిమీాఁద నెగఁబడిరి. శ్రీమాలి చుట్టుముట్టిరి. అమృతవల్లిని ముట్టడించిరి. వారి యఱపులు వారి నవ్వులు వారి గంతులు చెప్పుటకు వీలులేకపోయెను. విదురుఁడు వారి నొక్కరొక్కరిని దగ్గఱకు తీసికొనుటయు ముద్దులాడుటయు నదియొక గాలిచేత కదలిన పూచిన పొదరిల్లువలె నుండెను.

౨

కాలంజరి యిల్లిదేనా? అడిగినది యిద్దఱు యువతులు. వారిద్దఱు శ్రీమాలియు నమృతవల్లియు. అడుగఁబడిన ప్రదేశము గిరివ్రజపురమున ప్రాగ్దిశాభాగముననున్న బౌద్ధ విహారము దాటిపోయినతరువాత కొంత దవ్వున నొక పల్లియ కాకుండ పల్లియవలెఁ గనిపించు పది పదేను గుడిసెలలో నొక గుడిసెముందు. అడిగించుకొన్నది యొక యువతి. ఆమె కిరువదియేండ్లుండవచ్చును. స్త్రీ గుమ్మటమువలె నున్నది. ఆటవికురాలివలెఁ గన్పించుచుండెను. శిరోజములు రెండు పాయలుగాఁ దీయఁబడి నాల్గుజడ లల్లఁబడినవి.

రెండు జడలు రెండు నెమరు కణతలమీఁద వ్రాలుచున్నవి. వెనుకటి రెండు జడలు భుజములమీఁదినుండి యెదుఱొమ్ము మీఁదికి తీయఁబడినవి. నాల్గు జడల చివళ్ళయందు చిన్ని ముత్తెపుచిప్పలు గవ్వలు నలంకారప్రాయముగా నమర్చఁబడి యున్నవి. ఆమె ధరించిన దుస్తులు ముదుక, యెఱ్ఱనిగుడ్డలు. ఆమె పాదములయందు, హస్తములయందు రాగితో చేయఁబడిన భూషణములు కలవు. ఆమె మెడనిండ పది పన్నెండు వరుస హారముల పేటలు కలవు. వానిలో నొక్కటియు వెండితోకాని బంగారముతోకాని చేయఁబడినవి లేవు. కొన్ని సామాన్య లోహములతో చేయఁబడిన పూసలపేర్లు. ఒకటి గవ్వలపేరు. మఱియొకటి చిన్ని ముత్తెపు చిప్పలపేరు. మఱియొకటి రుద్రాక్షలపేరు. ఆమె మొగమునఁగల కుంకుమ బొట్టెంత కొట్టవచ్చుచున్నదో యామె శరీర సౌష్ఠవ మంత కొట్టవచ్చుచున్నది. ఇట్లడుగఁబడి యామె సమాధానము చెప్పలేదు. ఆ గుడిసె కొంచె మెత్తైన ప్రదేశమునం దున్నది. చుట్టునునున్న యే గుడిసెకు ద్వారబంధమును మెట్లును లేవు. ఈ గుడిసెకు కలవు. ఈమె ముంగిటఁగల మొదటి మెట్టు మీఁద నిలుచుండెను. అమృతవల్లి మఱల నదియే ప్రశ్న వేసెను. ఆమెమీరెవరు? కాలంజరితో మీకేమిపని?యనెను. అమృతవల్లి "నీకా ప్రసంగ మెందులకు? కాలంజరి యిల్లిది యైనచో చెప్పు"మనెను. ఆమె యిట్లనెను. "కాలంజరి ఇల్లిది కాదన్నచో నబద్ధమగును. అవుననుటకు నా కధికారము లేదు. ఇది యిల్లో కాదో నాకు తెలియదు." అనఁగా నమృతవల్లి యిట్లనెను. "నీవు చెప్పెడు మాటలనుబట్టి

యిది కాలంజరి యిల్లని మాకు తెలిసినది. కాలంజరి యింటిలో నున్నదా?" యనఁగా నా నిలుచున్న స్త్రీ "ఈ ప్రశ్నకు సమాధానము చెప్పవచ్చును. ఆమె యింటిలో లేదు." అమృతవల్లి యెచ్చటికి వెళ్ళినదని యడుగఁగా నా స్త్రీ "ఆమె యెచ్చటకును వెళ్ళలే"దనెను. అమృతవల్లి యిట్లనెను. "ఆమె యెచ్చటికిని వెళ్ళలేదు. ఇంటిలోలేదు. ఈ రెండువాక్యముల కర్థ మెట్లు పొసఁగును? నీకు పిచ్చి యెక్కినదా?" యనఁగా నామె "నాకు పిచ్చి యెక్కలేదు. నీ కర్థము తెలియలే"దనెను. అమృతవల్లికి కోపము వచ్చెను. శ్రీమాలి యిట్లనెను. "కాలంజరీ! మేము నీతో మాటాడుటకు వచ్చినాము. జయద్రథుఁడు మమ్ము నీవద్దకు పంపెను. ఆయన నిన్నెఱుగునటకదా? ఆయన పేరును చెప్పి మమ్ము నీతోఁ బరిచయము చేసికొమ్మనెను." అనఁగా నా స్త్రీ లోనికి రావచ్చునని తాను లోనికిపోకుండ గడపలో నొడ్డిగిలి నిలుచుండెను. అమృతవల్లి నివ్వెఱపోయి శ్రీమాలివంకఁజూచి యామెవెంట లోనికిఁ బోవుచుండెను. కాలంజరి కడపలోననే నిలుచున్నది. వారు తటపటాయించుచుండఁగా నామె వారిని లోనికిఁ బొమ్మన్నట్లు చేయి యూపి తా నచ్చటనే నిలుచుండెను. వారు లోనికిఁ బోయిరి. ఆ యిల్లు చుట్టు పట్లనున్న యిండ్లకంటె పెద్దది. చుట్టున నున్నవి యచ్చ ముగా గుడిసెలే. ఇది యొక చిన్న పాక. అందులో రెండు భాగములు. నడుమ మట్టితో నొక గోడ యమర్పఁబడి యున్నది. ఆ గోడ యింటి కప్పువఱకు లేదు. ఈ ముందటి భాగమునుండి లోపలి భాగమునకుఁ బోవుట కా గోడలో

నొక కంత కలదు. ఈ ముందరిభాగమే వచ్చినవారందఱు గూర్చుండుటకు నేర్పడిన స్థలము. నడుమ పెట్టిన గోడ నానుకొని కాలంజరి కూర్చుండుటకు నొక ప్రదేశ మేర్పాటు చేయఁబడినది. ఆ గోడ కొక వెడల్పైన యెత్తైన కొయ్య ముక్క యానచఁబడి యున్నది. దాని నానుకొని యొక మనిసి కూర్చున్నచో సరిపోవునంత ప్రమాణముగల యొక చర్మము పఱచఁబడి యున్నది. ఆ చర్మ మేజంతువుదో తెలియదు. అది చర్మఫుముక్క కాదు. ఆ జంతువుయొక్క సంపూర్ణమైన చర్మము. ఏదో అడవి జంతువుయొక్క చిన్న పిల్లను చంపి తెచ్చిన చర్మమువలె నున్నది. ఆ చర్మము రంగు కొంత బూదివన్నియగా నున్నది. పులి తోలు మాత్రము కాదు. కాలంజరి కూర్చుండుట కేర్పఱుపఁబడిన యీ యాసనమున కెదురుగా నొక లేడి చర్మమును, కుడి వైపుగా నొక చిఱుతపులి చర్మమును వేయఁబడి యున్నవి వీరిద్దఱుపోయి చూచిరి. ఎచ్చట కూర్చుండవలయును? లోనఁ బరిశుభ్రముగామాత్రమున్నది. కాలంజరి కూర్చుండు చోట నొక బొమికె యున్నది. అది మనిసి ముంజేతి బొమికె కావచ్చును. ఆమె కెడమవైపున నొక చిన్న చిఱుతపులి తల యున్నది. దానిలోఁ గన్నులు కలవు. నోరు తెఱచి యున్నది. కోఱలు కనిపించుచున్నవి. వీరు లోనికిఁబోయి అక్లే నిలుచుండిరి. కాలంజరి యరగడియసేపు లోనికే రాలేదు. వారు కూర్చుండనులేదు. అప్పుడామె వచ్చి మీరు కూర్చుండనే కూర్చుండలేదేమి ? యనెను. శ్రీమాలి యెచ్చట కూర్చుండవలయు ననెను కాలంజరి అది మీకే

తెలియవలయు ననెను. శ్రీమాలి నవ్వి తాను లేడి చర్మము మీఁదఁ గూర్చుండెను. అమృతవల్లికి మొదటి నుండియు నా కాలంజరి మాటాడెడి పద్ధతి బాగుగాలేదు; ఆమెకు చిఱుకోపముగా నున్నది. ఆ కోపముతో నామె చిఱుతపులి చర్మముమీఁద కూర్చుండెను. కాలంజరి వచ్చి తన స్థానమున నాసీనురాలయ్యెను. అప్పుడు శ్రీమాలి యిట్లనెను. నీవు సోదె చెప్పుదువటకదా! మా జాతకము లెట్లుండునో తెలిసికొనుటకు వచ్చితిమి. మాకు సోదె చెప్పెదవా? యనఁగాఁ గాలంజరి సోదె చెప్పుటకు తొలుత సోలెడు బియ్యము నింత యుప్పు నిన్ని మిరియములు నొక ఫలము కొంత రొక్కము దేవలయును. మీరు వట్టి చేతులతో వచ్చిన ట్లున్నారు. అనఁగా నమృతవల్లి అన్నింటికిని కలిపి రొక్కమే యిత్తుము. అనెను. కాలంజరి యెంత యిత్తురనెను. శ్రీమాలి యొక దీనారమును కాలంజరి కీయబోయెను. అమృతవల్లీ! మఱియొక దీనారమునుఁ దీసెను. కాలంజరి యా రొక్కమును తన ప్రక్కనున్న చిన్న చిఱుతపులి తల మీఁదఁ బెట్టుడనెను. శ్రీమాలి తన చేతిలోని నాణెమును చిఱుతపులి తలమీఁదఁ బెట్టెను. దానిమీఁదఁ బెట్టుటకు నామె లేవవలసి వచ్చెను. అమృతవల్లి కూర్చున్న చోటి నుండి లేవలేదు. ఆమె చేతిలోని దీనార మామె చేతిలోననే యుండెను. కాలంజరి యిట్లనెను. "ఇట్లడిగినచో సోదె రాదు. బియ్యమునుఁ దక్కిన సామగ్రియును నా ముందు పెట్టవలయును. నే నొక చిన్న పుల్ల చేతితో పుచ్చుకొందును. ఎవరు సోదె యడుగుదురో వా రాపుల్ల చివర పుచ్చుకొన

వలయును. అప్పుడుగాని ఫలితములు రావు" అనఁగా శ్రీమాలి మేము బియ్యము తీసికొనిరాలేదు గనుక మేము వెల యిచ్చుచున్నాము గనుక నీ యింటిలోని బియ్యమే తీసికొనిరమ్మనెను. కాలంజరి అట్లు చేసినచో సోదెరాదు. మీవంటివా రప్పుడప్పుడు వచ్చుచుందురు, మీ దుస్తులు చూచినచో మీరు గొప్పయింటి పిల్లలుగాఁ గనిపించు చున్నారు. ఇంటివద్దఁ జెప్పకుండ వచ్చినట్లున్నారు. గొప్ప యింటిస్త్రీలు సామాన్యముగా శకటములమీఁద నరు దెంతురు. మీరు కాలినడక వచ్చితిరి. మీ కింకను వివాహములు కాలేదు. గనుక మీరు తల్లితండ్రులకు గారాము బిడ్డలు కనుక నిట్లు వచ్చుటకు వీలైనది" అనెను. అమృతవల్లి ఆ సంగతి నీ కెట్లు తెలియుననెను. కాలంజరి యిట్లనెను; మొదట మీకుఁ బెండ్లిండ్లైనచో మీ భర్త లిట్లు రానీయరు కదా? అందుచేత వివాహములు కాలేదు; మీ మెడలలో మంగళసూత్రములు లేవుగనుక వివాహములు కాలేదని గ్రహించితిని" అనెను; అమృతవల్లి "మేము మా తలితండ్రులకు గారాము బిడ్డలమని నీకెట్లు తెలియును" అనఁగాఁ గాలంజరి మీరిట్లు వచ్చుటయే దానికి నిదర్శనము; తల్లితండ్రుల యదుపు తక్కువ కలవారు. ఆసంగతి తెలియు చునే యున్నదనెను; శ్రీమాలి యిట్లనెను; నీవూరకే చూచు చునే సర్వవిషయములు గ్రహింతువు; సోదె చెప్పనక్కఱలే దనెను; అమృతవల్లి యిట్లనెను; ఈ మాత్ర మందఱును గ్రహింతురు. నీవేమెను పొగడనక్కఱలేదనెను. అప్పుడు కాలంజరి శ్రీమాలితో "ఓ యమ్మా! నాయింటికి రెండిండ్ల

దాటిన తరువాత నొక గుడిసెయున్నది. రెండు రోలీలిచ్చి నచో నాయింటివి సోదెకుఁ గావలసిన సామగ్రియిచ్చును. నీవుపోయి తీసికొనిరమ్మనెను. శ్రీమాలి తనవద్ద రోలీలు లేవనెను. కాలంజరి తన బొడ్డుననున్న రెండు రాగి నాణె ములుతీసి యామెచేతికిచ్చి పొమ్మనెను. అమృతవల్లి యిట్ల నెను. "ఓసి శ్రీమాలీ! దానిదగ్గఱ రోలీలు తీసికొనుట మన కమర్యాద. ఆ గుడిసెవద్దకుపోయి యా సామగ్రి కొని తెచ్చుట నీ గౌరవమునకు తగిన పనికాదు, బియ్యము లేక పోయినచో సోదె యెందుకురాదు? అనఁగాఁ గాలంజరి నిజమేనమ్మా నీవు పోనక్కఱలేదు. మీకు గావలసినసోదె యిదివఱకే వచ్చినదనెను. శ్రీమాలి వెళ్ళిపొమ్మందువా యనఁగాఁ గాలంజరి వెళ్ళిపోవచ్చుననెను. అమృతవల్లికి కనులు జేవురించెను. ఇట్లనెను "జయద్రథుఁడుతాత నీవు సోదె గొప్పగా చెప్పెదువన్నాఁడు. ఆయన చెప్పెను గావున వచ్చితిమి. లేనిచో మేము వచ్చెడివారమేకాము. ఈ దీనా రముకూడ తీసికొమ్ము-మేము వెళ్ళిపోదుము" అనఁగాఁ గాలంజరి ఆరొక్కఁము పులితలమీఁద పెట్టవలయును. లేనిచో తీసికొని పోవచ్చుననెను. అమృతవల్లి నేను తీసికొనిపోను. ఆపులితలమీఁదకూడ పెట్టను. అని లేచి వాకిఁటిలోనికిఁ బోయెను. కాలంజరి యాదీనారమును తీసికొని బయట విసరివేసెను. అది యమృతవల్లి మడమకు తాకెను. ఆమె కోపముతో రెండింతలయ్యెను. ఆమెకు సుంతదెబ్బ తగిలెను. కొంచెము నొప్పిపెట్టెను. వెంటనేతిరిగి లోనికివచ్చి కాలం జరిని తిట్టుట కుద్యుక్తురాలయ్యెను. శ్రీమాలి బయటకు

వచ్చి యమృతవల్లితో "ఇదియేమమ్మా మన మిద్దఱము బయలుదేరునప్పు డేమనుకొని వచ్చితిమి. మన మెవ్వరమో యెవ్వరికిని తెలియకుండఁ బ్రవర్తింపవలయు ననుకొని వచ్చితిమి. అయినను మన వేషములు చెప్పనే చెప్పినవి; దానితో పాటు మన రాచరికముకూడ నిచట వెలయించినచో మఱియు బయటపడిపోమా? నీవిప్పుడు కాలంజరి నేమైన నన్నచో నామె కేకలు వేయును; నాల్గుగుడిసెలవాండ్రు ప్రోవగుదురు; మన రహస్యము బయటపడును; అదియుఁగాక మన మేదైన పనిమీఁద నొకచోటికిఁ బోయినచో నాపని యెట్లు సాధించికొనవలయునన్న ప్రయత్నము చేయవలయునుగాని మొదటి నుండి కస్సుబుస్సు లాడినచో నేమిలాభము? కోపపడకుము; లోనికిరమ్మా: దీనారమును చిఱుతపులి తలమీఁదనుంచుము. అది యేమన్నా, మన భవిష్యత్తు లెట్లుండునో తెలిసికొనుట మనకుఁ బ్రధానమా? మనమంత వారిబిడ్డలమని దానిదగ్గఱ వెలయించుట ప్రధానమా?" అని సాధువుగాఁ జెప్పి యామె నొప్పించి లోనికిఁ దీసికొనిపోయి యామె చేతిలోని దీనారమును తీసికొని తానే పులి తలమీఁదఁ బెట్టి 'నే నిప్పుడే వత్తును. నీ విచ్చట నుండు' మని యమృతవల్లితో చెప్పి యా రెండు తోలీలు తీసికొని పొరుగింటికి పోయెను. అమృతవల్లి తల వంచుకొని కూర్చుండెను. కాలంజరి నవ్వుచు నామెవంకఁ జూచుచుండెను. నడుమ నొకసారి యమృతవల్లి తలయెత్తెను. కాలంజరి నవ్వుచుండెను. ముంగిటనిలుచున్నప్పుడు కాలంజరి మొగమాటవికురాలి మొగము మోటుమనిసి మొగము. తక్కువ కులముదాని మొగము. ఈ నవ్వుచున్న కాలంజరి

మొగము నాగరకురాలి మొగము. ఆ మొగములో సేవకుల లక్షణములేదు. గడపముందు నిలుచున్న కాలంజరి మొగము సోదెలు చెప్పికొంచు బ్రతుకు గడపుచున్న క్షుద్రకుల స్త్రీ మొగము. ఈ నవ్వుచున్న కాలంజరి మొగము తనతో సమానమైన ప్రతిపత్తిగల యొక స్త్రీ, తనకంటె వయస్సుచేత పెద్దది, తెలివితేటలచేత నధికురాలైనది; తనయందు జాలియు నాదరమును కలిగినదియు నగు నొకానొక స్త్రీ మొగము. అమృతవల్లి కోపమంతయు పోయెను. కాని బిగువు పోలేదు. మఱలఁ దల వంచికొనెను. కాలంజరి యిట్లనెను. "ఏమమ్మా! నీకు సోదె యక్కఱలేదా? ఆమె వచ్చినతరువాత మఱల రెండుతోలీలిచ్చి పంపుదును. నీకుఁగూడ సోదెచెప్పెద"ననెను. అమృతవల్లి ముక్కుపై వ్రేలు వేసికొనెను. కాలంజరికి తెలిసెను. వెళ్లిన స్త్రీ యెవరో చాల గొప్ప యధికారి కూతురై యుండవలయును. కాలంజరి యిట్లనెను. "అమ్మా! నేను పోయి తీసికొనిరారాదు. లేనిచో నేనే పోయి తెచ్చెడి దానను" అనఁగా నింతలో శ్రీమాలి వచ్చెను. కాలంజరి యొక చిన్న పేళ్ళతోనేసిన పళ్ళిక మూతవంటిది పైనఁగ్రింద నేవో యడివియాకులతోఁ గుట్టినది యచట పెట్టెను. శ్రీమాలి బియ్య మందులో పోసెను. కాలంజరి తనకు కుడివైపుననున్న బొమికె తాను చేత పుచ్చుకొని రెండవవైపు శ్రీమాలి యొడలు గగుర్పొడిచి చేయి వెనుకకు లాగికొనెను. కాలంజరి నవ్వెను. అమృతవల్లి తా నాబొమిక చివరను చేతఁగొని తనకు సోదె చెప్పు మనెను. కాలంజరి యెవో యెవో దేవతల— భద్రకాళి, చండి, మాహేశ్వరి, భ్రమరి మొదలైన దేవతల

ప్రార్థనచేసి కనులుమూసికొని కొంతసేపూగి చివరకుఁ గనులు తెఱచి బాలికను నేలమీఁదబెట్టి యిట్లనెను. "నీ వెవరవమ్మా తల్లీ! నాకు పూనకము వచ్చుటలేదు. నేను ప్రయత్నము చేసితిని. ఊగులాడితిని. దేవతాప్రార్థనము చేసితిని. ఇన్నైనన్ను డును జరుగలేదు. నేనేమిచేయుదును? నేను చేయఁగలిగిన దేమియును లేదు. నాకు పూనకము రాకుండ నేనేమి చెప్పఁ గలను? మీ దీనారములు మీకు తీసికొనిపొండు. అని రెండు దీనారములు తీసి వారి కీయఁబోయెను. వారిరువురును బుచ్చుకొనలేదు. అమృతవల్లి యిట్లనెను. "ఓసి కాలంజరీ! మా దీనారములు మేము తీసికొనిపోయినచో నీకు రెండు ఱోలీ లప్పుపడుదుము. అవి యెట్లు తీర్పఁగలము." అనఁగాఁ గాలంజరి యిట్లనెను. "మీ రా యప్పు తీర్చనక్కఱలేదు; ఎందుకనఁగా నాకుఁ బూనకము వచ్చినచో మీ కేమైనఁ జెప్పినచో నది యప్పు అది ఋణము; మీ యిద్దఱిపేళ్లను నే నడుగుచున్నాను; మీ రెవ్వరో నాకు చెప్పుడు; ఏల యనఁగా నావద్దకు పలుమంది సోదెకొఱకు వత్తురు; వారి మనశ్శక్తి నా మనశ్శక్తికంటె తక్కువది; నా యెడలఁగల దేవతాప్రసాద మధికమైనది; వారెవ్వరికి నా కున్నంత దేవతాప్రసాదము లేదు; నేను తక్కువకులముదాన ననుకో వచ్చును. వా రెక్కువ కులమువారు కావచ్చును; ఇది కులముతోడి సంబంధముకాదు మనస్సునకుఁగల యొక్క పరిపాకమునకు సంబంధించిన విషయము నా కిప్పు డిరువది యేండ్లు. నేను నా జన్మలో నబద్ధమాడలేదు; నే నొక పాపపుపని చేయలేదు. నా కులధర్మమే నేను చేయుచున్నాను;

అందుచేత దేవతలు నాయందు ప్రసన్నులై యున్నారు; నావద్దకు సోదె చెప్పించుకొనుటకు వచ్చెడివా రెవ్వరు నీ జన్మలో నావంటి యచ్చమైన బ్రదుకు బ్రదికినవారు కాకపోవుట చేతనో పూర్వజన్మలో నేనుచేసిన పుణ్యము వారి పుణ్యము కంటె కొంచెము మిక్కుటముగా నుండుటచేతనో నేను వారి భవిష్యత్తును చెప్పుటకే సమర్థురాల నగుచుంటిని. నాకు పూనకము వచ్చుచుండెను; ఆ పూనకములో నేమి చెప్పెదునో నాకు తెలియదు. వారు తృప్తిపడి పోవుచుండిరి; మీరిద్దఱు పుట్టినప్పటినుండి నావలెనే యబద్ధమాడినవారు కారు; అన్యాయమును చేసినవారు కారు; పాపపుటూహలుకలిగిన వారు కారు; మీ పూర్వజన్మలలోకూడ మీ రుత్తమజీవులే యైయుందురు; అందుచేత మీకును నాకును చెలిమియున్నది. అందుచేత రెండు రోజులు మీరు నా కప్పుపడరు; మఱియు నొకటి చెప్పెదను; మీకు చెప్పవలసిన సోదె పూర్వమే చెప్పఁబడినదని నే నన్నాను; జ్ఞాపకమున్నదా? దానియర్థ మేమో చెప్పెదను; నాకీపూట నెవ్వరో యిద్దఱు గొప్ప యింటివారు సోదె చెప్పికొనుటకు వత్తురన్న స్ఫురణ భాసించినది; నేను మీకొఱకే యెదురుచూచుచు గడపలో నిలుచుంటిని; మీరు వచ్చితిరి; మిమ్ము లోనికిఁ బంపించితిని. ఎందుకనఁగా మీరు లోనికి వచ్చి యెవ్వరు దేనిమీఁద కూర్చుందురో దానినిఁబట్టి మీ లక్షణములు గొన్ని తెలియఁగలవు; అందుకని పంపించితిని. మీరు లోనికివచ్చి కూర్చుండలేదు; నేను కూర్చుండుమనఁగా కూర్చుంటిరి; ఆమె లేడి చర్మముమీఁదఁ గూర్చుండెను. నీవు చిఱుతపులి

చర్మముమీఁదఁ గూర్చుంటివి. ఇదియొక శాస్త్రము. మీరు కూర్చున్న చర్మములనుబట్టి మీస్వభావములను చెప్పనగును. తెలియుచునే యున్నదికదా? ఆమెది సాధువైన ప్రకృతి. నీది అంత సాధువుకాదు. ఆమె తాను గొప్పయింటి బిడ్డయైనను లేచి నిలుచుండి దీనారము పులి తలమీఁద పెట్టినది. పోయి సోదెకుఁ గావలసిన సామగ్రి కొనితెచ్చినది. నిన్ను బతిమాలి లోనికిఁ దీసికొనివచ్చినది. ఆమెయందు వినయమున్నది. మంచితన మున్నది. పరిస్థితుల కొదిగి ప్రవర్తించు లక్షణ మున్నది. నీయం దదిలేదు. నీ ప్రకృతి తాటిపట్టకెదురుదేకును. నీయందును మంచితనము కలదు. ఆ మంచితనము తరువాత భాసించినది. నేను నిన్నుచూచి నవ్వితిని. నీవు సహజముగా మంచిదానవుగనుక నాయందుఁ బ్రసన్నవైతివి. సహజముగా మంచి లక్షణములు లేని స్త్రీయైనచో నీవలెఁ బైకి నింతటి యాధికారిక భావము ప్రదర్శించు స్త్రీయైనచో, నా నవ్వునుచూచికూడ తిరస్కరించును. నేను శూద్రకుల స్త్రీని, మీ రుత్తమకుల సంజాతలు. ఒక యుత్తమకుల సంజాతయైన స్త్రీ శూద్రకులస్త్రీయొక్క స్నేహపూర్వకమైన మందహాసమును పాటించునా? పాటించదు. పాటించుట కూడ తన గొప్పదనమునకు భంగ మనుకొనును. నీవట్లనుకొనలేదు. అందుచేత నీయాత్మ వస్తువు మంచిది.

ఆమాటల కమృతవల్లిలోనున్న మంచితనమంతయు నుబికివచ్చెను. ఆమె యిట్లనెను 'ఓసి కాలంజరీ! నీ వూరకే నవ్వితివనుకొంటివా? నీనవ్వులో నమృతపు బావు లున్నవి. నీవు నవ్వుచుండఁగా–నీవు చెప్పితివే నీవిరువదియేండ్లొక విధ

మైన తపోజీవితమును సాగించితివని, ఆ తపస్సంతయు వెలికి వచ్చుచున్నది. నవ్వినప్పటి నీ మొగము నేను చూచుచున్న వేళ నీవు నాకు క్షుద్రకుల సంజాత వనిపించలేదు. స్నేహ లోకములని కొన్ని లోకములున్నచో నాలోకములలోనున్న యొక దేవతాస్త్రీ నాయందు మైత్రి నెఱపుచున్నదనిపించి నది. దానితోపాటు నీవిప్పుడు మనకు చెలిమి కలిగినదని చెప్పితివి. నేటినుండి మనము ముగ్గురము చెలిమికత్తియ లము. నీ కంగీకారమేనా ?' యనఁగా శ్రీమాలి యిట్లనెను. 'కాలంజరీ ! మేము చెఱియొక చర్మముమీఁదఁ గూర్చుంటిమి. దానినిఁబట్టి నీవు వండ చెప్పితివి. కొంత పోసఁగినట్లే యున్నది. అమృతవల్లి లేఁడిచర్మముమీఁద కూర్చున్న దను కొనుము. నేనే పులిచర్మముమీఁద కూర్చుంటి ననుకొనుము. అప్పుడేమి చెప్పెడిదానవు?' అనఁగాఁ గాలంజరి నవ్వి యూర కుండెను. అమృతవల్లి యిట్లనెను. 'ఓసి శ్రీమాలీ ! అట్లైనన్న టికేని జరుగదు. మనము చేసెడి ప్రతిచిన్నపనిలోను మన మన స్వభావములు గోచరించును. ఎందుకు గోచరించు ననఁగా మన స్వభావములనుఁబట్టియే యాపనులు జరుగును గనుక. మాయింటివద్ద నాసనములమీఁద నిఱ్ఱితోళ్ళు పులి తోళ్ళు సమృద్ధిగాఁ గలవు. మీ యింటనుఁ గలవు. మా యింటిలో నే నెప్పుడు లేళ్ళతోళ్ళమీఁద కూర్చుండనే కూర్చుండను. నాకా లేఁడిచర్మము లందముగాఁ గనిపించవు. పులిచర్మమో, చిఱుతపులిచర్మమో, భల్లూకపు చర్మమో నాకందముగాఁ గనిపించును. అవి యెక్కువ మెత్తగాఁ గూడ నుండును. ఒకవేళ నీవిచ్చట నాకంటెముందుఁ బులి

చర్మముమీఁద కూర్చుంటి వనుకొమ్ము. నేనేమిచేసెడి దాననో తెలియునా ? నిన్ను లేఁడిచర్మముమీఁదికి పంపించెడి దానను.' అంత శ్రీమాలి యిట్లనెను. 'కాలంజరీ! సరే, మేమిద్దఱ మిట్లే రెండుచర్మములమీఁదఁ గూర్చుండుటచేత మాస్వభావములనుఁ దెలిసికొంటివి. మా ప్రవర్తనచేత నాయాథార్థ్యమును నీకు మేము ఋజువుచేసి నట్టితిమి. మా స్వభావములు మాకు మాకే యింత విస్పష్టముగాఁ గాకపోయి నను పరస్పరము కొంచెము కొంచెముగా తెలియును. ఇంత టితో సరిపోయినదా ? మఱియేమైనను చెప్పఁగలవా ?'' అనఁగాఁ గాలంజరి యిట్లనెను. 'నేను చెప్పుటకు నాకు పూనకమే రాలేదాయెను. కాని ఈ సూచనలు కలిగెను. మీ ప్రకృతులు తెలిసెను. నాకొక్కటే జ్ఞాపకము వచ్చుచున్నది. ఈలేఁడి యెట్లు చంపఁబడినదో, ఈపులి యెట్లుచంపఁబడినదో నాకుఁ దెలియును. ఈచర్మములువచ్చి నాలుగేండ్లు గడచి నవి. మొదట లేఁడిచర్మము వచ్చినది. తరువాతఁ గొన్నాళ్ళకు పులిచర్మము వచ్చినది. ఆచర్మములు తెచ్చిన యిద్దఱును నాకా జంతువు చనిపోయిన కథలుచెప్పిరి. అవి జ్ఞాపకమున్నవి. నేను వాని నెప్పుడును స్మరించలేదు. స్మరించవలసిన యవసరము నాకు కలుగలేదు. నాకు పూనకము వచ్చును. నేనేదో చెప్పుదును; సరిపోయెడిది; మీస్థితి దానికి భిన్నముగా నున్నది; సూచనలచేత మీసంగతి గ్రహించవలయునేకాని మఱియొకవిధముగా కాదు; మీ స్వభావములిట్లు తెలిసినవి; ఆ లేఁడియొక్కయు నీ పులియొక్కయు కథలు చెప్పెదను; వానివలన మీ భవిష్యత్తులు తెలియునేమో !

మిాభవిష్యజ్జీవితములయొక్క సూచనలు వానికథలలో నుండు నేమో? నాకు తెలియదు; చెప్పుమన్నచోఁ జెప్పెదననెను; శ్రీమాలి చెప్పుమనెను; అమృతవల్లి మున్ను పులికథ చెప్పు మనెను. శ్రీమాలిముందు వచ్చినది లేఁడిగనుక లేఁడికథయే ముందు చెప్పవలయు ననెను. కాలంజలి యిట్లు చెప్పెను. “అప్పటికి నేను సోదెలు విజృభించి చెప్పుటలేదు. మా తల్లి సోదెలు చెప్పెడిది. ఆమెదగ్గఱ నే నీ విద్య నేర్చికొన్నాను. నా కీ వృత్తి చేయవలయునని చిన్నప్పు డుండెదికాదు. ఇది యొక నీచవృత్తియని నే ననుకొనుచుండెడిదానను. నాతల్లి చనిపోవుచు నేనీవృత్తి మానననని తన చేతిలో చేయి వేయించుకొని పోయెను. నేనేమి చేయఁగలను? ఇదియొక వృత్తిగాఁ జేసికొని మా సోదెచెప్పువాండ్రు ధోరణిగా నేదో చెప్పునట్లు చెప్పుట నా కిష్టములేదు. అది దొంగ బ్రతుకని యనిపించినది. మా దీయూరుకాదు. ఇచ్చటికి పది యామడల దూరమునఁ దూర్పునైపుగా సముద్రపు టొడ్డున నొక యడవియున్నది. అచట నొక చిన్న పల్లె కలదు. ఆ పల్లియపేరు చంద్రవంక. ఆ మాగూడెమునకు దగ్గఱగా నొక చెట్టుక్రింద నొక దేవతకలదు. దేవతయనఁగా నొక ఱాయి. ముక్కు మొగము కలదు. దానికే మావాండ్రు పసుపు కుంకుమలు పెట్టి వేటలను నరకి జాతరలు చేయుదురు. ఆమె చండి. నాకు చిన్నప్పటినుండి యీ చండిమిాఁద నమ్మకములేదు. వారు మ్రొక్కులు చెల్లింపఁగా వేటలు నరుకఁగా నేను వెక్కిరించెడిదానను. మాయమ్మ కన్నులు పోవునని చెంపలు వేసికొనుమనెడిది. ఆమెపోయిన తరువాత

నొకనాఁడు నిర్జనముగానున్నవేళ నేను చండివద్దకుఁ బోయి నమస్కారముచేసి తల్లీ! నీవు నిజముగా దేవతవైనచో నా కీనృత్తిని తప్పింపుము. నేనీ దొంగసోదెలు చెప్పలేను. మా తల్లికి వాగ్దానము చేసితిని ఆ యనృతదోషము నాకులేకుండ చేయు మంటిని. అప్పు డాదేవి కెదురుగా నిలుచున్న నా యొడలు నాకు తెలియలేదు. ఆ దేవత నాకుఁ గనిపించెను. ఓసీ! కాలంజరీ, నిన్ను నేను పూనెదను. నీవు దొంగ సోదెలు చెప్పనక్కఅలేదు. నీవు మగధరాజ్యమునకుపొమ్ము. అచ్చట గిరివ్రజపుర సమీపమున నొటచోట నుండుము. నీవద్దకు సోదెలకు వత్తురు. నేను నిన్ను పూనుచుందును. నీవు చెప్పనే యక్కఅలేదు. నేనే నీ నోటిద్వారా చెప్పు చుందు ననెను. నేనుఁ తల్లీ! నిజములు చెప్పుదువా? అబద్ధ ములు చెప్పుదువా? అని యడిగితిని. దేవి నవ్వి ఆ సంగతి నీకెందుకు పోయనెను. నాయొడలు నాకు తెలిసెను. నే నిచ్చటికి వచ్చితిని. ఇది నా కథ. ఇక్క నేను సోదెలు చెప్పుట కేర్పాటైన పరిస్థితులు చాల కలవు. మనమిప్పుడు చెలిమిక త్తెలముకదా! మఱల మఱలఁ గలిసికొందము. తరువాత తరువాత చెప్పెదను. నే నిచ్చట నుండఁగా నా ప్రతిష్ఠ యెట్లు వ్యాపించినదో నాకు తెలియదు. గొప్ప గొప్పవారే రా నారంభించిరి. వారు వచ్చినచో కూర్చుం డుటకు యోగ్యమైన యాసనము లిచ్చుట లేదని నేననుకొను చుండెడిదానను. ఈ గుడిసెలలో చివరిగుడిసెలో నొకఁడు వేటకాఁడు కలఁడు. అతఁడు నాకీ లేఁడి చర్మమును తెచ్చి పెట్టెను. అతఁడు దీని కథ నిట్లు చెప్పెను. అతఁ డొకనాఁడు

వేటకు బోఁగా దినమెల్ల తిరిగి తిరిగి బాణములు వేయుటకు తగిన జంతువు కనిపించక యటమట లాడిపోయెను. అతఁడు తొలుత నడవిలోనికిఁ బోయినప్పుడే నిండుచూలాలైన యీ లేఁడిని చూచెను. ఈ లేఁడి గర్భభరాలసమై యతనినిఁజూచి కూడ లేవలేదు. దీని నెట్లు చంపుదునని యతఁడు దీనిని వదలిపెట్టి యడవియంతయు తిరిగి తిరిగి యేజంతువును కనిపించక చంపుదమని యూహ లేకున్నను మఱల నీ లేఁడి యచ్చటఁ బండుకొని యున్నదేమో చూడవలయునని యచటికి రాఁగా నాలేఁడి యీనియుండెను. దాని పిల్ల కుంటుకొనుచుఁ దూలుచు దాని ముంగాళ్లఁ దిరుగుచుండెను. వానికి ముద్దువేసెను. సహజమైన కిరాత లక్షణముచేత చంపవలయుననియు ననిపించెను. కాని చంపుటకు ప్రాణ మొప్పలేదు. పవలెల్ల దేనిని చంపని చేతి జిల వదలించుకొనుటకు పిల్లలేఁడి దగ్గఱగా దానికి తగులకుండ నొకబాణము వేసి తల్లిని బెదరించి పోవుదమని వాఁడాపసిలేఁడి దగ్గఱగా బాణము వదలెను. వాని దుర్భాగ్యమో, ఈ తల్లిలేఁడి దుర్భాగ్యమో వాఁడనుకొనకుండ నా బాణము మాలేఁడి పిల్లకు తగిలెను. అది చనిపోయెను. ఆవేళ కన్నియు నట్లు కలిసివచ్చెను. ఆ ప్రక్కనే పెద్ద కొండవాగు ప్రవహించుచున్నది. కొండవాగుల సంగతి మీకు తెలియదేమో, నిముసములో బడఁబోసికొని వచ్చును. వాని వేగముముందేనుఁగులు నిలువలేవు. ఆకొండవాగుప్రక్కనట్లు ప్రవహించుచున్నది. ఈ తల్లిలేడి చనిపోయిన బిడ్డనుచూచి నోరు తెఱచి యఱచినది, వేటకానివంక చూచినది. అరగడియసేపు

తిరుగుళ్ళు పడినది. ఆ ప్రక్కవాగులో దూకినది. దానిని బ్రతికించవలయునని యా వేటకాఁడు విల్లమ్ములనొడ్డునపెట్టి యేటిలోనికి దూకెను. ఇద్దఱును కొట్టుకొనిపోయిరి. చివరకు వాఁడు తల్లిలేడిని పట్టుకొనెను. యోజనముమేర దాని నొడ్డుకు తెచ్చెను. దానిమీఁద పడి యేడ్చెను. వాని కేమి చేయవలయునో తెలియలేదు. ఆ లేడిని చీల్చెను. దాని మాంసము నంతయు నా యేటిలో పాఱవేసెను. చర్మము కడిగెను. దానిని బుజాన వేసికొనెను. ఇంటికి తెచ్చెను; ఎండఁబెట్టెను; ఈ కథయంతయు నాకు చెప్పెను; దానిని నా కిచ్చెను; ఓ యమ్మ కాలంజరీ! నీవు దేవతవంటి దానవు; నీ వెంత చెప్పినచో నంత యగుచున్నది; ఈ లేడి గొప్ప జీవము; దీనిని నీ పాకలో పఱచుము; దానిమీఁద నెంత మందియో పుణ్యాత్ములు వచ్చి కూర్చుందురు. నేను దీనికింతకంటె నేమి చేయఁగలుగుదును? ఒకొక్కనికి పాప మెదురుగా వచ్చును. ఈ పాపము చేయుమురా యన్నట్లుండును. నాకట్లు జరిగినది. అని యతఁ డేడ్చెను. ఇది దీనికథ.' అనఁగా శ్రీమాలి ఈకథకు నాకు నేమిసంబంధ ముండును అనెను. అమృతవల్లి పులికథ చెప్పు మనెను. కాలంజరి యిట్లనెను. తల్లీ! నీకెంత తెలియునో నాకు నంతే తెలియును. ఇద్దఱము నూహించవలసినవారమే. మీరు చదువుకొన్నవారు. నే నజ్ఞానురాలను. మీకంటె నే నెక్కువ యూహింపఁగలనా? అని యిట్లు చెప్ప నారంభించెను. ఆవేటకాఁడే తరువాత నొక యేడాది మఱల వేటకే పోలేదు. అతనికొక వైరాగ్య

ముదయించెను. కాని వాని కిల్లుగడచుట కష్టముగానుండెను. ఏకుంచేటినో ఏలేటినో కొట్టుకొని రానిచో వాని పెండ్లము తెచ్చెడి సేవాఫలధాన్యము వానిబిడ్డలకు చాలుటలేదు. మఱలఁ బెండ్లముయొక్క యొత్తిడివలన వేటకుఁ బోనారంభించెను. ఒకనాఁడు వాఁడడవికిఁ బోవ నొక విచిత్రమైన పరిస్థితి జరిగెను. మొదట దీనిని నమ్ముట నాకే కష్ట మనిపించెను. కాని వాఁ డబద్ధము చెప్పఁడు. వానిమాటలు నే నెట్లు నమ్మకుండఁగలను? అది యొకనాఁటి సాయంకాలము. చిన్నతుప్పర పడుచున్నది. ఒకచోట నీ చిఱుతపులి కూర్చున్నది. ఇతఁడు పులులను చంపఁడు. ఆహారముకొఱకైన జంతువులను చంపునుకాని పులులజోలికి పోఁడు. ఈపులి యొకచోట కూర్చున్నది. దాని నతఁడు చూచినాఁడు. ఇది యొకవంకఁ దీక్ష్ణముగా చూచుచుండెను. దేనివంక జూచుచున్నదని యతఁడు దృష్టి నావైపునకు మళ్ళించఁగాఁ గొంత దూరమున రెండు జంతువులు కనిపించెను. అవి రెండు నొకదానితో నొకఁ డాడుకొనుచుండెను. ఒకటి అడవినక్క; వట్టినక్క కాదు. సివంగివంటినక్క. అనఁగా నెదయైన కాలములో నొకపెంటినక్కను సివంగిదాటఁగా పుట్టిననక్క. అది జాతిచేత నక్కయైనను దానియందు సివంగి లక్షణము లుండును. ఈనక్క మఱియొక పెంటినక్కతో నాడుకొనుచుండెనట. అది సామాన్యపునక్క. ఆ రెండు నాడుకొనుచుండెను. అది ఋతుకాలము. ఈ పోతునక్కయందు కోరికతో నాపెంటి యాడుకొనుచుండెనో జాతిలక్షణమైన కేళిగానున్నదో తెలియదు. ఉండియుండి యా సివంగినక్క

పెంటినక్కను మెడకొరికి చంపెనట. ఈపులి వెంటనే యానక్కమీఁద దూకి దానిమెడకొఱికి సంహరించెను. ఈ వేటకాఁడు నక్కమాంసము తినఁడు. పులిమాంసముతినఁడు. ఎందుకో వాఁడు పులిని బాణమువేసి చంపెను. ఆచర్మ మును తెచ్చి నాకిచ్చెను. ఈకథ చెప్పెను. శ్రీమాలి:—దీని యర్థమేమని చెప్పెదవు? అమృతవల్లి:—కాలంజరి చెప్పుట యెందులకు? నేనే చెప్పెదను. ఎవరో ఎవరికో యన్యా యము చేయుదురు. నే నా యన్యాయమును సహించలేక వారిని చంపుదును. శ్రీమాలి:—అప్పుడు నిన్నెవరో వృథాగా చంపుదురు. అమృత:—నన్నుచంపరు. ఎందుచేతననఁగా వేటకాఁడీపులిని చంపినట్లుకాదు. దాని చర్మముమీఁద సత్పురుషులు కూర్చుండురనియు దాని జీవమునకిది పుణ్యాను భూతియనియు దానిని చంపెనుగాని నిజముగా చంపలేదు. శ్రీమాలి:—కాలంజరిబదులు నీవే సోదెచెప్పవచ్చును. కాలం జరి:—నిజమేనమ్మా! ఈమె చివరచెప్పినమాట నేను చెప్పఁ గలిగియుండను. శ్రీమాలి:—అయినచో నేను లేఁడిచర్మము మీఁదఁ గూర్చున్నదాని కర్థముచెప్పుము. అమృత:—ఎవరో నీబిడ్డను చంపుదురు. నీ వాదుఃఖమనుభవించలేక యాత్మ హత్య చేసికొందువు. శ్రీమాలి:— నాబిడ్డ నెవరుచంపఁ గలరు. నేను మహాసేనాధిపతి కూతురను. ఎవఁడైన నాబిడ్డను చంపి బ్రతుకఁగలఁడా? అమృత:— నిజముగా నీకుఁ బెండ్లి యైనట్లే, అప్పుడే పిల్లలను కనినట్లు మాటాడుచున్నావు. శ్రీమాలి:—అయినచోఁ బెండ్లియే కాదందువా? అమృత:— పెండ్లి నిస్సందేహముగా నగును. బిడ్డలుపుట్టుట పరమేశ్వ

రేచ్చు. శ్రీమాలి:-కాలంజరీ! నీవు నాకు బొమికె నందీయఁ బోయితివి. నేను బెరుకుపొంది చేయి వెనుకకు లాగికొంటిని. అమృతవల్లికి సోదె చెప్పఁబోయితివి. నీకు పూనకము రాలేదు. అమృతవల్లి నీకంటె నధికమైన మనశ్శక్తి కలది కావచ్చును. నీకంటె నేమి? ఆమెయొక్క మనశ్శక్తి పలు మంది మనశ్శక్తులకంటె నధికమైనది. ఆమె యాడుదియై పుట్టెనుగాని మగవాఁడై పుట్టవలసినది. నాకిప్పుడు బెరుకు తీరినది. నాకు సోదె చెప్పుము. అమృత:-నిజమే కాలం జరీ! ఆమెకు సోదె చెప్పుము. నీకు పూనకము వచ్చునేమో చూతము. ఈ బియ్యము నివియు సరిపోవునుగదా? రెండు రోలీలు నీవు తిరిగి మాకీయనక్కఱలేదు. కాలంజరి యంగీక రింపఁబోవుచుండెను. ఇంతలో నమృతవల్లి ప్రశ్న వేసెను. 'ఈయింటిలో నీ వొక్కర్తుకవే యుండుచున్నావా? నీకు భయముకాదా? నీకు పెండ్లి కాలేదా? కాలంజరి:-పెండ్లి యైనది. అమృత:- నీ మెడలో మంగళసూత్రములేదే. కాలం:-మేము మంగళసూత్రములు కట్టికొనము. ఇదిగో! ఈ తెల్లగురివిందగింజలపేరు. ఈపేరు మేము తాల్తుము; ఇదియే మాకు పెండ్లియైనదానికి గుర్తు; శ్రీమాలి:- ఇదియేమిగుర్తు? అమృత:-ఇది చాలమంచిగుర్తు; యథార్థమైనగుర్తు; స్త్రీ పురుష సంయోగరహస్య సూచకమైన గుర్తు; శ్రీమాలి:- నాకర్థమగుటలేదు; కాలం:-అది కాదమ్మా; గురివింద గింజలో రెండు వన్నె లుండును; ఈ గింజలో కొంత తెలుపు కొంతయెఱుపు; అది గుర్తుకదా! శ్రీమాలి:-ఎట్లుగుర్తు? అమృత:-నీకంటె నమాయకురాలుండదు; అందుకనియే

నీవు లేడిచర్మముమీఁద కూర్చుంటివి; నీబిడ్డనెవరో చంపఁగా నీనాత్మహత్య చేసికొందువు; శ్రీమాలీ:-బిడ్డనెవ్వరైన చంపి నచో నిజమైన సంతాన ప్రేమగలతల్లి చనిపోకుండ నుండునా? అమృత:-చనిపోయి యేమిచేయును? ఎవరు నీబిడ్డను చంపుదురో వారిని చంపుట పౌరుషము; శ్రీమాలి:- మనము పురుషులము కాము. అమృత:- నీవు కావని తెలి యుచునే యున్నది. నేను పురుషునివంటిదాన నంటివిగదా! మఱియు నిచటఁ బౌరుషమనఁగాఁ బురుషత్వమని కా దర్థము. ప్రతిక్రియాబుద్ధియని యర్థము. జీవలక్షణమని యర్థము. శ్రీమాలి:- నీవేదైన ధోరణి మొదలుపెట్టితివా అర్థములతో దుంప తెంచుదువు. కాలంజరీ! నీ భర్తయేఁడీ? కాలం:- అతఁడు పవలు గృహమునందుండఁడు. ప్రొద్దుననే లేచి వెడలిపోవును. రాత్రికి తిరిగివచ్చును. ఒక్కొక్కప్పుడు రాత్రు లందునుఁ దిరిగిరాఁడు. అమృత:- ఏదైన సంపాదనమీఁదఁ బోవునా? కాలం:- అతఁడు కాలజ్ఞానము చెప్పును. ఊళ్ళ మీఁద బిచ్చమునకు తిరుగును. శ్రీమాలి:- కాలజ్ఞానమనఁగా నేమి? కాలం:- సృష్టి మొదలు నేఁటివఱకు జరిగిన ఈ ప్రపంచకముయొక్క కథయు భవిష్యత్తులో జరుగఁబోవు విషయములును పాటలుగాకట్టి యతఁడు పాడుచుండును. దానినే కాలజ్ఞాన మందురు. శ్రీమాలి:- అతనికివన్నియు తెలియునా? కాలం:- అతనికి తెలియనక్కఱలేదు. ఈ విషయములన్నియు ననుస్యూతముగా మన దేశములో నున్నవి. పూర్వులు వానినిఁ బురాణకథలుగా నిర్మించిరి. వానినే యాయా ప్రాంతములలోని భాషాకవులు పాటలుగా

వ్రాయుదురు. వ్రాసిరి. ఆ పాటలను నా భర్తయొక్క తలితండ్రులును పూర్వులును నేర్చికొని పాడుచు భిక్షాటనము చేయుట వారికి వృత్తి. ఆ పాటలే నా భర్తకు వచ్చును. ఆయన పాడుచు నూళ్ళవెంటఁ దిరుగుచుండును. అమృత:- బాగుగా సంపాదించునా? కాలం:- ఏమి సంపాదించును? కొన్ని యిండ్లముందు చేయి తీరిక లేదందురు. కొన్ని యిండ్లలో భోజనమువేళ పెట్టరాదందురు. మఱి కొన్ని చోట్ల నేఁడాబ్దికము పొమ్మందురు. ఎచటనో నూటికి కోటికి నెవరో యొకరు వానియందు శ్రద్ధకలవారు విని యొక ప్రాతధోవతి యీవచ్చును. ఒకదుగ్గాని యీవచ్చును. తక్కినవారందఱు పిడికెడు బియ్యముతోడనే పంపింతురు. ఆయన పవలు రెండు జాములవఱకు తిరిగి యేచెట్టుక్రిందనో యుడుకవేసికొని తిని మఱల సంజవేళ పది గృహములుచూచి ప్రొద్దు తగినంతయున్నదనఁగా బయలుదేరి యింటికివచ్చును. నాల్గు దోసిళ్ల బియ్యము దినమునకు దొరికినచో నానాఁడు బాగుగా దొరికినట్లే. ఆ బియ్యములోననే యుప్పు పప్పులు గూడ నుండునుగదా? శ్రీమాలి:- మఱి నీ సంపాదన యేమి చేయుదువు? కాలం:- నా సంపాదన యెంత? మీరు రెండు తోలీలతో తెచ్చిన సామగ్రియే యొక్కొక్క సోదెకు నా సంపాదన. ఇట్టి సోదెలు నాల్గు దినములకు వచ్చినచో నది యెక్కువ. అమృత:- అయినచో నీనాఁడు చాల సంపాదించితి వన్నమాట. రెండు దీనారములు వచ్చినవికదా! కాలం:- ఇవి దీనారములా! నేను వినుటయేకాని చూడ లేను. ఈ సంపాదన నా కెందుకు పనికివచ్చును? వీనితో

బియ్యము వచ్చునా? ఉప్పులు పప్పులు వచ్చునా? అమృత:- అట్లందువేమి? ఎందుకురావు? కాలం:- ఇవి నగలు చేయించుకొనుటకేకాని మఱి యెందుకుఁ బనికిరావటకదా? అమృత:- నీ కెవ్వరు చెప్పిరి? కాలం:- వీనితో నుప్పుపప్పులు కొనుట నే నెన్నడు చూడలేదు. అమృత:- మఱి వేనితోఁ గొందురు. కాలం:- ఒక వస్తువిచ్చి ఇంకొక వస్తువు తీసి కొందురు. ఇవి తినెడివి కావుకదా? వీని నేమిచేయుదురు? అమృత:- అన్ని వస్తువులకు వెల యుండును. వెలయనఁగా ధనము. ధనమనఁగా నిది. కాలం:- వస్తువులకు వెల యుండదు. వస్తువుల కుపయోగ ముండును. ఆహార పదార్థ ములకు భుజించుటకు వీలైన లక్షణ ముండును. అనుభవించు టకు నవి యోగ్యమైనవి. ఒక యనుభవించు వస్తువునకు మఱియొక యనుభవించు వస్తువునకు సమానత్వ ముండ వచ్చును. అది దానికి దీనికిని సంబంధము. వానిలో సమా నత్వము లేకపోయినను నష్టములేదు. జీవితముయొక్క పరమార్థ మనుభూతిగనుక సేరు గోధుమలకు నొకప్పుడు పావుసేరు పెసలు రావచ్చును. మఱియొకప్పుడు పావుసేరులో సగమే రావచ్చును. వెండి బంగారముల విషయములలో నట్టి వ్యత్యాసము సహించుట కష్టము. అమృత:- ఎందుకు కష్టము? కాలం:- ఈ వెండి బంగారములు ధరించుటకుతప్ప పనికిరావు. అవి ధరించకపోయినను మనుజులు బ్రతుక వచ్చును. ఆహార పదార్థములు మనుష్యులు బ్రదుకుటకు కావలసినవి. వెండి బంగారములు బ్రతుకుట కక్కఱలేనివి. వానికి వీనికి సమానత్వమెట్లు? ఇంత మన్నిచ్చి ఇంత గాలి

నెవఁడు కొనును? అమృత:- నీవు చదువుకోలేదంటివి. పండితు రాలవు. కాలం:-ఇది చదువా? నాకు తెలియదే. అమృత:- మఱి చదువనఁగా నెట్లుండును? కాలం:- నా భర్త చదువు కొన్నవాఁడు. అతఁడు కాలజ్ఞానము చెప్పఁగలఁడు. సృష్టి యెప్పుడు జరిగినది? ఎట్లు జరిగినది? తరువాత నేమేమి జరిగినది? ఎప్పుడెట్లెట్లు లోకము సాగినది? ఈ మొదలైన యెన్నో విషయము లాయనకుఁ దెలియును? చదువనఁగానది. నేను చెప్పినది వట్టి బ్రదుకులోని సామాన్య విషయము. ఇది యందఱకునుఁ దెలియును? దీనికోసము చదువుకొన నక్కఱలేదు. శ్రీమాలి:- అయినచో మా దీనారములు నీ కుపయోగించవన్నమాట. కాలం:- ఎందుకుపయోగించవు? నేను మెడలో కట్టుకొందును. అమృత:- బ్రతుకుటకు కట్టు కొన నక్కఱలేదుకదా? కాలం:- వ్యర్థమైన యొక భావము ననుభవించుటకు కట్టుకొందును. వారు వీరు వత్తురు. ఇది యేమి యని యడుగుదురు. దీనారము లున్నవని పదిమందికి తెలియును. అందఱు చూచిపోవుటకు వత్తురు. నాకు బేరము వృద్ధిపొందును. పదిమంది వచ్చినచో నిద్దఱైన సోదె నడుగరా? అది రెండు సోలల బియ్యము. అమృత:- కాలంజరీ! నా కిప్పుడు తెలిసినది. మీరు ప్రకృతిబిడ్డలు. మావలె కృతక జీవనులుకారు. మేము కావలసిన దానికంటె వేయి రెట్లు వ్యర్థముగా పెంచికొని యదియొక యధికమైన జీవనమని పొరపాటుపడి దురహంకారముతోఁ బ్రవర్తించుచున్నాము. శ్రీమాలి:- మీయాయన యెప్పుడు వచ్చును? ఆ కాలజ్ఞాన మేమియో వినవలెనని యున్నది; కాలం:- ఆయన రాత్రికి

కాని రాఁడు; మీరు రాత్రులం దిచ్చట నుండుటకు వీలు లేదుకదా? శ్రీమాలి:- అతఁడు బిచ్చమెత్తుకొనుటకు నూళ్ల వెంటఁ బోవునుకదా? ఈ యూరిలో బిచ్చ మెత్తఁడా? కాలం:- ఒంటిలో నోపికగా లేనిచో పొరుగూళ్లకు పోవుటకు నోపిక లేనిచో నీమహానగరముననే కొన్ని యిండ్లకు పోవును; ఇంటిలో మఱియు నేమియు లేనిచోఁ బోవును; లేనిచో నీ మహానగరమున తిరుగనే తిరుగఁడు; అమృత:- ఈ రాజధాని ప్రజలు పాపము చేసికొనిరా! కాలం:- పూర్వము చేసికొనిరో చేసికొనలేదో తెలియదు; పాపము చేయుదురు; శ్రీమాలి:- అనఁగా నర్థముకాలేదు; కాలం:- ఆయ చెప్పెడు కాలజ్ఞానములో ననేక విషయము లుండును; ఇప్పటిరాజ్యము యొక్క పరిస్థితులుండును; ఈ రాజ్యము మాఱిపోవుట యుండును; క్రొత్తరాజులు వచ్చుట యుండును; ఆ పాటలు విన్నచో రాజభటులు వానిని దండింతురు; తీసికొనిపోయి చెఱసాలలో వేయుదురు; అమృత:-ఎందుకు వేయవలయును? అవియన్నియుఁ బూర్వఋషు లెవ్వరో వ్రాసిన విషయములు; వానినే దేశికవులు పాటలుగా వ్రాసిరి; వానిని నీ నీమగఁడు పాడును. నీ మగని తప్పేమి? కాలం:- అదియే నాకును తెలియదు; శ్రీమాలి:- నేను చెప్పుదునా? ఆ ఋషులను వీరేమియు చేయలేరు; వీనినేమైనచేయఁగలుగుదురు; అదియే హేతువు; అమృత:- తప్పెవరిదో కాఁగా మఱి యెవ్వరినో శిక్షించుటా? అంతకంటె నేను కూర్చున్న ఈ పులి యెక్కువ న్యాయము కలది; తప్పున్నచోటనే శిక్షించినది; కాలం;- రాజులనఁగా నసమర్థులు; వారెంత యసమర్థ

లనఁగా వారికి కోపము వచ్చినచో వారికి వారేమియు చేయలేరు; సేవకులచేత చేయింతురు; అమృత:-కాలంజరీ? నీ వెవరితో మాటాడుచున్నావో నీకు తెలియునా? ఆమె శ్రీమాలి. మగధరాజ్య మహాసేనాధిపతియైన వాసుదేవుని కుమార్తె. నేను హరిసేనుని కుమార్తెను. నా తండ్రి వందయూళ్ళకు ప్రభువు. మేము రాజులమే. మాకుఁ గోపములు వచ్చినచో మేము శిక్షించము. ఎవరిచేతనో శిక్షింపఁజేయుదుము. మేము తక్కువవారము. ఆమె గొప్పది. మహాసేనాధిపతికూతురు. వాసుదేవుని కుమార్తె. - అనినంతనే కాలంజరి మాటాడుట మాని వేసెను. తల వంచికొని కూర్చుండెను. అమృతవల్లి యిట్లనెను. 'కాలంజరీ! నీకంత భయమక్కఱలేదు. మేము నిన్నేమియు చేయము. నీవిట్లంటివని మే మెవ్వరితోడను చెప్పము. మనము ముగ్గురమును చెలిమికత్తియలమని మున్నె చెప్పితినిగదా. స్నేహములో నట్టిద్రోహము సేయము.' అనఁగాఁ గాలంజరి శ్రీమాలియొక్క పాదములు చేతులతో దాఁకి నొసలద్దుకొనెను. శ్రీమాలి నవ్వి 'కాలంజరీ! భయము లేదు. నీవన్నమాట నిజమే. రాజు లసమర్థులు. వారియసామర్థ్య మెుక్కవిధమా? అంతటి యసామర్థ్యమును సామర్థ్యముగా వెలయింపఁజేయుటకంటె కృత్రిమత్వ మేమున్నది? వారిందులో నిష్ణాతులు. ఆరాజులే యసమర్థులైనచో వారి పగలు తీర్చిపెట్టెడి సేవకు లెంతటివ్యర్థులు. నాతండ్రి యటువంటివాఁడు. ఆరాజుపని తాను చేయుచున్నాఁడు. రాజుయొక్క శత్రువును తాను వధించుచున్నాఁడు. వానితో

నితనికి విరోధములేదు. నిష్కారణముగా వధించుచున్నాఁడు. దానిపేరు వధ. ప్రాణములు తీయుట. దానికి వీరు వేఱేపేరు పెట్టిరి. దానిపేరు రాజ్యము. సేన. రాజ్యముచేయుట. యుద్ధములు చేయుట. దుష్టులైన శత్రువులను వధించుట. పెద్దపెద్ద మాటలను నిర్మించిరి.' – అప్పటికి కాలంజరికి కొంత ధైర్యము వచ్చినట్లు కనిపించెను. ఆమె యిట్లన్నది. 'నేను భయపడలేదు. మీరు నన్ను శిక్షింపితురని నాకు ధైర్యము లేదు. మీరు నన్ను శిక్షించనులేరు. ఏలయనఁగా నేను మీకందను. మీరు నన్ను శిక్షించవలయునని తలంచితిరని నాకుఁ దెలిసినచో నా మఱునిముసమునే నెచ్చటనుందునో నాకే తెలియదు. మీరు నన్ను పట్టుకొనలేరు. నాసంగతి మీకు తెలియదు. నేను లేడివలె పరుగెత్తఁగలను. పాము వలె ప్రాకఁగలను. పులివలె లంఘించఁగలను. గాలివలె కనిపించకుండ పోఁగలను. నాకు రాజభటులవలని భయము లేదు. నా భర్తకునులేదు. అతనికి భయము నావలన వచ్చినది. నేనిచట నిల్లుకట్టి సోదెలు చెప్పుచున్నాను. అతనిని రాజభటులు పట్టుకొన్నచో నేనేమైపోదునో యని యతని భయము. స్వేచ్ఛగానున్న పురుషుఁడు స్త్రీచేత బంధింపఁబడుచున్నాఁడు. అతఁడు రాజభటుల కందఁడు. కాని నాకొఱకు కందును. వారు పదిదినములు కారలో నుందురు. తరువాత మరల నావద్దకు రావచ్చును. అందు చేత వారికి చిక్కును. నేనిచ్చట లేనిచో నతఁడు చిక్కఁడు. అమృత:–ఓసి కాలంజరీ! నీకంటె పరమపండితురాలుండదు. ఈ సృష్టిరహస్యములు నీకు తెలిసినంతగా మాకు తెలియవు.

చదువుకొన్నవారమనుకొన్న వారికిఁ దెలియవు. మీరు జీవితములో నట్టడుగుభాగమున నున్నారు. ఈ రహస్యము లన్నియు నచ్చటనున్నవి. వానితో మీరు నిత్యము ముఖాముఖిగా మాటాడుదురు. విద్యావంతుల మనుకొన్నవారు అధికుల మనుకొన్నవారు బ్రతుకుయొక్క ఈ మూలసూత్రములనుండి చాలదవ్వు ప్రయాణించి జీవిత మూలరహస్యములను మఱచిపోయి తమ్ముఁదాము వంచించుకొనుచున్నారు. నీవు శ్రీమాలినిచూచి భయపడలేవు. ఆమె మహాసేనాధిపతి వాసుదేవుని కుమార్తె యనినంతనే నీలో నొక వికారము దయించినది. అది భయమనుకొన్నాను. నీవు కాదనుచున్నావు. ఆవికారమునకు హేతువేమి? - కాలంజరి మాటాడలేదు. అమృతవల్లి రెండు మూఁడుసార్లదే ప్రశ్నవేసెను. కాలంజరి యిట్లు చెప్పెను. 'ఆసంగతి నేను మీకు చెప్పరాదు. అది యెంతవఱకు నిజమో నాకుఁదెలియదు. అది కాలజ్ఞానపు పాటలలో నున్నవిషయము. ఒకవేళఁ బాడినచోఁ బొరపాటున పాటకూడ పాడుదునేమోయని నామగఁడీయూరిలోఁ దిరుగఁడు. అదియుకాక రాజధానిలోని ప్రజలు చిత్రమైన ప్రజలు. వారికంటె మూర్ఖు లుండరు.' వారి మూర్ఖత్వము దురహంకారముగా, దురభిమానముగా, నధికారఘూర్ణహత్వముగా భాసించుచుండును. వారికి పుట్టెడన్ని దురభిమానములు. ఒకనాఁడు నామగఁడు కొంచెము సుస్తీగానుండి యింటిలో నాపూటకు బియ్యము లేకపోవుటచేత నాలుగిండ్లకుఁబోయి బియ్యము తెత్తమని యొకపేటకు వెళ్ళెను. ఒకయింటిముందు చాణక్యునిఁగూర్చి పాడుచుండెను. ఆ

చాణక్యుఁడు కృత్రిమ నీతివేత్తయనియు, కుటిలుఁడనియు, దురహంకారి యనియు, దుష్కోపియనియు నా పాటలో నున్నది. ఆయింటివారు బ్రాహ్మణులు. వారు కౌటిల్యుని వంశమువారట. ఇప్పుడు శుంగవంశపురాజులు పాలించు చున్నారు. తత్పూర్వులు మౌర్యవంశపురాజులు. ఆ చాణక్యుఁడు బ్రతికియుండి ఈనాఁటికి నెన్నివందల సంవత్సరములో కాలేదు. ఆఱువందలయేండ్లకు మించలేదు. సుమారాప్రాంతముగా నున్నది. వా రా కౌటిల్యుని వంశము వారట. పదునే నిరువది తరములు గడచినదేమో కాని వారందఱకు నా కౌటిల్యుఁడు మూలపురుషుఁడు. వారితనిని పట్టికొని తాడించిరి. నా భర్తయేమిచేయును? నాఁటినుండి యాపాటలు పాడవద్దని పాడినచో వానిని శిక్షింతుమని పాడనని యతనివద్ద వాగ్దానము తీసికొని వదలిపెట్టిరి. తల్లీ! ఆఱు వందలయేండ్ల క్రిందటి కథ పాడిననే యింత యిక్కట్టు వచ్చెనే నేఁటి కథలు పాడినచో నేమియగునో? భవిష్యత్తులో నిట్లు జరుగునని చెప్పినచో మెడ కురిదెచ్చికొన్నట్లే. అమృత: కాలంజరీ! నేను రాజనుకాను. మా శ్రీమాలి కాదు. నేనుగాని యామెకాని రాజుబిడ్డలముకాము. మా కాపాటలు విన వలయునని యున్నది. మాకెప్పుడు వినిపింతువు – ఎట్లువిని పింతువు? రేపు నీభర్త మా శ్రీమాలియింటికిఁ బంపింపుము. అతఁడు వచ్చినచోఁ బురుషులెవ్వరు లేకుండఁ జేసెదము. మేమందఱ మాడువాండ్రమే యుందుము. పాడించుకొని యాకథలన్నియు విందుము. వినవలయునని యున్నది. కాలం:–అమ్మా! అతఁడురాఁడు. ఇప్పటికథ పాడనేపాడఁడు.

అతనికి పదియావులనిచ్చినను పాడఁడు. శ్రీమాలి:- ఎందు చేత పాడఁడు? కాలంజరి:- నాకు తెలియదు. శ్రీమాలి:- నీకు తెలియును. చెప్పుటలేదు. కాలం:- అమ్మా! ఒకి వేళ తెలియునే యనుకొందము. మేము పేదవాండ్రము. మేము పుట్టినవారము పుట్టినట్లున్నాము. ఇట్లే చత్తుము. మాకు కామక్రోధములులేవు; మేము పేదవారముకాము; మావృత్తి పేదవృత్తి. మా పూర్వు లీ వృత్తుల నెన్నుకొన్నారు. పేదతనము, ధనము కలిగియుండుట, నిట్టి భావములతో మాకు సంబంధములేదు. మే మిట్లే యుందుము. మాకుఁ దెలిసిన విషయములు మాయందే జీర్ణించును. మీ విషయ మట్లుకాదు. మీరు జరుగుచున్నదానిని, సాగుచున్నదానిని దాని దారిని దానిని జరుగనీయరు. దాని దారిని దానిని సాగనీయరు. మేము దాని జోలికిపోము. మీకును మాకును భేద మిది. మీరు జగత్తునకు విప్లవము తెత్తురు. ఉన్న స్థితి బాగుగా లేదందురు. బాగుపఱతు మందురు. మీరు కృత్రిమముగా నూహించి, మీ యూహలో మీ దురహంకార మును కలిపి, మీరు జ్ఞానమనుకొన్న మీ యజ్ఞానము నందులో మేళనముచేసి లోకమును మార్చుటకుఁ బ్రయ త్నింతురు. నా భర్తకు నతని పూర్వులకు నీపాటలన్నియు నెప్పుడును వచ్చును. అనఁగా వానిలోనున్న విషయములు వారి కెప్పుడునుఁ దెలియును. వారు వానినిఁబట్టి తమప్రవర్తన మార్చుకొనలేదు. తమ వృత్తిని వదలుకొనలేదు. దానివలన నధికముగా సంపాదించుటకుఁ బ్రయత్నము చేయలేదు. ఆ పాటలలోనున్న రహస్యములు మీకుఁ దెలిసినచో మీ

రూఁరకుండరు. అందులోఁ జెప్పినట్లు జరుగకుండఁ జేయుటకు బ్రహ్మ ప్రయత్నములు చేయుదురు. పలుమంది జీవితముల మీఁద నిప్పులు పోయుదురు. వేలమంది బ్రదుకులకు శాంతి లేకుండఁ జేయుదురు. ఈరాజులు నీయధికారులు, నీరాజ్యాంగ వేత్తలు, నీ క్రొత్త క్రొత్త మతములు స్థాపించువారు, నీ సంఘ వ్యవస్థా వినిర్ణాయకులు, వీరందఱు సృష్టికి చేసెడు ద్రోహ మింతయని చెప్పుటకు వీలులేదు. అయ్యయ్యో ! కొండలమీఁద వాన కురిసెను. జాలుగాఁ బ్రవహించెను. పల్లమునందుఁ బడిపోవుచుండెను. నీకుఁగావలసినచో దానిలో నీరు దోసిళ్లతోఁ ద్రావుము. ఒకకుండెడునీరు తెచ్చికొనుము. దాని కడ్డకట్టకట్టి సముద్రముగానిండించి ఇచట కొంత పండించి ఆ పంటమూలముగా నీవు ధనవంతుఁడవై యా పంటను వేయి విధములుగా మార్చి మార్చి చేయుదువు. నిజముగా నీ ప్రయత్నమంతయు పట్టెయన్నము తినుట కేనా ! అన్నము తినుట కింతఁ బ్రయత్నము కావలయునా ? అమృత:- మఱి దేనికందువు ? కాలం:- మీరు గుఱ్ఱపు బండ్లమీఁదకాని నడువరు. ఏనుగులమీఁదఁగాని యెక్కరు. చంద్రకాంతపు రాళ్ళతో కట్టిన యిండ్లలోఁగాని నివసించరు. ఊఁదినచో గాలికి నెగిరిపోవు సన్న పలిపపుచీరలుగాని ధరించరు. ఈ దీనారముల పేరులుగాని మెడలో తాల్చరు. సేనలను నిర్మింతురు. లెక్కలు వ్రాయింతురు. ఊరకే జీతములిత్తురు. నిర్వ్యాపారులైన జనులను విద్యావంతులనుపేర పెద్ద పెద్ద జీతములిచ్చి పోషింతురు. ఇదియంతయు రాజ్యమనుపేర నడపుదురు. పట్టె యన్నము తినుట కింత బ్రహ్మాండ మక్కఱ

లేదు. అమృత:- కాలంజరీ! ఇదియంతయు చేయనిచో మానవులు వారిలో వారు కలహించుకొని యొకరినొకరు హింసించుకొందురు. న్యాయమనునది యుండదు. కాలం:- ఈ రాజులు న్యాయము చేయుదురందువా? ఇప్పటి మన రాజు దేవభూతి. ఆయన యెట్టివాఁడు? నాకు తెలియును. పాటలోనున్న విషయము చెప్పెదను. అమృత:- చెప్పుము. కాలం:- ఆయన స్త్రీలోలుఁడు. వావివరుసలు లేనివాఁడు. అతని స్త్రీకామమును కొండలుపట్టవు. అతఁడు రాజ్యము నందు నిష్ఠలేనివాఁడు. అని పాటలో నున్నది. ఈ మాట నిజమా? యబద్ధమా?—అంత శ్రీమాలియు నమృతవల్లియు నొకరి మొగము లొకరు చూచికొనిరి. అమృతవల్లి:- ఆ పాటలో నింక నేమున్నది? కాలం:- మనము విచారించు విషయ మదికాదు. లోకములో రాజులు లేనిచో జను లొకరిమెడ లొకరు కోసికొందురు. కనుక నట్లుకోసికొనకుండ చేయుటకు రాజు లున్నారని నీవు చెప్పితివి. ఆ రాజులు నొకరియొడ లొకరు కోసికొనిరి. ఇది మగధరాజ్యము. దీనికి గిరివ్రజపురము రాజధాని. ఈ రాజ్యము తొట్టతొలుత జరాసంధునిది. భారతయుద్ధ మైనతరువాత జరాసంధుని కొడుకు సహదేవుఁడు భారతయుద్ధములో చనిపోఁగా నతనికొడుకు మార్జారి రాజ్యమునకు వచ్చెను. మార్జారియు యుధిష్ఠిరుఁడును నించుమించుగా నొక్కసారియే రాజులైరి. తరువాత ముప్పదియాఱేం డ్లకు కలికాలము వచ్చెను. బార్హద్రథులు వేయియేండ్లు రాజ్యము చేసిరి. వారిలో చివరివాఁడు రిపుంజయుఁడు. అతనిని వధించి యతని సేనాని మునీకుఁడు

రాజయ్యెను. అతని కొడుకు ప్రద్యోతుఁడు. ఆప్రద్యోతులు నూట ముప్పదియేండ్లు రాజ్యముచేసిరి. వారిలో చివరివాఁడు నందివర్ధనుఁడు. వానిని చంపి శిశునాగుఁడు రాజయ్యెను. ఆ శిశునాగవంశము మూఁడువందల యిరువదియేండ్లు రాజ్యము చేసెను. వారిలోఁ జివరివాఁడు మహానంది. అతనిని వాని యుంపుడుకత్తె కొడుకు నందుఁడనువాఁడు రాక్షసుని సాహాయ్యముతో వధించి, నందుఁడును వాని యెనమండుగురు కొడుకులు వందయేండ్లు రాజ్యముచేసిరి. ఆనందుని యుంపుడుకత్తె ముర. ఆమె కొడుకు మౌర్య చంద్రగుప్తుఁడు. అతఁడు రాజ్యమునకు వచ్చెను. ఆ మౌర్యుఁడు మూఁడువందల పదునాఱేండ్లు రాజ్యము చేసిరి. మౌర్యులలో చివరివాఁడు బృహద్రథుఁడు. వానిని వధించి యీశుంగవంశ రాజులలోఁ బ్రథముఁడైన పుష్యమిత్రుఁడు రాజ్యమునకు వచ్చెను. ఇప్పటి దేవభూతి ఈశుంగవంశములో పదియవరాజు. వీరింతవఱకు మూఁడువందల యేండ్లు రాజ్యముచేసిరి. కలి ప్రారంభించిన తరువాత నిప్పటికి రెండువేల రెండువందల యిరువది యేండ్లు గడచినది. ఈలోపుగా నెన్నికథలు జరిగినవి. భగవంతుఁడైన శ్రీకృష్ణుఁడు పనికిరాఁడనన్నట్లు గౌతమబుద్ధుఁడు కలి ప్రవేశించినతరువాత పంద్రెండువందల యేఁబదిరెండేండ్లకు జన్మించెను. అతఁడు శిశునాగవంశములో నాఱవరాజైన యజాతశత్రుఁడు రాజ్యమునకు వచ్చినతరువాత నెనిమిదేండ్లకు నిర్యాణము పొందెను. ఇట్లీ రాజు లొకరినొకరు చంపికొంచునే వచ్చుచుండిరి. వారి నీతికి వేలకొలఁది సైనికులు మానవులు హోమమగుచునే యుండిరి. ఈ రాజులులేనిచో

మానవులు దమలోఁ తాము చంపికొందురంటివికదా! ఇంత కంటె నెక్కువ చంపికొందురా? సామాన్య మానవులు వారిలోవారు చేసికొను నన్యాయములు రాజ్యములపేర జరుగున్న యన్యాయములకంటె నెక్కువగా నుండునందువా?

అమృతవల్లి మాటాడలేదు శ్రీమాలి మాటాడలేదు. వారిట్టిమాట లెప్పుడు వినలేదు. ఆపాటున వారిద్దఱు లేచి పోయిరి. ఆ లేచిపోవుచున్నవారివంక కాలంజరి చూచు చుండెను. మానవులకు నేత్రములు ముందుండును. తమ వంక నెవరైన చూచుచున్నచో వారు చూచుచున్నట్లు తెలియును. ఎదురుగా నుండిగాని ప్రక్కగా నుండిగాని చూచుచున్నచో మానవులకుఁ దెలియును. అది యెట్లు తెలియునో తెలియదు. జీవశక్తి యొకదానినొకటి సమా కర్షించునేమో? ఆ జీవశక్తి మనవంక నెవరైన వెనుక నుండి చూచుచున్నను మన యాత్మను స్పృశించునా? ఈ స్పృశించుట చూచెడివానియొక్కయు చూడఁబడెడువాని యొక్కయు జీవలక్షణముమీఁద నాధారపడి యుండును. ఒకని జీవము మెత్తనిదయ్యు ఆర్ద్రమై బహుపూర్వజన్మ సంస్కా రముచేత నిశితమైయున్నచో దానికి తెలిసినంత యీ పరజీవ సన్నికర్ష లక్షణము సుకుమారము కాని జీవునకు తెలియదు. మనము చూచుచునే యుందుము. వానివంకనే చూచు చుందుము. వాఁడు మనవంక చూడఁడు. మనలోనుండి వానిదెసకు ప్రవహించు భావనాప్రవాహము వానిమీఁద దున్నపోతుమీఁద వానకురిసిన ట్లుండును. మఱియొకనివంక మనము ప్రక్కగా చూడవచ్చును. వానివంక మనము

తీవ్రముగాఁ జూడకపోయినను వానినిగుఱించి తీవ్రముగా భావనచేయుచున్నచో వానివంక నడపఁదడపచూచుచున్నచో వాఁడు వెంటనే గ్రహించును. మనము వానివంక నొక విలక్షణమైన భావనతో చూచుచున్న ట్లతఁడు గ్రహించును. ఇది జీవులయొక్క సంస్కారభేదముచేత భాసాభాసముగా నుండును. ఇట్లు కాలంజరి వారివంక వెనుకనుండి తీవ్రముగాఁ జూచుచుండఁగా వారిద్దఱును చకితులైరి. ఆమె తమవంక చూచుచున్నట్లు వారికిఁ దెలిసెను. ఆ చూచుటలో నొక తీవ్రలక్షణ మున్నట్లుకూడఁ దెలిసెను. వారు వెనుతిరిగిచూచిరి. ఆమె తమవంక దీర్ఘదీర్ఘములైన సూదులతో పొడుచు చున్నట్లు చూచుచున్నదని వారి కినిపించెను. అపుడు శ్రీమాలి యిట్లనెను. "మన మిచ్చటికి నిజముగారాకూడదు. మన మర్యాదకిది తగినపనికాదు. ఈమె మనమీఁద నేమియోం మాయచల్లినది. మనలను వశము చేసికొన్నది. లేనిచో నామె మనవంక వెనుకనుండి యిట్లు చూచుచుండఁగా మనకిట్లనిపించ నవసరములేదు. ఇప్పుడైనను దీనిబారినుండి తొలఁగిపోయినచో మంచిపని చేసినవారమగుదుము." అమృత వల్లి:- ఆమె మనమీఁద నేమిమందుచల్లినది? సామాన్య ముగా మాటాడినది ఆమెయనిన మాటలన్నియు సమంజస ములుగా నున్నవి. మనలను మోసముచేయుటకు కించిత్తై నను ప్రయత్నము చేయలేదు. ఆమె మనవంక చూచు చున్నది. ఆమె చూచుచున్నట్లు మనకు తెలిసినది. అట్లు తెలియుట మనయాత్మలలోని నైశిత్యముకాని యామెయందలి దుశ్శీలత యెట్లగును? శ్రీమాలి:-మన యాత్మలలోని నైశి

త్యము నామె భావనలోని దౌర్జన్యము రెండును కలిసియే యీ ఫలితమిచ్చినదని యేలననరాదు? అమృత:-అనవచ్చును. కాని నాయుద్దేశ్యములో నామెయందొకవేళ నట్టిదౌర్జన్యమున్నను నా దౌర్జన్యముకంటె మనలోని నైశిత్యమే యధికముగానున్నది. ఇంతకు నామెచేత నీవు సోదె చెప్పించికొనలేదు. నేనే యడ్డుతగిలితిని. పోయి యీసోదె చెప్పించికొని వత్తమా? శ్రీమాలి "ఈసోదెలన్నియు నట్టిమిథ్యావాదములు. వట్టియూహలు. వానియందు యాథార్థ్య ముండదు. అమృత: ఎందుకుండదు? ఘుణాక్షరన్యాయముగానే యందము. మన మిద్దఱము మన మన స్వభావానుగుణముగా నేను పులితోలు మీఁద కూర్చున్నాను. నీవు లేడిచర్మముమీఁదఁ గూర్చున్నావు. ఆమె కూర్చుండుమన లేదుకదా! శ్రీమాలి:-అనలేదు కాని యేదియైన యొక నీచమైన యాత్మశక్తిచేత మనమట్లు కూర్చుండునట్లు చేసినదేమో! అమృత:- అట్లైనచో మనము సృష్టిలో దేనినిగుఱించి సందేహపడరాదు. నీతల్లితండ్రులు నీవు వారికడుపునఁ బడునట్లు తమ కుత్సితమైన జీవలక్షణముల చేత చేసినారనవచ్చును. నేను నాతల్లిదండ్రుల కడుపునఁ బుట్టుటకూడ వారుచేసిన యొకకుట్ర యనవచ్చును. లేనిచో నీవుగాని నేనుగాని వీరికడుపులందే పుట్టుటయేమి? ఈకాలమునందే పుట్టుటయేమి? ఈదేశమునందే పుట్టుటయేమి? కలియుగము ప్రారంభించకమున్న భగవంతుఁడైన శ్రీకృష్ణుఁడు కలఁడు. ఆయనభార్య రుక్మిణి. నేనా రుక్మిణీగర్భమునందేల జన్మించలేను? ఎందుకు జన్మించకూడదు? శ్రీమాలి:- కృష్ణునకు కొడుపిల్లలులేరు. అమృత:- లేరేమో బ్రతికిపోయి

నాఁడు. లేనిచో నెన్నియిక్కట్టులు బడెడివాఁడో. శ్రీమాలి; మగపిల్లలను కనుటచేత తప్పించుకొనెనందువా ఆ కొడుకు మాట యట్లుండనిమ్ము. అనిరుద్ధుఁడు మనుమఁడు కదా? వానితో నెంతయుద్ధము పుట్టినది? అమృత:- అతఁడేమి చేసినాఁడు? చేసినదంతయు నా బాణాసురుని కూఁతురు. అందుకనియే పురుషులు స్త్రీలయందే యధికదోషము నారో పింతురు. శ్రీమాలి:- నేనట్లు చేయను. నా యుద్దేశ్య ములో స్త్రీలకంటె పురుషులే దురాత్ములు. ఉష చేసిన దోషమేమియులేదు. అతఁడు కలలో కనిపించినాఁడు. అతనిని కోరినది. ఆమె తప్పేమున్నది? పట్టి కనిపించి యూరకున్నాఁడా? ఆమెను మానభంగము చేసినాఁడు. అమృత:- నీవుకూడ నిట్లనెదవా? కలలో నుషయే కల్పించి కొన్నది. ఆమె మనస్సులోని కామవాంఛ లోకమునందలి మిక్కిలి యందగానిని సృష్టించుకొని వానితో రమించినది. అది యామెకు తెలియకుండ నామె స్వప్నమందు జరిగినది. సహజమేకదా! జీవులు మేల్కొన్నప్పుడు తాము జన్మించిన దేశములయొక్కయు వంశములయొక్కయు గౌరవమును పాటించుచు నిద్రావేళలయందును తమ మస్సులోనను వారి సహజమైన జీవరామమును భావించుచునే యుందురు. ఇది సహజమైనస్థితి. శ్రీమాలి:- అట్లుకాదు. ఆనాఁడు లోకమునం దెందఱో పురుషు లున్నారు. అతఁడే కన్పించుటయేమి? ఎందుకుఁ గన్పించినాఁడు. లోకములోనున్న యందగాండ్రంద ఱిలో నీతఁడే గొప్పవాఁడా? కాదు. అప్పటికి ప్రద్యుమ్నుఁ డున్నాఁడు. ప్రద్యుమ్నుఁడుకదా సర్వ జీవకోటిలో పురు

షులలో నందటికంటె నందగాఁడు; ఆమె యందటికంటె నందగానిని భావించినచోఁ బ్రద్యుమ్నుఁడు రావలయును; అనిరుద్ధుఁడు దుర్మార్గుఁడు కనుకనే తండ్రిని తొలఁగఁబెట్టి తాను బయలుదేరినాఁడు; అమృత:- మన యీ చర్చ యెట్లున్నదనఁగా ఆకాశములో రెండు మబ్బులున్నవి; అవి మనకు మబ్బులుగాఁ గనిపించునుగాని యచ్చటికిఁబోయిన-చో వాని కాకారములేదు; అవి వియన్మండలముననున్న మృదు జల పృషత్పరం పరాసమాహార దేశములు; మనకు దూర ముననకు సాకారములుగాఁ గనిపించును; వానియందు మన మేదియో యారోపించి దోషములను చూపించిన-చో నెట్లుం డునో ఇదియు నట్లే యున్నది; శ్రీమాలి:- నీవన్నది నేను కాదననుకాని ఈ మనస్సు చిత్రమైనది; ఈ లోకమును చిత్రమైనది; అవి వట్టి నీటితుంపురుల గుంపులు వాని యంతట వాకి నేస్థితియులేదు; నేభావమునులేదు; కాని యొక మబ్బ దూరానికి నేన్గువలె కనిపించుటయేమి? మఱి యొకటి భల్లూకమువలెఁ గన్పించుటయేమి? అట్లు కన్పిం చుటకు తజ్జల తుషార సమూహముయొక్క విన్యాసవైఖరి హేతువగునా కాదా? ఆ విన్యాసవైఖరి యట్లుండుటకు హేతువున్నదా లేదా? అది యాదృచ్ఛికమా? సహే తుకమా? యాదృచ్ఛిక మైనను తదాకారక భావనా యోగ్యతా లక్షణము దానియసన్నిహితమై యుండుటకు నేదో హేతువున్నదని చెప్పిన-చో తప్పేమి? అమృత:- ఇంతకు నీవు చెప్పవచ్చినదేమి? స్త్రీలకంటెఁ బురుషులు దుర్మార్గులు. నే నొప్పికొనను. కాలంజరి స్త్రీ. ఆమె

పురుషుఁడుకాఁడు. ఆమెవద్దకు మనము తిరిగిపోయి సోదె చెప్పించికొన్నచోఁ దప్పేమియులేదుకదా! శ్రీమాలి:- నీ కామె చెప్పలేదు. నాకు చెప్పించికొనవలయునన్న కోరిక లేదు. అమృత:- కోరిక యెందుకులేదు. పోయి బియ్యము తెచ్చినదానవు నీవు. సోదెకత్తె తోలుత చేఁబూనఁబోయిన దానవునీవు. శ్రీమాలి:-నేను నీకోసము చేసితిని. నీదగ్గఱ రాచపోకి ళ్లెక్కువ. అమృత:-పేరునకు నాతండ్రి కొన్ని యూళ్లకు ప్రభువేకాని యధికారమునందు నీతండ్రియే గొప్ప వాఁడు. నాతండ్రి చిన్న మన్నెపుదొర. నీతండ్రి సర్వ సేనాధిపతి. శ్రీమాలి:-రాచపోకిళ్లు జీవనిష్ఠములై యుండును. ఎక్కువభాగము బహిఃపరిస్థితులమీఁద నాధారపడియుండవు. అధికుఁడైనవాఁడు నిక్కిపోవుటయు లోకమునం దున్నది. అమృత:- నేను తక్కువదానననుచువా? శ్రీమాలి:-నే నన లేదు. నీవే యనుకొంటివి. అమృత:-ఊరకయ యెందుకో నామీఁదఁ గయ్యమునకు కాలుదువ్వుచున్నావు. శ్రీమాలి:- దువ్వుటలేదు. ఇంటికి పోవుదముపద. తిరిగి కాలంజరి వద్దకు పోవుట నా కిష్టములేదు. అమృత:-నాకామెవద్దకుఁ బోవ లయునని యున్నది. ఆమెతో నింక నేదియో యేదియో మాటాడవలెనని యున్నది. మనకు తెలియని విషయము లామెకెన్నియో తెలియును. వానిని తెలిసికొనవలయును. శ్రీమాలి:- నీరహస్యము నాకు తెలిసినది. నేను మహా సేనాధిపతి వాసుదేవుని కూతురునని చెప్పఁగా నామె యేదో యాలోచించ నారంభించినది. ఎందుకో నాకు తెలియదు. నాయెదుట చెప్పుటకు సంశయించినట్లున్నది. నీవుపోయి

యామెవద్ద నా రహస్యమును కనుకొని రావలయునని నీ యూహ. అమృ:- నిజమే. నీవుండఁగా నామె చెప్పదు. నీవు లేనప్పుడే తెలిసికొనవలయును. శ్రీమాలి:-నారహస్యమును నీవు దెలిసికొనుట నాకిష్టముకదు. అమృత:- మన మిద్దఱము స్నేహితురాండ్రముకదా? నాకు తెలిసినచో నీకుఁ జెప్పనా? శ్రీమాలి:- అది చెప్పరానిదైనచో చెప్పవు. అమృత:- న్యాయమేకదా? శ్రీమాలి:- కాని నాకు చెప్ప రాని విషయము నన్నుగుఱించినదియు నీకు తెలిసియుండుట మన స్నేహములోని మార్దవమునకు సుంత సమీచీనతా లక్షణమునందుకొలవడి యుండును. మన మైత్రి కట్టి లక్షణము సమాసన్నమై యుండుట నా కిష్టములేదు. అమృత:- కాని యొక విషయము చూడుము. దానియం దేమైన యొక యాపత్తి యున్నదేమో! అది యున్నదని ముందు మనకు తెలిసినచో దానిని పరిహరించికొనుటకు సాధ్యమగునేమో! ఈ యల్పమైన హేతువుచేత యధికమైన ఫలమునుండి మన లను మనము బాహిరించుకొనుచున్నామేమో! శ్రీమాలి:- అమృతవల్లీ! నిన్ను నేనెఱుఁగనా? చివరకు నేను నీవు చెప్పి నట్లు చేయవలయునుగాని నేను చెప్పినట్లు నీవు చేయవు. కానిమ్ము. ఇపుడేమిచేయుదము? అమృత:- ఆమెను మన వంక చూచెడి చూపులో మనము తిరిగి యామెవద్దకుఁ బోవలయునని యామెకున్నట్లున్నది పోదము. ఏమియనునో చూతము.

వారిద్దఱీప్రసంగము చేసినంతసేపు నెమ్మది నెమ్మదిగా నడుగులు వేయుచుఁ బోవుచుండిరి. వారి నడక వేగము

తగ్గినదని కాలంజరికి తెలియును. వెనుకకు తిరిగి రావలయునా వలదా యన్న విషయమునుఁగూర్చి వారు తర్జన భర్జన పడు చున్నారనికూడ యామె యనుకొనెను. వారి ప్రసంగాంతము నందలి వారి గమన లక్షణమును చూచి యింక వెనుఁదిరిగి వత్తురనికూడ యామె తెలిసికొనెను. వారు వెనుతిరిగి వచ్చు చుండిరి. శ్రీమాలి యిట్లనెను. ఆమె విచిత్రముగా నూహించు మనిసి. రాజ్యమునుఁగూర్చి రాజులనుఁగూర్చి మన మెప్పుడు నిట్లు భావించలేదు. ఆమె విప్లవకారిణి ఇట్టి మాటలు మఱి యెవరైన మాటాడినచో రాజు వారిని చెఱలో వేయించును. అమృత:- ఆమె మాటాడిన మాట లన్నియు సమంజసములుగానే యున్నవి. ఒక్క మాటలోకూడ నబద్ధములేదు. శ్రీమాలి:- అమృతవల్లీ! మనమిద్దఱ మొక గురువువద్దనే చదివికొంటిమి. ఆమె యనిన మాటలు నాకు విపరీతములుగాఁ గనిపించుచున్నవి. నీకు సంబద్ధములుగాఁ గనిపించుచున్నవి. ఎందుచేత? అమృత:- నేను సామాన్య రాజపురుషుని కూతురను. నీవు రాజ్యమంతయు తనదే యనుకొనుటకు వీలైన సేనాధిపతి కూతురవు. రాజ్యమునందు నీ కున్నంత స్వత్వభావము నాకు లేదు. శ్రీమాలి:-అదికాదు. ఆమె యనిన మాటలలో నొక పెద్ద దోష మున్నది. సృష్టి జరిగినప్పుడే మను వుదయించినాఁడు. ప్రజలతోపాటు రాజు పుట్టినాఁడు. తొలుతఁ బ్రజ లుద్భవిల్లి తద్రక్షణకొఱకు వారు రాజును నియమించుకొనలేదు. ఆ రాజు వీరిని పాలించుకొఱకు నేర్పడలేదు; ప్రజలు రాజును నైకకాలి కముగా జనించిరి; కాని కాలము గడచినకొలఁది ప్రజలలో

దుర్వృత్తి యెక్కునైనది. రాజులును కామాది వాంఛా దూషితులైనారు. అప్పటినుండియు ప్రజలు వరుసఁగా రాజు వేఱుగా భావింపఁబడుట యారంభమైనది. ఒక వృక్షమున్నది. తగినంత నీరున్నది. సుఖములైన వాయువులు కలవు. వృక్షము సర్వత్ర చివురించి కుసుమించినది. అప్పుడది వృక్షము. ఒక దెస నీరు చాలలేదు. ఆ దెసనుండివచ్చిన గాలులు మంచివికావు. వృక్ష మాదెసయందు నెండినది. ఆకులు రాలిపోయినవి. చెట్టుకొమ్మ మ్రోడుగా భాసించినది. అప్పుడేమైనది? ఏకదేశమునందు వృక్షము వృక్షము కాకపోయినది. బీజమునుండి యంకురోదయము కలిగినప్పుడు సర్వము చక్కగా సాగినచో వృక్షమంతయు వృక్షమై సుఖముగా నుండెడిది. పరిస్థితులు మారునప్పటికి చెట్టుబోదవేఱు. కొమ్మలు వేఱు. ఆ కొమ్మలలో కొన్ని ఛేద్యములు. కొన్ని స్వీకార్యములు. ఇది స్థితి. ఏకదేశమునందు చెట్టు చెడిపోఁగా చెట్టుయొక్క యంకురస్థితిని దూషించుట యెట్టిదో నామె రాజులను తిట్టుట యట్టిది. రాజులలో గుప్టు లుందురు. ప్రజలలో నుందురు. దానికి కాలము కారణము. సమష్టిగానున్న యొక వ్యవహారమును సమష్టిగా చూడక భిన్న భిన్న విషయములను వివిచ్యమానముగాఁ జూచి దోషారోపణ చేయుట కారంభించినచో నా సమష్టియైన వ్యవహారమును పరమేశ్వరుఁడు సంకల్పించెను. సుస్థితిని నీ వెప్పుడును పరిరక్షింపఁజాలవు. భిన్నదేశములయందు భిన్నదోషములు కనిపించును. దోషములను నిర్మూలింతువో మూలచ్ఛేదమే చేయుదువో తెలియదు. ఒక్కటిమాత్రము చెప్పుచున్నాను. ఆ వృక్షము

పరమేశ్వరోద్దిష్టమైన వృక్షముగానుండి యెండకాలమున నెండల నాపుచు శీతకాలమున చల్లదనమును ప్రసాదించుచు వసంతకాలమున పుష్ప ఫలముల నిచ్చుచు నేత్రాభిరామమై యుండవలయునన్న వృక్షమును వృక్షముగా భావింపుము. వృక్షస్వరూపమును నాశనము చేయకుము. నీవు భిన్నదేశముల యందు దోషములనుచూచి ఛేదింప నారంభించినచో వృక్షాకృతి యుండదు, ఆకులుండవు, చివుళ్ళుండవు, పూవులుండవు, ఎండిన కొమ్మలుండును. వంట కట్టెయలకు పనికి వచ్చునుకాదా! యెండు కొమ్మలమీద పక్షులు వచ్చి వ్రాలుటకు కృతకనీడములను నిర్మాణము చేయవచ్చును. దానినే వృక్ష మనవచ్చును. అందుచేత కాలంజరి చెప్పిన మాటలు నాకు రుచించలేదు. ఆమెయందు నాకనురాగము కలుగలేదు. అమృత:- శ్రీమాలీ! నీవొక దేవతామూర్తివి. నేను నీతో చెలిమి యెందుకు చేయుచున్నాను. నీ జీవలక్షణము నాకు తెలియును. నీవు శ్రీకృష్ణదేవునికి నిజముగా కూతురుగా జన్మింపవలసినదానవు. ఆ యదృష్టము భగవంతునకే లేదు. అదియట్లుంచి ఆమె యేమి సోదె చెప్పునో చూతము. నీకు పెండ్లి యెప్పుడగునో భర్త యెటువంటి వాడు వచ్చునో నీవు సుఖపడుదువో సుఖపడవో ఈ విషయములు తెలిసికొనవలయునని నాకు చాల యున్నది. శ్రీమాలి:- నీకుమాత్రము పెండ్లి కానక్కఱలేదా! నీవు మాత్రము సుఖపడనక్కఱలేదా? నీవేమి ముదివగ్గువా? కోర్కెలుడిగినదానవా? నాయందు నీకింత ప్రేమయున్నచో నీయందు నాకుమాత్రము లేదా? నీసంగతి తెలిసికొన

వలయునని నాకును గలదు. అమృ:- శ్రీమాలీ! నాదొక రహస్యము. నాజీవితమొక సమస్య. నాయొక్క వయస్సు లేఁతదియే కాని నా మనస్సు మిక్కిలి వృద్ధమైనది. నేను లోకమునకు బాలికవలె నభినయింతును కాని నామనస్సు చేతఁగాని నా కోర్కులచేతఁగాని నా యభిమతములచేతఁ గాని నేను బాలికనుకాను. నేను వయసు కడచినదానను. ఇదియొక రహస్యము. నాకే తెలియును. నీతోకూడ నెప్పుడు నిట్లనవలయునని నే ననుకొనలేదు. నీకు తెలియదు. నీవు నన్నడుగవద్దు. అడిగి ప్రయోజనములేదు. నేను బ్రతికి యుండఁగా నీ రహస్య మెవ్వరికిని చెప్పను. నా భవిష్యత్తు కాలంజరి యేమిచెప్పఁగలదు? ఎట్లు చెప్పగలదు ? కాలంజరిని యొక దేవత యావహించును. నా జీవితరహస్యము దేవతలకు కూడ నగమ్యమైన విషయము. అందుచేత నామెకు పూనకము రాలేదు. నీసంగతి యటువంటిదికాదు. పోదము పద. శ్రీమాలి:- అదియేమే యమృతవల్లీ! ఉన్నట్లుండి నా గుండెలో నొకఱాయి పడవేసితివి. నాకు కాళ్లాడుటలేదు నే నడుగరాదనుచుంటివి. అడిగినను చెప్పననుచుంటివి. నీ విట్టిస్థితిలో నుండవలసిన యవసరమేమి? అమృత:- నాకు తెలియదు. ఇదియొక దైవ నిర్ణయము. ఒక యసంభవమైన వాంఛ యొకరికి కలిగినచో నదియొక దుర్యోగమని చెప్పికొనవలయునేగాని మఱియేమి చెప్పవలయును? అట్టి దుర్యోగము సద్యోగ మనుకొను మనోలక్షణముకూడ నున్నచో నంతకంటె విచిత్రమేముండును? నా స్థితి యట్లున్నది. నేనబ్లైతిని. శ్రీమాలి:- ఎవరిని ప్రేమించితివి? ఆయసంభవమైనస్థితి యేమి?

అమృత:- నే నడుగవద్దంటిని. ఇది ప్రేమవిషయమే కాకపో వచ్చును. నీవు తర్కముచేత నానుండి సమాధానమును గ్రహించుటకు ప్రయత్నించినచో ఫలితముకూడ నుండదు.

ఇద్దఱును కాలంజరి గడపవద్దకు వచ్చిరి. మఱల తొలిచోట్లనే కూర్చుండిరి. అమృతవల్లి శ్రీమాలికి సోదె చెప్పుమని యడిగెను. ఆమెయస్థి పుచ్చుకొనెను. శ్రీమాలి దానిని గ్రహింపఁబోయెను. మఱల బెరుకుపొందెను. తా మచటనుండి వెళ్ళకమున్న శ్రీమాలి మనస్సు బొమికను గ్రహించుటకు సుముఖమైనదికదా! ఇప్పుడు మఱల వెనుకకు లాగుచున్నదేమి? ఆమె మనసును దిటవుపఱచుకొని బొమి కను పట్టుకొనెను. కాలంజరి కనులుమూసికొని "జయజయ చండి! మహాకాళి! దుర్గే! కాత్యాయని, గౌరి, హిమగిరి కుమారి, ఖండశశికిరీటా! శివార్థశరీరా! భగవతి! జయ జయ త్రిపురసంహారకాలమహాభైరవాకారా! శుంభ నిశుంభ దంష్ట్రాపాద తాడనకఠోరదేహా! దుర్గా! చాముండీ! వారాహీ! మహేశ్వరీ! భద్రకాళీ! జయజయ! ఓసి యువతీ! నీజన్మ చిత్రమైనది. నీపూర్వులకథ మిక్కిలి చిత్రమైనది. నీ తల్లి తండ్రులు నీకొఱకు తపస్సుచేసిరి. వారు తపస్సుచేయుటలో కొంత నియమభంగము కావించిరి. ఆ తపస్సీ జన్మలో చేసి నదికాదు. పూర్వజన్మలో చేసిన తపస్సు. ఆ నియమ భంగమగుటచేత వారికడుపున నీవు వారి పూర్వజన్మలయందే పుట్టుట జరుగలేదు. ఇంకొక జన్మకు నీవు వారి గర్భముల యందుఁ బడవలయునని వ్రాయఁబడియున్నది. ఇంతలో చీఁకటి క్రమ్ముచున్నదేమి? కనిపించుచున్న వెలుఁగు తిరోహిత

మగుచున్న దేమి? భాసించుచున్న వివేకము మఱుఁగుపడుచున్న దేమి? జయ జయదుర్గే! కాళికే! అంబా! మహామాహేశ్వరి! ప్రసన్నురాలవుకమ్మా. అదిగో మఱల కనిపించుచున్నది. ఓసి శ్రీమాలీ! నీవు దేవతాలోకములలోని స్త్రీవి. తపోభంగము పొందినావు. మానసలోకమునందు జన్మించినావు. నీవు పారిజాత వృక్షముక్రింద కూర్చున్నావు. తపస్సు చేయుచున్నావు. నీవు దేవతాస్త్రీవికావు. ఎవరో ఋషికూతురవు. ఆఋషి నిన్నెవరికోయిచ్చి పెండ్లిచేయ వలయుననుకొన్నాఁడు. నీవు వివాహమునందు విముఖురాలవై తండ్రిమాట నథఃకరించి తపస్సుచేయుటకు వచ్చినావు. నీతండ్రికి నీమీఁద కోపము వచ్చినది. నిన్ను శపింపఁ బోయినాఁడు. అదుగో నీతల్లి వారించుచున్నది. కడుపునపుట్టిన బిడ్డను శపింతురా యని నీ తండ్రిని బతిమాలుచున్నది. ఇదియేదో పెద్దగాలి వీచుచున్నది. ప్రభంజనముగా నున్నది. ఈ పారిజాతపు చెట్టుకొమ్మ నావైపునకు వ్రాలినది. చెట్టుక్రింద కూర్చున్న నీవు కనిపించుటలేదు. నీవేమైనావు? జయజయ దుర్గే! భద్రకాళి! మహాచండి! వారాహీ! మాహేశ్వరి! ప్రసన్నురాలవుకమ్మా. నీతండ్రి కోపము తగ్గలేదు. నిన్ను మానవలోకమునందు జన్మింపుమని శపించినాఁడు. నీతల్లి కన్నీరు మున్నీరుగా నేడ్చుచున్నది. నీతల్లి యేమనుచున్నది? ఇట్లనుచున్నది. నా బిడ్డ మానవలోకమునందు పుట్టినను తనస్సే చేయుగాక. ఆమెయొక్క తపోభంగ మెవ్వరును చేయలేకుందురుగాక. ఇంతలో నీతండ్రి యేమో యనుచున్నాఁడు. గాలి యుపశ

మించుచున్నది. గ్రాలిన చెట్టుకొమ్మ మబ్బుల పైకిలేచినది. నీవు కనిపించుచున్నావు. నీతండ్రి యిట్లనుచున్నాఁడు. నీకా జన్మలోకూడ నిదియే పేరు. నీవప్పుడును శ్రీమాలివే. నీతండ్రి యిట్లనుచున్నాఁడు. ఓసి శ్రీమాలీ! నీవు తపస్సు చేయ నెంచుచున్నావు. నీవు మానవజన్మలో వివాహ మాడి తీరవలయును. వివాహమాడుదువు. నీతపస్సు పాతి ప్రత్యరూపమున నుండును. ఆ తపస్సునకు ప్రబలమైన ప్రచండ మైన విఘ్నము సంభవించును. అయ్యో! మబ్బుల ప్రభంజన మారంభించినది. పారిజాతపు కొమ్మయొకటి విఱిగి పడినది. ఆకొమ్మ నీ నెత్తిన పడినది. నీవు దేవతాస్త్రీవికావు. ఋషి కూతురవు. నీ శిరస్సుపగిలి పోయినది. నీవు చనిపోయితివి. అయ్యో! అయ్యో! జయదుర్గే! జయ శుంభ నిశుంభమహా దైత్య దంతతాడన చరణాంబుజే! కమల లోచనే! దేవి! పరమమాహేశ్వరి! అదుగో! శ్రీమాలి యాత్మ భూలోకమున కభిముఖముగా ప్రయాణము చేయుచున్నది. మగధదేశము నకువచ్చినది." అంత కాలంజరి చేతిలోనుండి బొమిక జాఱిపోయినది. శ్రీమాలి యస్లేపుచ్చుకొనియున్నది. కొంత సేపటివఱకు కాలంజరి కన్నులు తెఱవలేదు. కన్నులు తెఱచి నది. మానిసి శ్రమపడి నట్లున్నది. శ్రీమాలివంకఁజూచినది. ఇట్లన్నది. ఏమమ్మా! ఆ బొమిక నస్లే పుచ్చుకొనియున్నావు. వదలిపెట్టలేదేమి? నేనేమి చెప్పితిని? ఏమి చెప్పితినో నాకు తెలియదు. నేను చెప్పినదంతయు నిజముగను. అందులో కొంతభాగము కాకపోయినఁ గొంతయైనను కాకుండనుండు టకు నీవు ప్రయత్నమైనను చేయలేదే! ఆ బొమిక నస్లేపుచ్చు

కొని కూర్చుండుట నేనెంత చెప్పితినో అంతయు జరుగు నను టకు తార్కాణ. నిర్బంధపోయిగాని యసహ్యించుకొనిగాని యవిశ్వాసముచేతగాని యాబాలిక నెవరు పరిత్యజింతురో వారికి చెప్పినంతయు జరుగబోవచ్చును. అట్లే పట్టుకొని కూర్చున్నవారికి నిశ్చయముగా జరుగును. అమృత:-నీవా మాట మొదట చెప్పినచో శ్రీమాలి బాలికను వదలిపెట్టెడిదే. నీ విప్పుడు చెప్పితివాయెను. కాలంజరి:- నేను చెప్పెడి మాటయా యిది. దానియంతట నది జరుగవలసినదాయెను. అమృతవల్లి:- పాతివ్రత్యము భంగ మెట్లగును? కాలం:— ఎవరి పాతివ్రత్యము? భంగమగుటయేమి? అమృత:-శ్రీమాలి యొక్క పాతివ్రత్యము భంగమగునని నీవు జెప్పితివి. కాలం:- నాకు తెలియదు. అమృత:- తెలియదుసరే. ఒకానొక స్త్రీ పతివ్రత. ఆమె పాతివ్రత్యము భంగమగునని వ్రాయఁబడి యున్నది. అది యెట్లు భంగమగును? మన మాలోచింతము. కాలం:- అంత యాలోచించెడి శక్తి నాకులేదు. శ్రీమాలి:- పాతివ్రత్య మెప్పుడును భంగముకాదు. దానికి భంగములేదు. పాతివ్రత్యము భంగమగునని చెప్పుట పాతివ్రత్యముయొక్క స్వరూపము తెలియకుండుట. భంగమయ్యెడిది పాతివ్రత్య మనిపించుకొనదు. భంగమయ్యెడిస్థితి దానికున్నచో దాని యందు పాతివ్రత్య శబ్దప్రయోగార్హతలేదు. తపోభంగమన్న మాట వేఱు. పాతివ్రత్యభంగమన్నమాటవేఱు. తపస్సునకు భంగము కలుగవచ్చును. జీవితాంతము పతివ్రతయై యుండి ననే దానిని పాతివ్రత్యమందురు. ఒకస్త్రీ జీవితములో కొంత భాగము పతివ్రతగానుండి మిగిలినభాగము జారిణిగానుండదు.

ఉన్నచో నా మొదటిస్థితిని పాతివ్రత్యమని యెవ్వరును ననరు. ఈమె చెప్పిన సోదె వట్టి సోదె. పైగా నేను బాలికను వదలి పెట్టక పోవుట తన జ్యోతిషము యథార్థమగుటకు నిదర్శన మనుచున్నది. ఈమె యల్లినకథ నాకు విశ్వాస్యముగాలేదు. నేనొక ఋషికూతురు నగుట యేమి? నందన వనములో తపస్సుచేయుట యేమి? నా తండ్రి ఋషి యైనచో నేను తపస్సు చేయుదుననగా సంతోషించును. పెండ్లి చేసికొ మ్మనడు. ఈమె మాట లొకదాని కొకటి పొసగుటలేదు. పైగా నొడలు తెలియని శివ మొండదు. ఎంత పూనకము వచ్చినను తానేమి చెప్పెనో తనకు తెలియకుండ నుండునా? అంతటి తన్మయత్వమా? అంతటి తన్మయత్వము పొందగల స్థితి యీామెకున్నచో నిల్లు సోదె చెప్పవలసినగతి యేమి? పరమేశ్వర లగ్నబుద్ధియై సమాధి దశలోనికి పోవచ్చును. జన్మయొక్క చారితార్థ్యమును సంపాదింపవచ్చును. ఇట్టి కృతకవిద్యలచేత జీవింపవలసిన యవసరములేదు. ఇందులో నొకడు మగడు. వాడు కాలజ్ఞానము చెప్పును. ఈమె పాతివ్రత్యములకు భంగములు చెప్పును.”

అమృతవల్లి యేకాకిని మఱునాడు కాలంజరి వద్దకుఁ బోయెను. కాలంజరి తాను కూర్చుండు స్థలమునఁ గూర్చుండి యేదో యాలోచించుచుండెను. అమృతవల్లి వచ్చిన విషయ మామెకుఁ దెలియలేదు. కొంతసేపటి కామెకనులు తెఱచెను. అమృతవల్లిని చూచెను. అమృతవల్లితో మాటాడలేదు. అమృతవల్లి యిట్లనెను. “నీకు కోపము వచ్చిన ట్లున్నది. మా చెలికత్తె శ్రీమాలి సహజముగా సాధువేకాని యొక్కొ-

కొప్పుడామెకుఁ గోపము వచ్చినచో నోపలు తెలియకుండ మాటాడును. ఎంతటి సాహసమునకైనను వెనుదీయదు. చూచితివికదా, బిడ్డ చచ్చిపోయెనని ప్రక్కనున్న మహా ప్రవాహములో నెన్ని లేళ్ళు దూఁకి చనిపోవును. ఎక్కడి కక్కడికి సర్వజీవులకు తమ ప్రాణము తీపిగదా! సాహస మనఁగా నెచ్చట నున్నది. తన ప్రాణముమీఁదఁగల తీపిని వదలిపెట్టుకొనుటయేకదా సాహసమన్నమాట కర్థము. వదలి పెట్టుకొనుట కాకపోయినచో దానినప్పుడు వదలిపెట్టుటయని యర్థము. దాని నానిమేషమున మఱచిపోవుటయని యర్థము. మఱచిపోవుటయనఁగా నింకొకభావముచేత దానినిఁ గప్పి చేయుట. ఇంకనుఁ జెప్పినచో ఒకానొకప్పు డొక్కొక్క భావమును తీవ్రముఁగా తన మనస్సును తన బుద్ధిని తన యహంకారమును, తన జీవిత వాంఛను సర్వమును సమాక్ర మించునట్లు చేయుట. ఇదియే సాహసమన్నమాట కర్థము. అప్పుడప్పుడు శ్రీమాలియం దీ లక్షణమున్నది. ఆమె సహ జముగా మంచి. సాధుస్వభావముకలది. వినయవంతురాలు రాజునందు చాల భక్తికలది. దానికిఁ గారణము తన తండ్రి మహాసేనాధిపతి యగుట కావచ్చును. లోకములో నింతియే కదా! సర్వాభిమానములు తమ బ్రదుకుయొక్క కారణముల నాశ్రయించి యుండును. ఒకని యుప్పు మనము తిను చున్నాము. వాఁడన్నచో పడిచత్తుము. మన సంప్రదా యము కూడ నంతియే. అట్టివాఁ డన్నచో నభిమానము కలిగియుండుట కృతజ్ఞత యందురు. మన జీవనమున కెవ్వఁడు హేతువో, ఎవఁడు మనలను పోషించునో వానియం

దభిమానముగా నుండుట, వాని కపకారము చేయకుండుట, వానికి వ్యతిరేకముగా భావించకుండుట కృతజ్ఞత యనియు, నది కానిది కృతఘ్నత యనియు చెప్పుదురు. మానవబుద్ధి యనాదినుండియు నిట్టి భావ పరంపరమీఁద పెంచఁబడినది. అది సంప్రదాయ మనునది. దానికి 'సత్తు'అని పేరు పెట్టినది. అదియే మోక్షమునకు హేతు వన్నది. దానికి వ్యతిరేకముగాఁ బ్రవర్తించుట నరకహేతు వన్నది. ఆమె నట్టి సంప్రదాయములో పెరిగిన బాలిక. కాలం:-నీవు కావా? నీవు నటువంటిదానవేకదా! అమృత:-నేను కాను. నాకును సంప్రదాయమునకును చాల దూరము. దానికి కారణ మున్నది. మా తలిదండ్రులకు నే నొక్కర్తనే బిడ్డను. నాకన్న ముందు పదిమంది పిల్లలుకలిగి వారందఱును చని పోయిరి. నేను మాతలితండ్రులకు వయసుదాటిన తరువాత పుట్టితిని. ఇప్పుడు మా తలిదండ్రులు వృద్ధులు. నేనెంత గారాబముగా పెంచఁబడితినో చెప్పుటకు వీలులేదు. కొండ మీఁది కోఁతిని దిగిరమ్మన్నచో నది దిగిరావలసినదే. నా కంత పట్టుదల. నేనన్నమాట మాయింటిలో కాదనుటకే వీలు లేదు. కాని మా తలిదండ్రులు సంప్రదాయబద్ధులే. నే నింతవఱకెన్నడును సంప్రదాయమును మీఱినదిలేదు. కాని దాని కెప్పుడును వ్యతిరేకముగానే మాటాడుదును. నే నెందుకు మాటాడుదునో నాకు తెలియదు. నన్ను మా తల్లిదండ్రు లెంతప్రేమించుచున్నారో తెలిసికొనుటకే నే నెప్పుడు ప్రయత్నింతును. వారికి నాయందుఁగల ప్రేమను సర్వకాలముల పరీక్షింతును. నేనన్నమాట వారు కాదననే

కాదనరు. అన్నచో నేను మారాము చేయుదును. కోప
గింతును. ఏడ్తును. అన్నము మానివేయుదును. చివరకు నేను
చెప్పినది వారొప్పుకొందురు. నేనిట్లు పెరిగితిని. శ్రీమాలి
పెరిగిన లక్షణమిట్టిదికాదు. ఆమె కన్నగారు కలఁడు.
అతఁడు గొప్ప రాజకీయవేత్త. రాజ్యాంగములో నొక
గొప్ప యధికారము కలవాఁడు. తండ్రి మహాసేనాపతి యగుట
వలన నతని యధికారము చిన్నదైనను నతని పలుకుబడి పెద్దది.
మంత్రులుకూడ నతనిమాటను కాదనరు. శ్రీమాలిమీఁదఁ
దండ్రికంటె నన్నగారెక్కువ యధికారము చేయుదురు.
తండ్రికి శ్రీమాలి యనినచోఁ జెప్పరానంత ప్రేమ. ఆ ప్రేమ
వలన వాసుదేవుఁడు తన కూతును పాడుచేయునని యామె
యన్నగారు నామె నదుపులోఁ బెట్టును. వాసుదేవునకు
నాతఁ డొక్కఁడే కొడుకు. ఈమె యొక్కతేయే కూతురు.
శ్రీమాలి కన్నగారే లేనిచో నామెకూడ నావలెనే యయ్యె
డిది. ఆయన్నగారు చండప్రచండుఁడు. ఆమెతండ్రి చాల
సత్పురుషుఁడు. అంత సామర్థ్యము, అంత వివేకము, అంత
మంచితనము నొకచోట నుండుట యసంభవము. సమర్థుఁ
డహంకారియైయుండును. వివేకి గర్వియై యుండును. ఈ
రెండులక్షణములు కలిగి వాసుదేవుఁడు పరమయోగ్యుఁడై
యెంతో మంచివాఁడై, ఎంతో రాజాభిమానియై యుండుట
యీ రాజ్యమునకు రక్షగా నున్నది. మన రాజైన దేవభూతి
నీవు చెప్పినట్లు స్త్రీలోలుఁడు. అతని స్త్రీలౌల్యమున కవధిలేదు.
ఆయన యెప్పుడును గిరివ్రజమునందే యుండఁడు. ఎప్పుడును

విదిశానగరమునం దుండును. ఆ విదిశానగరము వారాంగనలకు నివాసస్థానము. ఆ వారాంగన లప్సరస్త్రీలు. భరత శాస్త్ర పారంగతలు, హేలారంభలు. రాజు అచ్చటనే యుండును. రాజ్య మెట్లు నడచుచున్నచో, రాజ్యపరిస్థితి యెట్టిదియో, రాజ్య వ్యవహారము లెట్లు జరుగుచున్నవో వీనినిఁ గూర్చి పట్టించుకొననే పట్టించుకొనఁడు. అంతయు మంత్రులమీఁదనే యాధారపడి యున్నది. ఇట్టి పరిస్థితిలో రాజ్యాంగ వ్యవహారములు చమత్కారముగా నడచును. ప్రత్యక్షముగా రాజు లేఁడు. రాజున్నచో మంత్రులకు విలువ. రాజు లేనిచో మంత్రుల మాటలకు విలువ యుండదు. కనుక నెవ్వరికినిఁ దెలియకుండ సర్వాధికారము సేనాధిపతి చేతిలోనికిఁ బోవును. ప్రజలకు మంత్రుల మాటమీఁద విలువ యుండదు. సేనాపతి మాటమీఁద విలువ యుండును. అతని చేతిలో సేన లున్నవి. దండించఁగల శక్తి యతని కున్నది. అందుచే సేనాధిపతికి నతనికిఁగూడ తెలియకుండ రాజ్యాధికారము కలుగును. రాజనీతి యిట్లుండఁగా వాసుదేవుని కుమారుఁడైన భూమిమిత్రుఁడు మంత్రులకు గౌరవనీయుఁ డయ్యెను. భూమిమిత్రుఁడు పెద్ద యుద్యోగికాదు. కాని యతని నీతియు, వివేకమును మంత్రులందఱిచేత నతనికి గౌరవము కలిగింపఁ జేసినవి. ఆమంత్రులు భూమిమిత్రునితోఁ జెప్పకుండ నేపనియుఁ జేయరు. భూమిమిత్రునిస్థితి విలక్షణముగా నున్నది. అతఁడు సర్వరాజ్యభారమును తన భుజముల మీఁదికిఁ దీసికొన వలయు నన్నంత యాశ కలవాఁడు. అతని యాశకు మేరలేదు. కాని యతనియందున్నది ఒక్క-

టియే లోపము. అది లోపమో కాదో నాకుఁ దెలియదు. అతనికిఁ దండ్రిమీఁద నున్నంత గౌరవము శ్రీరామచంద్రు నకు దశరథునిమీఁద లేదనవచ్చును. శ్రీరామచంద్రునకుఁగల గౌరవము నిజమునకు తండ్రిమీఁదకాదు. ధర్మముమీఁద. ఇతనికి నచ్చముగాఁ దండ్రిమీఁద. అంతటి నీతివేత్తకు, అంతటి స్వార్థపరునకు నంతటి లౌకికునకు తండ్రిమీఁద నంత ప్రేమ యుండుట, నంత గౌరవ ముండుట, నంత దేవతా భావ ముండుట సృష్టియొక్క చరిత్రలో నుండదు. ఇచ్చట నీవు నేనే యుంటిమి. నేననిన మాట లెవ్వరు వినలేరు. ఎవ్వరికినిఁ దెలియదు. ఒక చమత్కారమైన విషయము. ఆ వాసుదేవుని వయస్సు నలుబడియైదు దాటియుండును కొడుకువయస్సు పాతికయేం డ్లుండును. ఆ వాసుదేవునకు చిన్నప్పుడే పెండ్లియయ్యెను. ఆయనయొక్క యిరువదియవ యేటనే భూమిమిత్రుఁడు జన్మించెను. తరువాతఁ బదేండ్లకు శ్రీమాలి జన్మించెను. మఱల సంతానము లేదు. ఆ వాసు దేవునిభార్యను చూడనలయును. ఆమెనుఁ జూచినచో మహా సేనాధిపతిభార్య యనిపించదు. ఒక పల్లెటూరి బ్రాహ్మణస్త్రీ యనవలయును. భర్త యంత యధికారి. కొడుకింత ప్రయోజకుఁడు. ఇంచుమించుగా రాజ్యమంతయు వారి మీఁద నడచుచుండును. ఆ వాసుదేవునిభార్య పరమజానప దురాలు. ఆకొడుకునకు తండ్రిబుద్ధి వచ్చినది. తల్లి రూపము వచ్చినది. అనఁగా వాసుదేవుఁడు పరమసుంద రుఁడు. ఆయనకు నలువదియేండ్లున్నను వానిమూర్తి మధు మాసమువలె నుండును. శ్రీమాలి అచ్చముగాఁ దండ్రినిఁ

బోలి పుట్టినది. తల్లినిఁబోలి పుట్టిన కొడుకును, తండ్రిని పోలి పుట్టిన కూతురును అదృష్టవంతులని లోకములోఁ జెప్పుదురు. వారి కడుపున నీ యిద్దఱు అదృష్టవంతులు పుట్టిరి. శ్రీమాలి యన్నగారి యదుపు లేకపోయినచోఁ జెప్పలినిగదా నావలెనే విపరీతమైన యూహాలు నలవాట్లు నడవడియుఁగలిగి యుండెడిది. ఆ భూమిమిత్రుఁడు పదునైన కత్తివంటివాఁడు. నేను వారియింటికిఁ బోవుదును. వాసుదేవుఁడు నన్నెంతయో ముద్దుగా లాలనగాఁ బ్రేమగాఁ జూచును. శ్రీమాలి తల్లికూడ నన్ను శ్రీమాలిని చూచినట్లే చూచును. ఆభూమిమిత్రుఁడు నన్నుఁజూచినచో మొగము ముడకటించుకొనును. రుసరుసలాడును. నేను వారియింటికి వెళ్ళుటయే యతనికిఁ గిట్టదు. ఆకారణము నాకు తెలియదు. తెలియదనుటకును వీలులేదు. ఆకారణము నాయంతరాంతమున నెచ్చటనోకలదు. లోకములో పరమవివేకియైనవానిని పరమలౌకికుఁడైనవానిని వాఁడావులించినచో ప్రేవులు లెక్కపెట్టునని చెప్పుదురు. ఈ భూమిమిత్రుఁడు ప్రేవులు లెక్కపెట్టుట కావులించ నక్కఱలేదు. ఇంత తెలివితేటలు తండ్రివద్దనున్నవి. అవి తండ్రివద్ద కనిపించవు. అనఁగా వానిని వాసుదేవుఁడు వ్యవహారదశకు తీసికొనిరాఁడు. లౌకికాచరణమునందుఁ బ్రవేశపెట్టఁడు. ఈ భూమిమిత్రుఁడు ప్రతిపదమునందు వాని యావిర్భావమును వెలయించును. చూచితివా? వాసుదేవుఁడు పరమరాజభక్తుఁడు. భూమిమిత్రుఁడగునో కాదో చెప్పలేము. చెప్పితినికదా! భూమిమిత్రుని యొక్క సర్వప్రవర్తనయు స్వాతంత్ర్యమును పరిత్యజించి తంత్రీ

ననుసరించి యుండును. కాని దాని వ్యక్తిత్వము నది యుప సంహరించదు. అతఁడు చెల్లెలి నదుపులోఁబెట్టును. చెల్లెలిని గడి కదలనీయఁడు. శ్రీమాలి నిన్న నాతో వచ్చినదనఁగా నేను తీసికొని వచ్చితిని. ఆయింటిలోనుండి శ్రీమాలిని నిన్న నారీతి తీసికొని వచ్చుటయనఁగా నాపని నేనుతప్ప నింకెవ్వరు చేయలేరు. ఆమెతండ్రి వాసుదేవుఁడు నేను కోరిన విషయమును నిస్సందేహముగా పాలించును. భూమి మిత్రునకు నా నడవడి బాగుగానుండదని నేను హద్దుమీఱి ప్రవర్తింతునని, నాకు సభ్యప్రవర్తన తెలియదని, నేను స్త్రీ వలెఁగాక పురుషునివలెఁ బ్రవర్తింతునని నాతోఁ గలిసి తిరిగి నచోఁ దన చెల్లెలు చెడిపోవునని పలుభావములు కలవు. ఈ భావములు వాసుదేవున కున్నవో లేవో నాకు తెలియదు. ఇట్టి భావములు నన్నుఁగూర్చి వాసుదేవుని కున్నట్లు వాసు దేవుఁ డెప్పుడును వెలయించలేదు. ఒకవేళ నట్టి భావము లాయన కున్నను నాయందు వాని నాయన పరామర్శించఁడు. నాయందాయన కవ్యాజమైన యొక యనురాగముకలదు. దాని స్వరూపము నాకుఁ దెలియదు. పరిస్థితి యిట్లుండఁగా శ్రీమాలియు నేనును నొకచోటికి వెళ్ళివత్తుమని తండ్రియుఁ గొడుకును నున్నవేళ నేను చెప్పితిని. తండ్రి యంగీక రించెను. కొడుకున కిష్టములేదని నాకుఁ దెలియును. నే నతనివంకఁ జూడనైన చూడలేదు. నాయందు వాసుదేవు నకుఁగల మహాప్రత్యయము నాకుఁ తెలియును. దాని నిట్లుప యోగములోఁ బెట్టితిని. ఎందుకు పెట్టితిననఁగా నొకందుకు పెట్టితిని. జయద్రథుఁడుతాత నీవద్దకుఁబోయి మమ్ము మా

భవిష్యత్తులు తెలిసికొనిరండని చెప్పెను. శ్రీమాలిరాకుండ నీవెట్లు చెప్పఁగలవు? భూమిమిత్రునకు మేము విదురుఁడు తాత వద్దకే వెళ్ళుదుమని తెలియునుగాని జయద్రథునివద్దకు పోదు మని తెలియదు. ఏలయనఁగా నీ మహానగరమునఁ బలు మంది తమపిల్లలను జయద్రథుఁడు తాతవద్దకుఁ బోనీయరు. అతనినిఁగూర్చి పలురకములైన వదంతులు కలవు. అతఁడు భూతములతో వ్యవహరించుననియుఁ, బ్రయోగములు చేయు ననియు మానవుల మనస్సులు మార్చుననియు నతఁడు చేసెడి పనులు భవిష్యత్తులో నాపదలకు దారితీయుననియు నిట్టి యభిప్రాయములు కలవు. అందుచేత నెవరునుఁ దమ పిల్ల లను వానివద్దకుఁ బోనీయరు. కాని పిల్లలందఱు సహజ ముగా నతని దెస కాకర్షింపఁబడుదురు. మేము నట్లే యాకర్షింపఁ బడితిమి. ఆయనయు విదురుఁడు తాత వంటివాఁడే. కొందఱి కొందఱినిఁ గూర్చి యపప్రథలు వ్యాపించును. ఆయననుఁగూర్చి నేన ట్లనుకొందును. నాకు శ్రీమాలిమీఁదఁ బట్టరానంత ప్రేమ. ఓసి కాలం జరీ! ఆ శ్రీమాలియన్నచో నా వాసుదేవుఁడన్నచో నా హృదయాంతరములో నే ననుభవించు నొక యాద్రితా లక్షణముయొక్క స్వరూపము నా కింతవఱకు తెలియలేదు. వారి యిద్దఱికొఱకు నన్నుఁ జనిపొమ్మన్నచో నేను చని పోదును. నా భవిష్యత్తుకంటె శ్రీమాలి భవిష్యత్తు తెలిసి కొనుట నాకు ముఖ్యము. అందుచేత నామె నిచ్చటికిఁ దెచ్చితిని; ఆమె నీకుఁ గోపమువచ్చునట్లు మాటాడినది. ఆమెయొక్క పెంపకముయొక్క లక్షణము, స్వభావము,

పరిస్థితులును నీతోఁ జెప్పి నీకామెయందుఁ గోపము గలిగి నచో నాకోపమును తొలఁగించవలయుననియు మఱియు నింక నేమైన రహస్యము లామె భవిష్యత్తునుఁగూర్చి నీవు చెప్పినచో వినవలయుననియు నేను వచ్చితిని; కాలం:— మఱియు నెందుకు వచ్చితివి? అమృత:- జయభద్రఘుఁడుతాత నీవద్దకుఁ బొమ్మని యెందుకు చెప్పెను? ఆయన నిన్నెఱ్ఱుఁగును? నిన్న నీవు చెప్పిన నీకథలో ఆయన ప్రసక్తి యేమియులేదు; ఆయనను నీ వెఱఁగినట్లులేదు; ఆయన నెప్పుడైన చూచితివా? కాలం:- అమృతవల్లీ! నీ శ్రీమాలి మీఁద నిన్న నాకు మిక్కిలి కోపమువచ్చినది. ఆమె నా సోదెయందు నవిశ్వాసము ప్రకటించినది. నేను పదియేండ్లుగా సోదె చెప్పుచున్నాను. కడచిన యైదేండ్లుగా విరివిగాఁ జెప్పుచుంటిని. నేను చెప్పిన మాటలు కాదన్నవా రెవరు లేరు. కాలేదన్నవారు లేరు. నేను చెప్పునపుడు నాయొడలు నాకు తెలియదు. నేనేమి చెప్పితినో నాచేతఁ జెప్పించు కొన్నవారు నీవిట్లు చెప్పితివని చెప్పినప్పుడే నాకుఁ దెలి యును గాని తక్కినపుడు దెలియదు. ఇట్టి నా సోదెను నీ చెలిమికత్తె నిష్కారణముగా నిందించినది. నాకు నిన్న నొక సంగతి తెలిసినది. నేనుచెప్పెడి సోదెయందు నాకెంతో యభిమానమన్నమాట; దాని నెవరైనఁ గాదన్నచో నాకుఁ గోపము వచ్చునన్నమాట; ఆ సోదెను పురస్కరించుకొని నా చిత్తమునందు నాకుఁ దెలియకుండ నొక యహంకార రేఖను నేను పొందుచుంటినన్నమాట; ఆ సంగతి నాకు తెలిసినది. నీ చెలిమికత్తెమీఁదఁ గోపమువచ్చినదికదా!

సోదెలోని మాటలు నే నన్నవి కావుకదా! అవి చండీదేవి మాటలు; కోపము వచ్చినచో నామెకు రావలయును. నాకెందుకు రావలయును. మనయందు నొక దేవతాశక్తి యుండి ఆ దేవత మనద్వారా తన పని తాను చేసికొను చుండఁగా మనము నిమిత్తమాత్రము కాఁగా మనయం దీ శక్తి యున్నదని యనుకొనుటకుఁగూడ పిలులేకపోఁగా, ఆ శక్తి వెలయింపఁబడుటకు మన శరీరము సాధనము మాత్ర ముగా నున్నదని మనకుఁ దెలియఁగా సాధనమునకుఁ గోప మెందులకు? కోప మెందుకనఁగా నీ సాధనము సహజముగా జడమైనచో నిబ్బంది లేదు. ఇది దీనియంతట నిది చేతనము; అందుచేత నీ యధ్యారోపము జరుగుచున్నది. ఇందుకు నాకుఁ గోపమువచ్చినది. అమృత:- నీవు చదువుకొన లేదందువు; నీ మాటలు పాండిత్య భూయిష్ఠములుగానున్నవి. కాలం:- ఉన్నవి; ఉన్నవి; నాకుఁ దెలియును. అవి యట్లగు చున్నవి; సోదెలో ననెడి మాటలు నాకు తెలియుటలేదు గాని మేల్కని యున్నప్పు డిట్లనెడి మాటలు నాకుఁ దెలియు చున్నవి. ఆ దేవతామూర్తికి, ఆ చండికి నాయందు వట్టి భక్తురాలియందు భగవతి కెట్టిదయ యుండునో అట్టి స్వచ్ఛ మైన దయమాత్రమే కలదు; వీనికి నాయందట్టి దయలేదు. వీఁడు నేను మేల్కని యుండఁగనే నన్నువచ్చి యావహించు చున్నాఁడు; నాచేత నిట్లు మాటాడించుచున్నాఁడు. నీవి ట్లడుగనిచో నేనే మాట్లాడుచున్నానని యనుకొనెడి దానను. నీవింత పండితురాల వెట్లైతివని నీవడుగుటవలన నాకీ యభిజ్ఞ కలిగినది. వాఁడే నేను; నేనే వాఁడుగా నున్నది; అమృత:-

ఎవఁడువాఁడు? కాలం:- ఓయమ్మా! వాఁడెవఁడని చెప్ప దును? వాఁడెవఁడో నే నెఱుఁగను; వానిపేరు నాకుఁ దెలియును. వాని నేనెప్పుడు చూడలేదు. వానిబాధ నాకు తొలఁగించుమని చండీదేవిని ప్రార్థించితిని. ఆమె బదులు చెప్పలేదు; ఆమెను నే నుపాసించలేదుకదా! సృష్టిలో నిది యొక చమత్కారము. ఆ శరీరమును ఆ దేవతను, ఆయొక్క పనికొఱకే వినియోగపఱచును. తక్కిన కార్యము లాశరీరము ద్వారా చేయదు. ఒకఁడు సంగీత విద్వాంసుఁడు. ఆ విద్యలో వాని వివేకము పరమగూఢముగా నుండును. అంతటివాని తెలివియు మఱియొక విద్యలో నెందుకును పనికిరాదు. ఒక మహాపండితుఁడు తాను నేర్చిన శాస్త్రమునందు వానిని మించినవాఁడు సృష్టిలో లేఁడనునంత ప్రతిభావంతుఁడై యుండును. వాని పాండిత్యము తర్కశాస్త్రమునం దను కొందము; శాస్త్రమును వదలి యివతలకు వచ్చినచో వానినిఁ బసిపిల్లవాఁడుకూడ ప్రతాపరించఁగలఁడు. చండి నన్నట్లు స్వీకరించినది; ఆ సమయమునందు నన్ను పూనును. ఏవో చెప్పును. ఇది నాకు వృత్తియైనది; ఇంకొకవిధమైన చండీప్రసాదము నాయందు లేదు. నాకు రాత్రియే యొక విషయము తోచినది. నా శరీరనిర్మాణ లక్షణమును నా జీవలక్షణమును నధికములైన దివ్యశక్తులువచ్చి యావహించి వారివారి పనులు నాద్వారా చేసికొనుటకు వీలైనవికాబోలు. అందుచేత చండి నన్ను స్వీకరించినది, అట్లే వాఁడును స్వీకరించినాఁడు. నేను చండిని తొలఁగఁద్రోయలేను. దానినే తొలఁగఁద్రోయలేనపుడు భగవతియైన చండి నెట్లు

తోలంగఁద్రోయఁగలుగుదును? నాకొక్కటియే యాశ్చర్యము. చండీదేవి స్థావరము చేసికొన్న యీఘటమును, యీకళేబరమును వాఁడెవ్వఁడోవచ్చి యెట్లాక్రమింపఁగలిగెను? చండి సర్వదా యిచ్చటనుండదుకదా! తాను రానపుడు చండికీ కళేబరముమీఁద నభిమానము లేదుకాఁబోలు. నాయందున్న జీవునిమీఁద దయలేదుకాఁబోలు. అమృత:- అతఁడెవఁడు? కాలం:- అదియే చెప్పుచున్నానమ్మా! వాఁడెవ్వఁడో నేనెఱుఁగను. నీవు జయద్రథుఁడుతాత మిమ్మిచటకుఁ బంపించెనని చెప్పితివి. ఆ తాతను నేనెఱుఁగను. నేనెఱిఁగిన దిది. నన్నెవఁడోవచ్చి యావహించుచున్నాఁడే వానిపేరుకూడ జయద్రథుఁడే, నీవు చెప్పిన జయద్రథుఁడు తాత యనుచున్నావు గనుక ముసలివాఁడనుకొనుచున్నాను. ఈ జయద్రథుఁడు ముసలివాఁడుకాఁడు. పడుచువాఁడు. ఏమో, పడుచువాఁడని చెప్పుటకు వీలులేదు. అతఁడు రాత్రి నామీఁదికి వచ్చెను. 'నీకు శ్రీమాలిమీఁదఁ గోపమువచ్చినదికదా, ఆ కోపమును నేను సాధించిపెట్టెదను. నన్ను స్వీకరింపుము. నన్ను నిరాకరింపకుము. నేను చెప్పినట్లు చేయుము. నేను నిన్ను మహాయోగినిగాఁ జేయుదును. నీమాటకు మహారాజులమాటకంటె నెక్కువ మర్యాదకలదానినిగాఁ జేయుదును. నీవు నోటితో నొకమాట యనవలయునుగాని యది మైతీరునట్లు జేసెదను. నన్ను స్వీకరింపుము' అన్నాఁడు. నేనుఁ ఓయీ! నీవు నాదెసకు రాకుము. నాభర్త యున్నాఁడు. నిన్నుఁగూర్చి నాభర్తతోఁజెప్పెదను. నాభర్త గొప్ప చదువుకొన్నవాఁడు, అంటిని. అతఁడు డిప్ప

నేను. 'ఓసీ! నీభర్త బిచ్చగాఁడు. వాఁడు పండితుఁడా? వానికి కాలజ్ఞానపు పాటలు వచ్చును. అందులోని సమన్వయము వానికేమి తెలియును? ఆ సమన్వయము నాకు తెలియును. రాజ్యములు తలక్రిందులు చేయఁగలవాఁడను నేను. ఇదివఱకెన్ని రాజ్యములో నాశనముచేసితిని. ఎన్ని రాజవంశములనో నిర్మూలనము చేసితిని. ఓసీ! ఈమాటలు నీవు వినియుండవు. ఈ మగధరాజ్యము బార్హద్రథులది. వారిలో మేటి జరాసంధుఁడు. జరాసంధునకుఁ బూర్వము వేయి యేండ్లు గిరివ్రజము రాజధానిగా మగధము బార్హద్రథులు పాలించిరి. ఆ జరాసంధుని తరువాత వేయియేండ్లు బార్హద్రథులు పాలించిరి.. ఈరీతిగా రెండువేలయేండ్లు బార్హద్రథులు పాలించిన ఈ మగధరాజ్యమును నేను సులభముగా వారి వంశమునుండి తొలఁగించితిని; ప్రద్యోతవంశమునకీ రాజ్యమును కట్టఁబెట్టితిని; ప్రద్యోతుని తండ్రి మునీకుఁడు; మునీకుఁడు బార్హద్రథులలో చివరివాఁడైన రిపుంజయుని సేనాని. ఈ రాజ్యము ప్రద్యోతవంశమునందు నేను నిలువనీయలేదు. వారు నూటముప్పది యెనిమిది సంవత్సరములు పాలించిరి. వారైదుగురు రాజులు; చివరివాఁడు నందివర్ధనుఁడు; కాశీరాజైన శిశునాగునిచేత నందివర్ధనుని కూతును మోసగించి శిశునాగవంశముఁ దెచ్చితిని; ఆ శిశునాగవంశము నా కిష్టమైనవంశము; వారిచేత మూఁడువందల యిరువదియేండ్లు రాజ్యము చేయించితిని; వారినందఱను బౌద్ధులనుఁ జేసితిని? వారు నాస్తికులు; అప్పటికిని నాకు కసి తీరలేదు. అప్పుడు శూద్రులను తెచ్చితిని; నందులచేత

వందయేండ్లు పాలింపించితిని. మహాపద్మునిచేత మూఁడువందల పదునాఱేండ్లు పాలింపించితిని; సర్వక్షత్రియ వంశములను నిర్మూలింపఁజేసితిని; నేఁడొకఁడు పుష్యమిత్రుఁడు నన్ను మించినవాఁడు బయలుదేరినాఁడు; వాఁడు నన్ను కాదని శూద్ర రాజ్యమును తొలఁగించి బ్రాహ్మణ రాజ్యమును స్థాపించినాఁడు; వానికి మంచిరోజులు. బ్రాహ్మణులకు మంచిరోజులు. వారు కొన్నాళ్లు భారతదేశమునందు నా శక్తిని కాదనఁగలరు. ఇది సంధికాలము; ఆ పుష్యమిత్రునిమీఁద నాకు కోపముగా నున్నది. వీరిది శుంగవంశము; ఈ శుంగవంశమును తొలఁగించవలయును. తొలఁగించినచో నాకు లాభము లేదు; కాని వానిని తొలఁగించుటయే నా కక్షమతము. ఈ కాలము నా కనుకూలముగా నున్నది; నాకు నీవు సాయపడుము. నీవు నీ భర్తను వదలివేయుము. వాఁడు చెప్పెడి కాలజ్ఞానము నేను చెప్పుచున్నదే కదా! వాఁడు నాకన్న పండితుఁడందువా? ఆ యల్పునితో నీకెందుకు? నీవు నాకు భార్యవుకమ్ము; నీవు నన్నేమైనఁ జేయఁగలిగినచో ఇదివఱకే చేసియుందువు." అమృత:- కాలంజరీ! ఈ జయద్రథుఁడు నిన్నావహించుట కిదే మొదటిసారి కాదుకదా!

కాలం:- కాదమ్మ కాదు నాకైదేండ్లక్రింద నే నిచట సోదెలు చెప్పుటకు మొదలుపెట్టినప్పుడు నావద్దకు వచ్చెను. నా కిట్లే కలలోఁ గనిపించెను. అది కల యనుటకు వీలులేదు. జాగ్రదవస్థ యనుటకు వీలులేదు. ఇట్టి మాటలే నాతోఁ జెప్పెను. నేను నిరాకరించితిని; నా భర్తతోఁ జెప్పితిని; అతఁడు ఇదేదో పిచ్చికల పొమ్మనెను. ఆసనాఁటి సంవత్సర

మునకు నొకసారియైనను వీఁడు నా స్వప్నములోనికి వచ్చును. నన్నిట్లు బాధించును; నాలో నొక గాఢమైన కోరికయో కోపమో యేదియో వచ్చినపుడు వీఁడు తప్పకుండ వచ్చును. రాత్రి నాకు మీ శ్రీమాలిమీఁద నంత కోపము వచ్చిన దన్న మాట. ఓయమ్మా! యమృతవల్లీ—అని కాలంజరి యేడువ నారంభించెను. శ్రీమాలియైనచో నామెను మాటలతో నోదార్చెడిది. అమృతవల్లి యామెవద్దకుఁబోయి కూర్చుండి యామెమీఁదఁ జేయివేసి యామె నోదార్పసాగెను. కాలంజరి యోదార్పును పొంది మఱల నిట్లనెను. "నాకింత యేడు పెందుకు వచ్చినదనఁగా నా హృదయముమీఁద నీ జయద్రథుఁడు మున్నెన్నడు లేని కొంత యధికారమును రాత్రి సంపాదించెనమ్మా; సంపాదించెను." అమృత:- ఏమీ! అతనికే వాగ్దానము చేసితివా? కాలం:- చేసితినమ్మా! చేసితిని; అమృత:- ఏమని చేసితివి? కాలం:- ఏమని చెప్పుదును? వానికి భార్యనగుదు నంటిని; నా భర్తను వదలి పెట్టుదు నంటిని; శ్రీమాలిమీఁద నాకు జనియించినకోపము తీర్చుటయే నా పరమోద్దేశమంటిని; ఆ శ్రీమాలికి నంత దురధికార జనితాహంకార మెందుకంటిని; ఆ జయద్రథుఁడు సంతోషించెను; నీ భర్తను పది దినములవఱకు నేనిచ్చుటికి రానీయను. ఈ పది దినములు నేనే వచ్చుచుందును. ఓసి కాలంజరీ! వాఁడు వచ్చి నిన్ను చూచును; వాఁడు వచ్చి చూచెడి కాలంజరి యెట్టిదందువు? మూర్ఛాగ్రస్తురాలు; ఉన్మత్తురాలు; నడుమ నడుమ లేచి విపరీతముగా మాటాడును; అప్పుడు కాలంజరియన్న స్త్రీ యుండదు. ఆమె

సోదెలు చెప్పలేదు. చెప్పును; ఆ చెప్పెడి సోదెలు చండీదేవి పలికించదు; జయద్రథుఁడు పలికించును; ఒక్క జయద్రథుడే యుండును. కాలంజరి యుండదు; దేహము కాలంజరిది. లోనున్నవాఁడు జయద్రథుడు; జయద్రథుఁడు వదలిపోయినచో కాలంజరికి మాటయు పలుకు నుండవు. ఆమె యేడ్చుచుండును. నీ భర్తవచ్చి యిట్టి కాలంజరిని చూచును.–అని కాలంజరి మఱల నేడువ నారంభించెను. అమృతవల్లి యిట్లడిగెను. నీకుఁ గనిపించిన జయద్రథుఁ డెట్లుండును? కాలం:– అతఁడు చామనచాయవాఁడు; ఎత్తైన ఱొమ్ముకలవాఁడు; ధనుర్విద్యయు, ఖడ్గవిద్యయు నేర్చినవానివలె మెలి తిరిగిన దండలు. భుజములయందు హస్తములయందు కిణములు గలవాఁడు; అతని కన్నులుఁ జూచినచో నడిరేయి నట్టడవిలో చంపిన మృగమాంసమును తినుచున్న పులి కన్నులలో చూచినట్లుండును. యువకుఁడు — అమృతవల్లి:— కాని యితఁడు వృద్ధుఁడు.

## ౨

అమృతవల్లి కాలంజరి చెప్పిన పది దినములలోపల మజిల నేఁగి యామెను దర్శించి పరిస్థితు లెట్లున్నవో కనుఁగొన వలయునని చాల ప్రయత్నించినది. వాసుదేవ నామ శ్రవణముచేత కాలంజరి యూనాఁడేల అంతటి మార్పు పొందినదో తెలిసికొనవలయునన్న యాశ యన్నే యున్నది. మజిల వెడలవలయునని కాలంజరి భర్తవలన కాలజ్ఞానపు పాటలలోని యా రహస్య మేమో తెలిసికొనవలయునని యెంచుచుండఁగా జయద్రథభూత మొకటి కాలంజరి నావహించె నన్న యీ విపరీతపువార్త యామె మనస్సును మఱియును వ్యగ్రపఱుపఁగా నామె కాలంజరిని చూచుటకొఱకెంత తహ తహ పడుచున్నదో విలంబన హేతువు లంతదట్టముగా ముసురుకొనెను. ఆనాఁటి రాత్రినుండియే శ్రీమాలికి కొన్నాళ్ళుగా నలుగుచున్న సంబంధములలో నొకటియైన సంబంధము తీవ్రమైన ప్రయత్నములు రాకపోకలు రాయబారములు మొదలుపెట్టెను. అమృతవల్లి తన ప్రక్క లేకుండ శ్రీమాలి నిమేష మోర్చుకొనలేకపోయెను. తల్లి తండ్రులతో చెప్పి తాను పోయి నిచ్చట సేనాధిపతి యింటిలోననే యామె యుండ నారంభించెను. తమ యింటిలోననే యామె యుండుటవలన నామెయందు తన చెల్లెలైన శ్రీమాలికిఁగల చెలిమి పరమ సుకుమారమై పరమహార్దమై యుండుట; సువిస్పష్ట మగుటవలన, నామె లేనిచో వచ్చి

పోయెను పెండ్లివారి మర్యాదలు పాటించుట మిక్కిలి కష్టమై యుండెడి దగుటవలనను, ఆమెయొక్క పరామర్శ సదా పర్యాలోచన మొదలైన జాగ్రత్తలయందుగూడ తీవ్రవృత్తి తన తల్లితండ్రులకేకాక తనకును లక్ష్యభూతమై కనిపించుట వలనను, దన తల్లి యామెయందు శ్రీసూరియందువలెనే ప్రవర్తించుటచేతను, దన తండ్రి యమృతవల్లిని మిక్కిలి గౌరవముతోఁ జూచుచుండుటచేత, భూమిమిత్రునకు నమృత వల్లియందు మున్నుఁ గలిగిన వైముఖ్యము క్రమక్రమముగా తగ్గిపోవుచుండెను. అదియటు కామెవంకఁగాదు సరిగదా ఆమె యున్న దెసకే మొగము మలచనివాఁడు నేఁడు వలసిన సామగ్రి సమకూర్చు జతనములో నామెతో సంభాషించు టయు జరుగుచుండెను. పెండ్లి రాయబారములు, పెండ్లి చూపులు మొదలైన వ్యవహారములయందు సామాన్యకుటుం బములయందే చెప్పరానంత సందడి యుండును, ధనవంతు లైనచో దాని కిబ్బడి ముబ్బడిగా నుండును. వీరిది మఱియు దేశమునందలి పెద్దకుటుంబములలో నొకటి. వాసుదేవుని యధికారము కుటుంబ మర్యాదయు రాజవంశపు మర్యాద లేయెత్తున జరుగునో ఆ యెత్తున జరుగుచుండును. అమృత వల్లికి తీరికయే లేదు. పెండ్లికుమారునివైపు వారు పిల్లను చూచి పోవుటకు ప్రొద్దున్న వత్తురు. మధ్యాహ్నము వత్తురు. సాయంకాలము వత్తురు. వారి కెవరో దూరదూరపు బంధు వులు, పెండ్లికుమారునికి వేలువిడిచిన మేనత్త. ఆమె చిన్న ప్పుడు పెండ్లికుమారుని యింటిలోననే పెరిగెను. పెండ్లి కూతును చూచుట కామె వచ్చును. ఇట్టివారెందఱో వత్తురు.

ఎల్లప్పుడు శ్రీమాలి ముస్తాబై కలకలలాడుచుఁ గనిపించవల యును. వారు పలుకరింతురు. 'ముద్దుగా నామె నటు నిటు నడువు మందురు. గానము చేయు మందురు. వారి పరీక్షలు వేయివిధములుగా నుండును. వారు బ్రాహ్మణు లైనను రాచపోకిళ్ళు ముదిరినవారగుటచేత నంతఃపురము నందలి యీ క్రొత్తపెండ్లివారిస్త్రీలు వచ్చి చూచుటలోని సందడి కవధిలేకపోయెను. ఇంతపని యమృతవల్లి నెత్తినఁ బడుటచే నామెకుఁ గాలంజరినిఁగూర్చి యాలోచించుటకే యెడములేకపోయెను. ఇట్లే పదిదినములు గడచినవి. లగ్నము నిశ్చయమైనది. లగ్నము దూరములేదు. నాఁటినుండి పెండ్లిపనుల కవధిలేదు. వాసుదేవునిభార్య కొంత యమా యకురాలు. ఆమె ఇంతటిబరువు నిభాయించుకొనలేదు. దాసీజన మున్నారు. బోలెడుమంది సేవకు లున్నారు. ఉద్యో గస్థు లున్నారు. ఏదికావలసినను నిముసములో వచ్చును. కాని ఏదికావలయునో చెప్పెడివారు కావలయును. వాసు దేవుఁడును భూమిమిత్రుఁడును తమ యుద్యోగధర్మములమీఁద నడుమ నడుమఁ బోవుచునే యుందురు. ఎంతపెద్ద సంసార మైనను, ఎంత ఎత్తుబాటి వ్యవహారమైనను, ఇంటికైన యాడ దిక్కుండవలయును. ఆ యాడదిక్కు వాసుదేవునియింటిలో లేదు. అది లేకుండ నొక యాడుపిల్ల పెండ్లి జరుగుట మిక్కిలికష్టము. అమృతవల్లి యాలోపమును వాసుదేవుని యింటిలోఁ దీర్చెను. ఆసందడిలో భూమిమిత్రుఁడు కొన్ని వేళలయందు నమృతవల్లినిఁజూచి యామె లేకపోయినచో నిప్పుడెంత యిబ్బంది పడెడువారమనియు నామె తనకు తల్లి

స్థానమనఁ బ్రవర్తించుచుండెననియు ననుకొనక తప్పలేదు. వాసుదేవుఁ డమృతవల్లియందు నెఱపుచున్న భావమెట్టిదో వాసుదేవునకే తెలియదు. ఇతరులబిడ్డ వచ్చి తనయింట నింత బరువు బుజాల మీఁదవేసికొని మోయుచున్న దన్న కృతజ్ఞతాభావము, వాసుదేవుని యందుఁ గని పించలేదు. తన కుమార్తెకు సహాధ్యాయినియైన యొక బాలిక గొప్పయింటిబిడ్డ వచ్చి తన కూతునందలి మైత్రి చేతఁ దన యింటిలోఁ దన కూతురెట్టి స్వాతంత్ర్యము గృహమునఁ నవలంబించునో తాదృక్స్వాతంత్ర్య మవలం బించుటచేత తన బిడ్డకు నామెకు భేదము లేదన్న భావము కలిగి యామెయందు బిడ్డ తనము చూపించవలయునన్న భావమును లేదు, ఆమె యథార్థమునకు శ్రీమాలి తల్లియెట్టి పరిస్థితిలో నుండవలయునో అట్టి పరిస్థితిలో నున్నట్లు ప్రవ ర్తించు చుండెను. అందుచేత వాసుదేవున కొక విలక్షణమైన భావ మామెయందు కలుగవచ్చును. అట్లును కలుగలేదు. ఆమె తన బిడ్డవంటిదే. తన బిడ్డతో సమానమైన వయస్సు కలది. ఆమెనుఁగూడ తన కూతును చూచినట్లు చూడ వలయును. అట్లు వాసుదేవుఁ డెన్నడును చూడలేదు. అమృతవల్లి, గేహములో నది కావలయు నిది కావలయును వారు వత్తురు వీరు వత్తురు, దానిని తెప్పించవలయును మొదలైన కార్య వ్యగ్రతా లక్షణములను ప్రదర్శించు చుండఁగా వాసుదేవుఁడు తత్సర్వకార్యము నమృతవల్లి దే యన్నట్లు నది యంతయు నామెయొక్క ధర్మ మన్నట్లు నామె బాధ్యత యన్నట్లు నామెకాక మఱి యెవ్వ

రీవ్యవహారములు చూచెదువా రన్నట్లు ప్రవర్తించును. ఇది కావలయునని యమృతవల్లి వాసుదేవునితోఁ జెప్పినచోఁ దదధికారితో చెప్పుము. నాతో చెప్పుట యెందుల కనును. లగ్నము సమీపించెను. పని యొత్తిడి యెక్కువయ్యెను. అమృతవల్లి సతమత మయిపోవుచుండెను. ఆనాఁడే లగ్నము. పెండ్లివారు వచ్చిరి. ఎవ్వరికిని నమృతవల్లి యెవరో తెలియదు. పెండ్లివారు పెండ్లికూతురును నమృతవల్లియు నక్కసెల్లెండ్రనియు, నమృతవల్లి పెద్దది యనియు నామె వివాహ మిదివఱకే యైయుండుననియు చెల్లెలి పెండ్లిభారమంతయు నామె వహించుచున్నదనియు ననుకొనిరి. వారి యిద్దఱిరూప సాదృశ్యము దానికెంతయో దోహదము చేసినది. పెండ్లివారిలో కొంద ఱమృతవల్లి యొక్క గమనలక్షము వ్యాపారనైపుణి, తీవ్రమైన శబ్ద ప్రయోగము, దృష్టిప్రసారమునందలి యధికారము కాఠిన్యమునుఁ జూచి యామె పురుషుఁడై పుట్టవలయును. భూమిమిత్రుఁ డదృష్టవంతుఁడు. లేనిచో నాస్తిఁ బంచుకొనెడి వాఁడేనని చమత్కారముగా భావించిరి. వివాహము జరిగి పోయెను. వివాహాంతమునఁ బెండ్లివారందఱకు నమృతవల్లి వీరికి బంధువే కాదనియు శ్రీమాలికి సహాధ్యాయిని యనియుఁ దెలిసెను. వారిలో కొందఱు భూమిమిత్రుని కామెయందుఁ బ్రేమగలుగుటచేత నామె యీ గృహమునం దీస్థితిలో నుండెననుకొనిరి. కాని యమృతవల్లియు భూమిమిత్రుఁడుఁ గలసి మాటాడు వేళఁ జూచినవా రెవ్వరు నట్టి భావమును బొందలేదు. పెండ్లికుమార్తె భర్తపేరు శ్రీవత్స

లాంఛనుఁడు. సులభముగా శ్రీవత్సుఁడందురు. లేనిచోఁ లాంఛనుఁ డందురు. లాంఛనుఁడన్న మాటయే విరివిగా నున్నది. అతఁడు సర్వపురాణజ్ఞుఁడు; రాజనీతివేత్త. లౌకికమైన చదువు చదివినవాఁడు. ఆ కాలములోఁ బండితు లందఱు వ్రాయసగాండ్రుకారు. అందఱుఁ జదువఁగలరు. చదువఁగలవా రందఱు వ్రాయలేరు. వ్రాయసగాండ్రైనవారు కొలదిమంది. వ్రాయసగానివృత్తి నీచమైనదిగాఁ బరిగణింపఁ బడుచుండెడిది. ఎవఁడో పొట్టకూటికి లెక్కలు వ్రాసికొనును. కొలువులలో నల్పాల్పములైన యుద్యోగములు చేయుచుండును. అధికారులవద్ద లేఖలు చదువుటకు, లేఖలు వ్రాయుటకు వాఁడు పనికివచ్చును. అందుచేత వ్రాత గొప్పవారికిఁ దెలియదు. శ్రీవత్సుఁడు మహాధనవంతుల యింటి బిడ్డయయ్యును, పెద్ద చదువుకొన్నవాఁడయ్యును, వ్యవహారవేత్త యయ్యును, వ్రాయుటకూడ నెఱిఁగినవాఁడు. అతని వివేకము సునిశితమైనది. అతని కన్నులలోఁ దెలివి నృత్యము చేయుచుండును. అతఁడు మిక్కిలి యందగాఁడు. వాక్ప్రమత్కృతి కలవాఁడు. చక్కని పలువరుస కలవాఁడు. అతని కనుబొమలు పలుచనియతని చెక్కిళ్ళమీఁద కొసలు తేరి సొంపుగా వంపు తిరిగిన మీసపు మొలకలు వాని కనుఱెప్పల యందున్న సన్నని కండచేత వచ్చిన యొక విశమైన యరవాలిన చూపులు వెలయించు లక్షణము, సహజముగా సౌందర్యము పెండ్లికొడుకుగాఁ బీటలమీఁద కూర్చున్నపుడు నిష్కళంకమైన యతనిఁ బొమ్మయొక్క వెడఁదతనమును ప్రకాశింపఁ జేయుచున్న యజ్ఞోపవీతము వానిచేతి కంకణ

ములు వాని భూషణములు వాఁడు నవ్వఁగా వాని చెక్కిలి మీఁద నవి స్పష్టముగా భాసించిన నొక సుకుమారమైన మందహాస రేఖా సమున్మీలిత మధురావర్తము వాని చిబుకము నందు కనిపించియు కనిపించని యొక చిన్న గుంటవంటి లక్షణము, ఫాలభాగమునందు నచ్చెమవు భాసించినవేళ తీర్చినట్లు కనిపించెడు మూఁడు గీతలు, వానియొక్క సౌందర్యము చెప్పరానంతగా నుండెను. పెండ్లి మూఁడు దినములు జరిగెను. తానును శ్రీమాలియు నీమూఁడుదినములలో నేకాంతముగా నున్న నిముసములే తక్కువ; ఆసమయములో నమృతవల్లి శ్రీమాలితో నామె భర్తయొక్క సౌందర్యము. వర్ణించిన మాటలు పదికన్న నెక్కువ యుండవు. ఆపదిమాటలు వేయి మాటలు చెప్పినంత, చేసినంత వర్ణనయొక్క ఫలమునిచ్చెను. శ్రీమాలి ప్రతిమాటకుఁ బులకితశరీర యయ్యెను. అది యేదో యొకానొక రసాధిదేవతకు శ్రీమాలి మనస్సులో నమృతవల్లి యుపాసనామార్గమువలె భాసించెను. మున్ను తనకు నమృతవల్లి వట్టిచెలికత్తె. వట్టి సహాధ్యాయిని. కడచిన పది పదునేను దినములనుండి ఈమె తన కప్పగారు, తనకు తల్లి. లేదా పినతల్లి. ఈ యమృతవల్లికిఁ దనకు నేమిసంబంధము? ఈమె యెవ్వరు? తన్నిట్లాదుకొనునేమి? పూర్వము చెలిమిలో వట్టి సహాధ్యాయిని. మాఱలసందర్భమునఁ దూలనాడినది. తక్కువపఱచినది. తిరస్కరించినది. లెక్కలేకుండ మాటాడినది. ఇద్దఱు చెలిమికత్తియలనడుమ నున్న సౌహార్దము మాత్రమే యామెయందు వెలయించినది. ఇప్పు డమృతవల్లినిఁ దొల్లిఁటివలె తనతో సమానురాలిగాఁ

జూచుటకైనను వీలులేదు. ఆమెకుఁ దనపైన నధికారము కలదు. తన్నామె శాసించఁగల స్థితిలోనికి వెళ్ళినది. ఈపక్షము దినములలో నీరీతిగా నొకవిధమైన మాతృస్థానమును గడించిన యీ యమృతవల్లి పెండ్లి మూఁడుదినములలోఁ దల్లితనము తల్లితనము గానట్లుండగా మఱల జెలిమికత్తె యైనది. చెలిమికత్తె కాదు. దూతియైనది. దూతి కాదు. ఆమె యేమైనదో తెలియదు. ఆ శ్రీవత్సునకు మొదటి దినమున్నరలోననే యమృతవల్లియొక్క స్థితియెట్టిదో తెలిసినది. ఆమె తన శృంగారసామ్రాజ్య సౌధమునకు కట్టిన సోపాన పరంపర. ఆమె యనుగ్రహమునకు తానుపాత్రుఁడు. అమృతవల్లి తన్నుఁజూచి నవ్వినచో నతని యెడలిలో నొక సుఖతరంగము లేచుచుండెను. ఆ సుఖతరంగమునం దొక గౌరవభావము మిశ్రితమై యుండెను. నాల్గవదినమున భార్యాభర్తలు కలిసికొనిరి. శ్రీమాలియు శ్రీవత్సుఁడును బహుపూర్వజన్మ సంగత విశిష్టసంయోగభావ సమాసన్న జీవలక్షణములు కలవారివలెఁ బ్రవర్తించిరి. శ్రీవత్సునకు శ్రీమాలినిఁ గూర్చి యెట్లున్నదనఁగా తానామెకొఱకు కొన్ని జన్మలు తపస్సుచేసి ఫలింపించికొన్న మనోజ్ఞమైన ఫలస్వరూపముగా నున్నది. శ్రీమాలికి శ్రీవత్సుఁ డెట్లుండెననఁగాఁ దా నీ యనంతకాలమునఁ బ్రయాణము చేయుచున్నది. తన వెంటనే యొక రేఖగా నింకొకభావము వచ్చుచున్నది. ఆ భావము తన జీవరేఖా ప్రయాణలక్షణముమీఁద నధికారము చేయుచున్నది. ఈ ప్రయాణముయొక్క సుఖము తద్రేఖాభూతభావముచేత సంపాదిత మగుచున్నది. ఆ రేఖ

యీ నడుమఁ దనకుఁ గనిపించలేదు. తన బాల్యము నం దారేఖ తన దృష్టికి గోచరించలేదు. ఇప్పుడు కనిపించినది. కనిపించినంతనే జ్ఞాపకమునకు వచ్చినది. ఓహో! యీ రేఖ నా యనంత ప్రయాణములయందు నన్ననుసరించియే వచ్చుచున్నది. ఆ రేఖయే యిది. ఈ నడుమ నా దృష్టి కంతర్హితమైనది. మఱలఁ గనిపించినది. శ్రీవత్సుఁ డమృతవల్లి కిట్లుండెను. నాల్గవనాఁటిరాత్రి వారిద్దఱు నేకాంతముననుండఁగా పరిచితిప్రథమదశయందున్నను చమత్కారముగా వికాసాభిముఖమైన యుబోవేశా సరోజాతాగ్ర పత్రాంచల మధుర చాలనములోని మనస్సులతో వారిద్దఱు మాటాడుకొనుచుండఁగా శ్రీమాలి యూరకయే యేడ్వ నారంభించెను. దాని కేమియుఁ గారణములేదు. శ్రీవత్సుఁ డామె నోదార్చుటకు సర్వప్రయత్నములఁ జేసెను. ఫలితము లేకపోయెను. ఈ యువతికిఁ దనయం దనంతమైన ప్రేమకలదు. మహాభక్తికలదు. తాను భర్తయగుట నామె తొలినాఁడు చేసికొనిన పున్నెములు పుష్కలముగా పండినట్లు భావించుచున్న దీజవరాలు. ఆమె పరమరమణీయమైన దేహమనిన పొలమునందు తనయొక్క మనోశ్వము చిత్రచిత్ర వల్గనముల నటించుటకు నేయంశమునందును నడ్డంకి లేదు. ఆమె మనస్సు తనకు నధీనమైయున్నది. ఈదుఃఖ మెందుకు? హేతువు తాను చెప్పలేకుండనున్నది. ఎందుకో యాదుఃఖ మిబికి యిబికి వచ్చుచున్నది. అతని కేమియుఁ దోఁచలేదు. ఆ మహాసౌధమునందు వారిద్దఱికి నేర్పాటు చేయఁబడిన యాగది చుట్టుపట్ల నెవ్వరును వచ్చుటకు వీలు

లేని విశాలమైన సౌధోపరిభాగము. ఎవరినైన పిలిచి చెప్పుటకు వీలులేదు. సేవకులు లేరు. అతఁడు మేడమెట్లు దిగి తన కొక్కటేగది యన్నట్లు యమృతవల్లిని వెదుక నారంభించెను. అమృతవల్లి తన కెచ్చటదొరకును? ఆయింటిలో నేమూల నెవరుందురో తనకేమి తెలియును? వెంట్రుకోడుకుగా నెచ్చటికిఁ దీసికొనిపోయినచో నచ్చటికిఁ బోయెను. ఆస్థితిలో నేమిచేయవలయునో తెలియక మేడమెట్లనద్ద నేమియునూహ లేనివాఁడైఁ తిరుగుచుండఁగా మెట్లమీఁద నొకవ్యక్తి తారాడుచున్నట్లు భాసించెను. తన తిరుగుట నావ్యక్తి తెలిసికొని పైకివచ్చెను. ఆమె యమృతవల్లి. ఆమె కనిపించినంతనే శ్రీవత్సునకుఁ బ్రాణములు లేచివచ్చెను. ఈమూఁడు దినములు నతఁడు అమృతవల్లితో నొక్కమాటైన మాటాడలేదు. ఆయా పరిస్థితులయందు సన్నసన్న పనులు పెండ్లికుమారుఁడుగాఁదాను చేయుటలోనొకవిధముగాఁ గూర్చుండ వలయుననియో, శ్రీమాలిచేతిలో సేర్పుపోయ వలయుననియో, యామె కొనవ్రేలు తాను గ్రహించి నడువవలయుననియో, యిట్టి పనులయందు నమృతవల్లి రెండు మూఁడుసార్లు మెత్తగా నాజ్ఞాపించినది. అంతకుమించి యామె తనతో మాటాడలేదు. తా నామెతో మాటాడ లేదు. ఇప్పుడామె కనిపించినంతనే నతఁడు తానామెతో పూర్వ మెంతయో పరిచితముగాఁ బ్రవర్తించిన వానివలె నిట్లనెను. "అక్కా! ఇది యేమమ్మా! ఆమె యొకటే విధముగా నేడ్చుచున్నది. రెండు గడియలనుంచి యొక్కటే యేడుపు కారణము తెలియదు. బతిమాలఁగా బతిమాలఁగా

చివరకొక సమాధానము చెప్పినది. ఆయేడ్పు తన కెందుకు వచ్చుచున్నదో తనకే తెలియదట. నన్నేమి చేయుమందువు? ఇదియేమి? కాచి శర్కరవేసి యేలకులపొడి కలిపి సన్నగాఁ బచ్చకప్పురము తావి మాత్రముకలుగునంత మేళవించి కుంకుమపువ్వు గుబాళించునట్లు మిశ్రణముచేసి వేడి చల్లారకుండ త్రాగుటకు యోగ్యమైనంతపాళములోనుండఁగా నిండినగిన్నె పెదవులవద్దకు వచ్చినది. ఊరకే త్రాగఁబోవు వేళకు కళవెళలాడుచున్నది. నాకర్థమగుటలేదు. ఈపాలు కాచినదానవు నీవు. నీవు కాచకపోయినను క్షీరము కాగెడి వేళనుండినదానవు నీవు. నీవు నాకు సాయపడనిచో నీదయ నాయందు ప్రసరించనిచో నే నాపాలు త్రావెడి యోగ్యతనుఁ బోఁగొట్టుకొందును." అని యతఁడామెచేతులను పూని జ్యేష్ఠ సోదరియందు వినమ్రుఁడైన వానివలె నయ్యెను. అమృతవల్లి తాను శ్రీవత్సునివదలిపెట్టి శ్రీమాలియున్న గదిలోనికిఁ బోయెను. శ్రీమాలి యేడ్చుచుండెను. మంచముమీఁద పండుకొని మొగము దిండుమీఁదనుంచి యామె దుఃఖించుచుండెను. అమృతవల్లి యామె బుజములపై చేయివైచెను. ఆమెకు వెంటనే తెలిసెను. తన్ను స్పృశించినది. శ్రీవత్సుఁడు కాదని. మఱి యెవ్వరు? అమృతవల్లి యని వెంటనే తెలిసెను. ఆమెలేచి కూర్చుండెను. కనులు తుడిచికొనెను. అమృతవల్లి యిట్లనెను. "ఇది యేమే శ్రీమాలీ!" అనఁగా శ్రీమాలి "ఎందుకోనే అమృతవల్లీ!" అనెను. – ఇద్దఱు నొకరికన్నులలో నొకరు చూచికొనిరి. శ్రీమాలి సిగ్గుపడెను. అమృతవల్లియొక్క యూహ యగాధ మయ్యెను. ఇంత

నిష్కారణమైన దుఃఖమునకుఁ గారణమెంతలోతున దూరాన నున్నదో యమృతవల్లిలోనికిఁ ద్రవ్వికొని చూడనారంభించెను. ఆమెకు లీలగా భాసింప నారంభించెను. అమృతవల్లి యిట్లనెను. "శ్రీమాలీ! నే నెవరను? నాపే రమృతవల్లి. నేను నీకొఱకుఁ బెండ్లియాడను. నీ కోసము జీవితాంతము కన్యగానుండుటకు నిశ్చయించితిని. నేను నీకు చెలిమికత్తెనుకాను. నీకు తల్లివంటిదానను. నిన్నురక్షించుటకు పుట్టితిని. నిన్ను రక్షించలేనిచో నేనుకూడ భూతమయ్యెదను. కాని నీకాపద జరిగినచో నాయాపద యన్యహేతుకమైనచో తద్ధేతు నిర్మూలనముచేసి పగతీర్చికాని హోమద్రవ్యమను కాను. నేనుండఁగా నీవేడ్వవలసిన యవసరములేదు. నాజీవితము చాల విచిత్రమైనది. నాకుఁ దెలియును. విస్పష్టమైన యేజీవితపథమునందును నాజీవుఁడు ప్రయాణించునట్లు లేఁడు. అంచలములు నంచలములు తగులుచు దేనికినిఁ బొందకుండ నొక లక్ష్యముకొఱకు నేను బ్రయాణించుచున్నట్లున్నది. ఆ లక్ష్యము నీక్షేమము. నే నిచ్చట నెంతసేపో యుండరాదు. పరిచారకులకుఁ దెలిసినచో దాసీజనమునకుఁ దెలిసినచో వారి దుర్వ్యాఖ్యానములు సహింపలేక పోవచ్చును. నేను పోవుచున్నాను. దుఃఖము మానివేసితివికదా! ఇంక నాయుబుకురాదుకదా! నీవు నాతో బయటకురమ్ము. నీభర్త బయట నిలుచున్నాఁడు"–ఇద్దఱును కలిసి వెలికి వచ్చిరి. అమృతవల్లి మాటాడకుండ మేడమెట్లు దిగిపోయినది. దీపపువెలుఁగున శ్రీవత్సుఁడు భార్యవంకఁ జూచెను. ఆమె మొగమునందు ప్రసన్నతతోపాటు మంద

హాసము భాసించుచుండెను. అతఁడామెనుఁ గౌఁగిలించి కొనెను. ఈ యమృతవల్లి యెవరు ? ఈమె ఇంద్రజాల మహేంద్రజాల విద్యలు తెలిసినదా ? చేతితోఁ దీసివేసినట్లు తీసివేసినది. శ్రీవత్సునకు తనకోసము నింపఁబడిన యాక్షీర కలశము ననుభవించవలయు ననిపించెను. అనుభవించెను. అనుభవించుచుండెను. కాని మనసులో వెనుక నొకసందేహము లీలగా నున్నదా లేదా యన్నట్లుగా కదలుచున్నది. వీరి యిద్దఱినడుమనున్న రహస్యమేమి? ఈమె జీవముమీఁద నమృతవల్లి కంతయధికార మెట్లున్నది ? తన సంసారసుఖ మంతయు సమృతవల్లి తనచేతులలో పెట్టికొని కూర్చున్న ట్లున్నది. తన భవిష్యత్సుఖమేమి కావలయును. ఈమె యెవ్వరు? వీరి పరస్పర సంబంధమేమి? శ్రీమాలి కీమె సహాధ్యాయిని యని మాత్రము వినాఁడు. ఎంత సహాధ్యాయిని యైనను పెండ్లియంతయు నామెమీఁద నడచునా ? శ్రీమాలి యొక్క యే జీవితరహస్యము తదధీనమై యున్నదో ఈ భావము చమత్కారముగా శ్రీవత్సుని మనసులో శ్రీమాలి యొక్క దుఃఖముయొక్క హేతువెంత యపరిస్ఫుటముగా నున్నదో అంత యపరిస్ఫుటముగా నుండ నారంభించెను.

ఆ మూఁడవ దినమునఁ బెండ్లివారు వెడలిపోయిరి. శ్రీమాలికూడ నత్తవారింటికి వెళ్లెను. అమృతవల్లినిఁ దన వెంట రమ్మనెను. అమృతవల్లి నిరాకరించెను. శ్రీమాలి తల్లియే కూతురువెంట వెళ్లెను. అమృతవల్లి తన తల్లిదండ్రులను వదలివచ్చి యించుమించుగా నెలనాళ్ళయ్యెను. వారు పెండ్లికి రాలేదు. వారు వృద్ధులు. వాసుదేవుఁడు

వారిని ఒక్కసారియైనను వచ్చి చూచిపొమ్మని బతిమాలెను. వారు మేము వృద్ధులమైతిమి. వచ్చి యాసందడిలోఁ దట్టుకొనలేము. తరువాత సావకాశముగా బంధువులందఱు లేనప్పుడు పిల్లవానినిఁ బిల్లనుచూచి యాశీర్వదింతుము. అమృతవల్లి యచ్చటనున్న దనఁగా మేమచ్చట నున్నట్లే. మా బ్రతుకంతయు నామెయేకదా? వాసుదేవా! ఆమెనీకు వశమైనది. మేము నీకు వశమైనట్లే" అన్నారు. ఆమాటలలో వాసుదేవునకొక విలక్షణమైన యర్థము భాసించెను. ఆమె తనకు వశమగుటయేమి? ఇది సామాన్యముగా ననినమాట. కొన్ని ఇట్లు సామాన్యముగా లోకములో నెవరిచేతనో యుచ్చరింపఁబడిన మాటలయందు యనుద్దిష్టములైన కొన్ని యర్థములు కొందఱికి స్ఫురించుచుండును. హఠాత్తుగా వాసుదేవున కొకయర్థము స్ఫురించెను. అమృతవల్లి తనకు వశమైనదా? అమృతవల్లి చిన్నపిల్ల. తనకూతుతో సమాన వయస్కురాలు. లోకములో నట్టివయసుగల బాలికల కట్లు ప్రవర్తించుట సంభవముకాదు. వీరామె తలిదండ్రులు. ఆమె రహస్యము వీరికిఁ దెలియునా? ఆమె తన మనసులోని యేదో యొకయూహ సూచనగా లీలగా తల్లిదండ్రులతో ననెనా? ఆ యర్థమునావీ రుద్దేశించి యనుచున్నారు? ఇది సంభవమా? నిజముగా తన కమృతవల్లియందు కల భావ మెట్టిది? తా నెన్నఁడును విచారించుకొనలేదు. ఊహించి నచోఁ దా నామెయందు ప్రవర్తించెడి ప్రవర్తన యెట్లున్న దనఁగా నామెమీఁదఁ దనకు సర్వాధికారమున్న ట్లున్నది. తన పనులన్నియు నామె చేయక తప్పదన్నట్లు, అది యామె

ధర్మమున్నట్లు తాను భావించినట్లుగా తన ప్రవర్తన తన కిప్పు డనిపించినది. అట్టిభావన యామెయందు తనకెందుకు కలిగినది? ఆమె తనతో మాటాడినప్పుడైన దగ్గఱగా నడచి నప్పుడైన తనవంకఁ జూచినప్పుడైన, తనవలన నామెయేదైన వాంఛించి, యా వాంఛానిర్వహణము కొనసాగించుకొన్నప్పు డైన వారి యిరువురినడుమఁగల భావమును తానెప్పుడును సూక్ష్మముగా విచారించలేదు. తనమీఁద నామెకుసర్వాధి కారములు గలిగినట్లామె సుకుమారమార్గమున నడచు చున్నట్లు భాసించెను. తాను దానినిఁగూర్చి యూహించ కుండ నామె ప్రవర్తించిన యా ప్రవర్తనలోని సహజత్వ మునుఁగూర్చి విచారించవలసిన యవసరము లేదన్నంత యొక నిశ్చయమైన నిశ్చలమైన పరామృష్టము కాకుండ సహజ ముగానున్న యొక భావముతోఁ బ్రవర్తించుచున్నట్లు దోచి నది. వారి పరస్పర సంబంధమునందు తండ్రికూతుండ్ర తనములేదు. ఇది నిశ్చయము. పొరుగువారి బిడ్డ. ఆ పిల్లను ముద్దుగా చూడవలయునన్న భావములేదు. ఆముద్దుగా చూడవలసిన భావము తెచ్చిపెట్టుకొనునవసర మున్నది. అట్టి ప్రయత్న మాయన యెన్నడును చేయలేదు. తన కొడుకు భూమిమిత్రున కామెయందు నొకవైమనస్య మున్నట్లు తనకుఁ దెలియును. ఆ వైమనస్యము నతఁడెప్పుడుపును పరామర్శింప లేదు. అందుచేత భూమిమిత్రునియం దతనికిఁ గోపము రాలేదు. అందుచేత నమృతవల్లి యందతనికొక "ఈమె మనపిల్లకాదు" అన్నయూహయు పొడమలేదు. ఆ వైమ నస్యమునకు హేతువు నేఁ డే భావము తనకు స్ఫురించినదో

యాంభావము భూమిమిత్రుని మనస్సునందు తాడనముచేసి కలిగియుండవచ్చునన్న యూహకూడ కలుగలేదు. అభావము తనకు పూర్వ మెప్పుడైన కలిగెనా? కలుగలేదు. కలుగక పోయినచో నిప్పు డాభావము తనకు మొదటిసారి తోచినది. ఆ తోచుటలోని క్రొత్తదనమును తా ననుభవించవలయును. యట్టి యనుభూతి రాలేదు. ఆమె తలిదండ్రు లున్నంగా తాను బెరుకు పొందవలయును. సిగ్గుపడవలయును. తరతర లాడవలయును. ఇది యేమిరా యనుకొనవలయును. అత నిట్టి యూహలో పుట్టలేదు. ఈభావము స్ఫురించి నది. ఆ స్ఫురించుటలో నతనికొక క్రొత్తదనము గనిపించ లేదు. ఆమె తలిదండ్రులతో సహజముగనే మాటాడెను. వెడలిపోయెను. తరువాత నమృతవల్లి తనయింటిలోననే యుండెను. పెండ్లి జరుగుచుండెను. ఆమెను దినమున కెన్నిసార్లో కలిసికొనవలసి వచ్చెను. తత్పూర్వ మామెతోఁ దన ప్రవర్త యెట్లుండునో తత్పరమునందు నట్లేయుండెను. కాని యొక్కటియే భేదము. తత్పూర్వము వానిమనస్సులోని యమృతవల్లి యేతద్భావముచేత పరిస్పృష్టకాని యమృతవల్లి. ఇప్పుడా భావముచేత పరిస్పృష్టమైన యమృతవల్లి. ఇది భావములోని భేదమేతప్ప వెలినడవడిలో నేభేదము లేదు. వారిద్దఱుకలిసికొన్నప్పుడు మహాసేనాధిపతిని, నలువదిమై దేండ్లవానిని తన చెలిమికత్తెకు తండ్రియైనవానిని తాను కలిసికొంటినని యామె యనుకొనదు. ఆమెను కలసికొని యతఁడు నామెయొక్క పరిస్థితులను భావించి తదనుగుణమైన యొక వ్యక్తిని కలిసికొన్న ట్లనుకొనఁడు.

చివర కమృతవల్లి కాలంజరినిఁ జూచుటకుఁ బోవు వేళకు నెల దాటినది. ఎట్లో తీరికచేసికొని వెళ్ళినది. ఇప్పు డమృతవల్లికిఁ దన యింటి తీర్పుకంటె వాసుదేవుని యింటి తీర్పు మిక్కుటమైనది. వాసుదేవుని యింటిలో సేవయెక్కుడ నున్నదో యమృతవల్లికే తెలియును. కొన్నాళ్ళు తను యింటికి పోయినచో నామెకొఱకు వాసుదేవుని యింటినుండి నాలుగు వార్తలు వెళ్ళుచుండును. చివరకు అమృతవల్లి వాసుదేవుని యిల్లు వదలిపెట్టి పోవుటకే వీలుపడనట్లు తోఁచి నది. ఎట్లైననేమి యామె తీరికచేసికొని కాలంజరి యింటికిఁ బోయినది. ఇప్పుడు అమృతవల్లిస్థితి పూర్వస్థితికాదు. తండ్రి వంటి కొన్ని యూళ్ళ ప్రభువులు గిరివ్రజపురమున వంద మందికి మించి యున్నారు. అమృతవల్లి వారిలో నొక్కస్త్రీక ఇప్పు డమృతవల్లి యట్లుకాదు; వాసుదేవుని కుమార్తె పెండ్లిలో సర్వాధ్వర్యవము నామెమీఁదుగా జరుగుటచేత నామెను మహానగరమున నెఱుఁగనివారే లేరు. పిన్ననుండి పెద్దవఱకు సామాన్యులనుండి యధికులవఱకు నమృతవల్లి నెఱుఁగుదురు. ఆమె వాసుదేవుని కుమార్తెయో దగ్గఱ బంధువో వాసుదేవుని భార్యకు మిక్కిలి దగ్గఱ చుట్టమో! మహావివేకవతి. కార్యనిర్వాహకురాలు. మర్యాద తెలిసిన యువతి. ఆమె గుణముల దృష్టితో నామె వయస్సుయొక్క యూహయే యెవ్వరికి లేకపోయెను. ఆమె యిప్పుడు కాలంజరి యింటికి పోవుట కష్టమైనపని యయ్యెను. తన స్థితిలో నింత మార్పు వచ్చినదని యామెకు తెలియదు. ఆమె తాను తొలుతటియమృతవల్లినే యనుకొని వీధివెంట బయలు

దేరెను. సర్వజనులు నేత్రము లామెమీఁదనే యుంచెను. ఆమె దుర్గమునుదాటి బయటికి వచ్చి పడమరనుండి తూర్పు దెసకు వ్యాపించిన మహారాజ మార్గమునఁ బ్రవేశించినంత జను లామెను చూచుటయు గుంపులు గుంపులుపడి యేదో చెప్పుకొనుటయు, దుర్గాంతర్భాగమున నున్నంతవఱకు నింత గగ్గోలు లేదు. ఆ లోపలనున్న సైనికులు, నధికారులు నామె యేదో రాజకార్యముమీఁదఁ బాదచారిణియై పోవలసి వచ్చె ననుకొనిరి. దుర్గ బహిఃప్రదేశ మహానగర రాజమార్గమున నామె నడువ నారంభించెను వేళకు నామెకుఁ దెలిసెను. తాను తొలుతటి యమృతవల్లి కాదు. రాజమార్గము వెంట నడువరాదు. ఆమె వెంటనే దుర్గాంతర్భాగమునకు తిరిగి వచ్చెను. ఇప్పు డామెస్థితి చమత్కారముగా నున్నది. తన తండ్రి కొన్ని యూళ్లకు ప్రభువైనను. తగినంత సంపత్తు కలిగియుండినను తాను వృద్ధుఁడైనతరువాత రాజ్యమర్యాదా యోగ్యములైన లక్షణములను పెక్కింటిని తగ్గించెను. నాల్గు గుఱ్ఱములబండి, రాజపురుషు లధిరోహించఁదగినది, సాలంకృత మైనది, పూర్వ మాయన కుండెడిది. కడచిన పది యేండ్లుగా నా బండిఁగూర్చి విచారించినవారు లేరు. అది వన్నియ మాసిపోయినది. చక్రము లూడిపోయినది. పైకప్పు బొత్తలు పడినది. సాలలో గుఱ్ఱములు నాల్గు లేవు. ఒకటి మంచి గుఱ్ఱమేకాని రెండవది విహారయోగ్య మైనదికాదు. ఇప్పు డమృతవల్లి గిరివ్రజ మహానగరాంతమందున్న కాలంజరి యింటికిఁ బోవలయును. ఎట్లు పోఁగలదు ? వాసుదేవు నడిగి యాయన శకటములలో నొకదానినిఁ దీసికొనవలయును. తన

కొంజ కమృతవల్లి వాసుదేవు నిదివఱకు నేదియుకావలయునని యడుగలేదు. అంతటి వివాహ కార్యమునందుఁగూడ నెవరినో పంపించుచు వచ్చెను గాని తాను పోలేదు. ఇప్పుడు తాను సాహిణిని పిలిచి బండి కట్టుమనఁగా నిస్సందేహముగా కట్టను. తానే మహారాజ కార్యముమీఁదఁ బోవుచున్నది, అమృతవల్లి బండి యెందుకు కట్టించినదని వాసుదేవు డడి గినచో సాహిణి యేమనును? ఊరిచివర నేవో గుడిసెలున్నవి. అందులో నొక కిరాతస్త్రీ సోదె చెప్పునట. అక్కడికి వెళ్ళిన దని చెప్పును. వాసుదేవుఁ డేమనుకొనును? కడచిన మైదా శేండ్లుగా తాను వాసుదేవుని మనస్సులో నొక గౌరవ స్థానము నాక్రమించి యుండెను. కడచిన నెలనాళ్ళలో నా గౌరవస్థానము మూఁడు నాలుగు రెట్లయ్యెను. ఈ మాటతో నమృతవల్లి యేమగును? ఆమె కేమియుఁ దోచలేదు. కాలంజరివద్దకుఁ బోయి తీరవలయును. ఎట్లు? ఒకవేళ వాసు దేవుఁ డూరకున్నను భూమిమిత్రున కీసంగతి తెలిసినచో నిపుడు భూమిమిత్రుఁడు తన్నుగుఱించి గ్రుడ్డిలో మెల్లగా భావించుచున్నాఁడు. అదికొంచెము రామార్పణమై పోవును. ఆమె కేమియుఁ దోచలేదు. తన యింటికిఁ దిరిగివచ్చెను. తన యింటిలోఁ దానే సర్వాధికారిణి. తాను వెంటనే యొక రాజ రాజ శకటమునుఁ గొన్నచో తన తండ్రి వలదనునా? తల్లి కాదనునా? ఇన్నాళ్ళనుండి యీమె కీ యూహ యేల రాలేదు? ఆమెకే యాశ్చర్య మయ్యెను. తానిన్నాళ్లు తన యాస్తిపై పరామర్శ చేయుటే ననుకొన్నది. తండ్రియే సర్వ వ్యవహారములు చూచుచుండెను. ఆ లెక్కలు డొక్కలు

తనకు తెలియవనుకొన్నది. సేవకులమీఁద తా నధికారము చేయలేననుకొన్నది. తన మాట సేవకులు విన రనుకొన్నది. ఇప్పుడు తెలిసినది. కాని తన యింటిలోనున్న సేవకులు వృద్ధులు. తన్ను చేతులలో నెత్తి పెంచినవారు తాను వారి నాజ్ఞాపించుట యెఱుఁగదు. వారామె యాజ్ఞను పాలించుటయు నెఱుఁగరు. అయినను చూడవలయునని యింటికిఁబోయి తన వృద్ధ సేవకునిఁబిలిచి "ఓరి తాతా! నీవు వెంటనేపోయి నాకొక రాజశకటము కావలయును. ఒక గుఱ్ఱ మున్నది. మఱి మూఁడు గుఱ్ఱములు కావలయును. రథచోదకుఁడు కావలయును. ప్రొద్దు గ్రుంకులోపల నివియన్నియు సమకూర్ప వలయు" ననెను. ఆ వృద్ధుఁ డిట్లనెను. "మన కెందు కమ్మా ఇవియన్నియు నిప్పుడు? రేపు నీ పెండ్లిసంబంధము వచ్చినప్పుడు చూచికొందములే!" అనఁగా నామె యేమి చేయును? అతనిమీఁద నధికారము చేయు టెట్లు? తండ్రితో చెప్పి ఫలితమేమి? ఆమె వెంటనే వాసుదేవుని యింటికిఁ బోయెను. ఇన్నినా ళ్లామె వాసుదేవుని యింటికిఁ బోయినను కాలినడకనే పోవుచుండెను. అప్పుడప్పుడు వాసుదేవుని శకటములలో నొకఁడు వచ్చి తీసికొని పోవుచుండును. ఆమె సేనాధిపతి యింటికి నడచి పోవుచుండఁగా నెవ్వరికి నది యబ్బురమనిపించదు. అది యలవాటైనది. వారి రెండు సౌధములును దుర్గాంతర్భాగముననే యున్నవి. అప్పుడప్పుడు దుర్గాంతస్థిత మహాధికారుల స్త్రీలు కాలినడకతో మఱియొక యింటికిఁ బోవుట కలదు. పూర్వము మూఁడువందల యేండ్ల క్రింద మగధరాజుల వర్ణమువేఱు; మంత్రుల వర్ణమువేఱు.

సేనాధిపతుల వర్ణమువేఱు. శుంగవంశము రాజ్యమునకు వచ్చినప్పటినుండి రాజ్యాధికారులు బ్రాహ్మణులు. మంత్రులును బ్రాహ్మణులే. సేనాధిపతులును బ్రాహ్మణులే. అప్పుడప్పుడు మంత్రులు బ్రాహ్మణేతరు లగుట కలదు. కాని సేనాధిపతులు బ్రాహ్మణులుగానే యుండిరి. రాజభార్యలు రాజదుహితలే నడచి వేఱొక యింటికిఁ బోవుచుండఁగాఁ దక్కినవారి కేమి? బ్రాహ్మణ వర్ణములో నొక విచిత్రమైన గుణ మున్నది. అందందు కొందఱు వ్యక్తులయందు నెట్లున్నను మొత్తముమీఁద నా వర్ణములోని వారికి సర్వజనులు సమానులన్నభావ ముండును. అది యావర్ణముయొక్క లక్షణము. తక్కిన వర్ణములవారు ధనమును బట్టి యధికారమునుఁ బట్టి కీవులు పెంచుకొందురు. అహంకారములు బెంచికొందురు. మరియాదలు పెంచికొందురు. సర్వసమత్వము వారి రక్తములో లేదు. బ్రాహ్మణుల యాచారములు కొన్నిఁటినిఁ జూడగా వారు తక్కిన కులములవారిని దూరముగాఁ బెట్టినట్లు కనిపించును. ఇది వట్టి బహిశ్చిహ్నము. అంతరచిహ్నము సర్వసమత్వము. అందుచేత రాజును బ్రాహ్మణుఁడు. సేనాపతి బ్రాహ్మణుఁడు. వారి వీరి స్త్రీలు పురుషులయొక్క యధికారమును పురస్కరించుకొని యెక్కువ తక్కువ తనములు నెలయించికోరు. అమృతవల్లి వాసుదేవుని యింటికి నడచిపోయెను. నడచిపోవును. ఆమె వెళ్ళినవేళకు వాసుదేవుఁ డింటివద్ద నుండెను. ఆమె యాయనతో నేమి మాటాడవలయునో తెలిసికొనలేకపోయెను. నా కా రాజశకట

మొకటి కావలయునని యడుగునా; మా వృద్ధసేవకుఁడు నా మాట వినుటలేదని చెప్పునా? నా కూఁరిచివఱ నేదో పని యున్నది. మీ బండి నిమ్మనునా? మీ బండి నిమ్మని నచో నన్నడుగుట యెందుల కనును. అమృతవల్లి యి ట్లనెను. అమృతవల్లి వాసుదేవునితో నెప్పుడు మాటాడినను అయ్యా! యని పిలుచుటగాని, ఒక వరుసపెట్టి పిలుచుటగాని యెన్నఁడు చేయలేదు. ఆమె యిట్లనెను. "మీ సేవకుఁడు నీలకంఠుఁడు నాకుఁ గావలయును." వాసుదేవుఁడు 'సరే'యనెను. ఆమె "ఇప్పుడేదో పనిమీఁద నే నడుగుటలేదు. అతఁడు మా యింటివద్ద సేవకుఁడుగా నుండవలయును. మా సేవకు లందఱు వృద్ధులైపోయిరి. వారిచేత నేపని చేయించుకొనుట కును వీలులేకుండ నున్నది"అనఁగా వాసుదేవుఁడు నిప్పు డేమి పనివచ్చిన దనెను. అమృతవల్లి తనపనిని చెప్పినచో నెంటనే వాసుదేవుఁ డొక శకటమును తన యింటికి తోలిప్పించును. చెప్పనిచో నట్లే యనును. లేదా తరువాత పంపింతునులే యనవచ్చును. ఏమి చేయవలయును. అనుకొని యిట్లనెను. "అతఁడు చాల నమ్మకమైనబంటు. మీదగ్గఱ నటువంటివారు నలుగురైదుగురు గలరు; వారిలో నితఁ డొకఁడు. ఇతని నేను తీసికొనిపోయినందువలన మీ యేకార్యమునకును భంగము రాదు." వాసుదేవుఁ డిట్లనెను. "తీసికొనిపొమ్మా. నాతో చెప్పవలయునా? ఈ యిల్లు నీదికాదా? ఈ సేవకుఁ మీఁద నా యధికారమునకన్న నీ యధికారమే యెక్కువ కలదు." అమృతవల్లినోట నెప్పుడురాని యొక మాట వచ్చెను. ఆమె క్షమింపవలసిన దనెను. వాసుదేవుఁడు నిదానించి యామెవంక

చూచెను. అమృతా! ఏమి క్రొత్తగా మాటాడుచున్నావు? నేను క్షమించుటయేమి? నీవు చేసిన తప్పేమి? నా యింటిలో నున్న సేవకులు నీ మాట వినుటచేత నాకది యపకారము జరిగినట్లు, నా యధికారమును నీవు కొంత దొంగిలించినట్లు నేను భావించితినని నీవనుకొనుచున్నావా? నాకు ప్రస్తుతము సైన్యమునుగూర్చి పట్టినంతవిచారము వేఱొకదానినిఁ గూర్చి పట్టదు. రాజు పోయి విదిశానగరమునకూర్చున్నాఁడు. ఆయన దుష్టమైన త్రోవఁ బోవుచున్నాఁడు. రాజు కొడుకులు పసివాండ్రు. ఈ మంత్రులు రాజునం దెంత భక్తి కలవారో నాకు తెలియుటలేదు. వారిలో నొక్కొక్కఁడు ప్రవర్తించు ప్రవర్తన నాకు చమత్కారముగా నుండును. ఎవనికివాఁడు తన చేతి కందినదిదక్కించుకొనవలె ననున్నట్లున్నది. అది యట్లుంచుము. నీవు నీలకటుని తీసికొనిపొమ్ము. ఒక్కటే మాట చెప్పుచున్నాను. నీకిచట సర్వాధికారము కలదు. నా భార్యకూడ నీ కడ్డంకి చెప్పదు. ఆమెకే నీమీద నెక్కువ ప్రేమ కలదు. పూర్వమేమో నాకు తెలియదుకాని ఇప్పుడు భూమిమిత్రునకు నీవన్నచో నింత గౌరవమని చెప్పుటకు వీలు లేదు. నీవు నన్నేదియు నడుగ నక్కఱలేదు. నీవు చేసినపనికి నా యింటిలో విచారణలేదు. నీవు పదివేల నిష్కములను వ్యయపెట్టితివి. ఎందుకు వ్యయపెట్టినదని నే నడుగను. భూమిమిత్రుఁడు నడుగఁడు. మా యిద్దఱకును తెలియును. దాని యవసరమున్నఁగాని నీవు వ్యయపెట్టవు. అది మా కుటుంబమునకు నష్టహేతువైనచో నీవలన నాపని జరుగనే జరుగదు. సర్వథా నీవు మాకు హితురాలవు. మాకు వ్యతిరేకమైనపని

యేదియు చేయలేను. నీవొక దేవతవు. వచ్చి నన్నాదు కొన్నావు. నాది యిదొక జాతకము. ఈ వయస్సున నే నెవరిమీఁద నాధారపడవలయునో తెలియనప్పుడు నిన్ను భగవంతుఁడు నాకు చూపించినాఁడు. నావలన నీ కుపకారమే జరుగునని నాకు తెలియును. నీ జీవితములో నీకు నా కుటుంబము తోడఁ గలిగిన పరిచితి పెద్ద మార్పునకు హేతువైనదని నాకు తెలియును. ఒక బాలికయొక్క జీవిత మెట్లు గడువవలయునో అట్లు గడచెడి స్రోవ మలఁగి నీ జీవిత మింకొక మార్గమునఁ బట్టినది. నేను నిన్ను గుఱించి యెన్నివందలసార్లు గాఢముగా నూహించితినో నీకు తెలియదు. అమృతవల్లి యేమికావలయును? ఆమె తలిదండ్రులు వృద్ధులు. ఆమె నెవరు పెండ్లియాడుదురు? ఆమెకుఁ బెండ్లియైనచో నావృద్ధు లేమి కావలయును? ఆమెకు తగినభర్త యెవఁడున్నాఁడు? ఆమె పరమ స్వతంత్రురాలు. ఆమె యూహలన్నియు స్వాతంత్రములే. ఆమె యథేచ్ఛముగాఁ బ్రవర్తించెడి లక్షణము కలది. గొప్ప వివేకవంతురాలు. స్త్రీలకుసహజమైన లజ్జ యామెయందు లేదు. స్త్రీ సహజలజ్జ కలదు. ఈ రహస్యము నెవరు గుర్తించగలరు? ఆమె రాజ్యము నేలఁగలదు. సేనలు నడుపఁగలదు. వ్యూహములు నిర్మించఁగలదు. ఎవఁడో మహారాజునకు భార్య కావలయును. ఏఁడీ ఆ మహారాజు! అమృతా! నిన్ను గుఱించిన నా యూహ యిది. నీ కీ యింటిలో కాదనఁగలిగిన దేమున్నది? నీవు పలుసార్లు మీ యింటినుండి నా యింటికి, నా యింటినుండి మీ యింటికి నడచి పోవుచుండఁగాఁ జూచితిని; నీవు నడచిపోవుట నా

కెన్నియోసార్లు నేనేదో దోషము చేసిన ట్లనిపించినది. నేను మీ యింటి కెన్నోసార్లు రాలేదు. మొన్న పెండ్లికి మీ తలిదండ్రులను పిలుచుటకు వచ్చితిని. తత్పూర్వ మొక సారి వచ్చితిని. మీ సంపత్తికి, మీ యధికారమునకుఁ దగిన కొన్ని లక్షణములు మీ యింటియందు నాకుఁ గనిపించ లేదు. మొట్టమొదట మీ యింటిలో రాజశకటము లేదు. అమృతవల్లి కాలినడకతో నటునిటు తిరుగుట వాసుదేవున కిష్టములేదు. నేఁడు ప్రొద్దుననే నీలకటునితో చెప్పితిని. ఒక రాజాశ్వ శకటమును నిత్యము నమృతవల్లి యనుజ్ఞలలో నుంచవలయునని. అతఁడు నేడు ప్రొద్దు క్రుంకువఱకే మీ యింటికి తెత్తు ననెను. అమృతా! ఆ బండి వలదనకుము. నాయందు నీకేమైన గౌరవము కలిగినచో దానిని నీ వంగీక రించుము. ఇది నేనిచ్చుట కాదు. నీవు తీసికొనుటకాదు. మామీమధ్య నిచ్చి పుచ్చుకొనుటలు లేవు."

ఆ రాత్రి యమృతవల్లి యేకాంతముగా మంచము మీఁదఁ బండుకొని యూరకే కన్నీరు మున్నీరుగా నేడ్వ నారంభించెను. ఆమె మనస్సు నెదుట నొక విలక్షణమైన, వినూతనమైన, విచిత్రమైన, స్వచ్ఛమైన తెల్లని యొక తెర పరమ మనోజ్ఞముగా, హృదయాభిరామముగా, మృదు వాయు తరంగ పరామృష్టముగా, పశ్చాత్ప్రిత బహ్వాప్సరో నృత్యవేళా సముస్మిలిత భ్రూభంగవిలాస దీర్ఘీకృతనేత్రాంచు రమణీయతా ప్రతిఫలనముజరుగుచున్నట్లు భాసించుచుండెను. పరమ సమర్థుఁడైన యొక గాయకుఁడు, సర్వస్వరరహస్యవేత్త యైన గాయకుఁడు, నిత్యాభ్యాస పటువైన కంఠముగల గాయ

కుఁడు, ఏదో యొక విచిత్రమైన రాగము ప్రసిద్ధ స్వరము
లను పొందించకుండ తత్స్వరములయొక్క తీవ్రతను కొసల
యందు తాకుచు రాగమును ప్రస్తరించి పాడి వెనుకనున్న
భావముయొక్క వట్టి యూహా రమణీయతను మాత్రమే ప్రద
ర్శించుచున్నట్లుండెను. కాని యామె దుఃఖ మెట్టిదనఁగా
దానిలోననే యోదార్పు లక్షణముకూడ కలది. కొంతసేపటి
కామె నిదురపోయెను. మఱునాఁడు ప్రొద్దుననే యశ్వశక
టము వాకిఁట నుండెను. నిన్న సాయంకాలమున లేని యొక
సందేహము నేఁటి ప్రొద్దున నామె కుదయించెను. ఇది వాసు
దేవుని శకటము. తాను దానిని తన బండివలె నుపయో
గించి కొనవచ్చునా? పలుమంది తాను వాసుదేవునకు
బంధువని యనుకొనవచ్చును. తాను బంధువు కాదన్నమాట
కొందఱికి తెలియును. వారేమి యనుకొందురు? భూమి
మిత్రుఁడుకూడ దీని కంగీకరించునా? ఈ బండిమీఁద నెక్కి
పోవచ్చునా? పోరాదా? లోకములో నొక స్థితియుండును.
ఒకని కొక వస్తువుమీఁద స్వాతంత్ర్య ముండును. ఉన్నందువల్ల
నష్టములేదు. దోషములేదు. కాని దానిమీఁద తనకుఁగల
స్వాతంత్ర్యమును ప్రదర్శించినచో నెవ్వరైన నేమైన నను
కొందురేమో యన్నభయ ముండును. నూత్న వధూ
వరులయం దీ భావము లజ్జా రూపకముగా ప్రకాశించు
చుండును. తదితరులయందు నిట్టి భావము కలిగినచో నది
భయముగా భాసించుచుండును. మొదటిదానిలో పెంకరి
తన ముండదు. ఇందులో తెంపరితనముండును. ఒక
లౌకికమైన నియమముదాటి ప్రవర్తించుచున్న యొకయార్ద్ర

భావముయొక్క లక్షణమునందు నీ తెంపరితన ముండును. అట్టి తెంపరితనము అమృతవల్లియందు కలదు. ఆమె బండి నెక్కెను. కాలంజరి యింటికిఁబోయెను. అచటఁ గాలంజరి యిల్లెచ్చటనున్నది? ఆయిల్లు పడిపోయినది. ఎవరో తగులఁబెట్టిరి. గోడలు పడిపోయినవి. కాలంజరి యేమైనది? ఆమెభర్త యేమైనాఁడు? అమృతవల్లి బండిదిగి చుట్టుపట్ల నున్న రెండు మూడిండ్లలో నామెనుఁగూర్చి యడిగెను. కొందఱు కాలంజరి యాయింటిలోఁబడి తగులఁబడిపోయె ననిరి. ఒకామె "అట్లుకాలేదు. ఆయినచో నామోసము కనిపించదా? ఆమె నెవరో యెత్తికొనిపోయి యింటికి నిప్పు ముట్టించియుందురు. ఇప్పటికి నెలనాళ్ళక్రింద నిది జరిగినది. నాఁటినుండి యామె యేమైనదో మాకు తెలియదు. ఈయిల్లు తగులఁబడిపోయిన తరువాత రెండు మూనాళ్ళకామె మగఁడువచ్చెను. అతఁడు నెత్తిన నోరున బాదుకొనెను. 'అయ్యో నాభార్య!, పది దినములు నన్నాదుర్మార్గుఁడు రానీయలేదు. నాకేవో సంకటములు తెచ్చిపెట్టుచునే యున్నాఁడు. వానిని వదలించుకొని వచ్చునప్పటికి యిక్కడ నిట్లైనది. నాభార్యకేవో యపకారము జరుగునని నా కనిపించుచునేయున్నది. నాకు వచ్చినకలలు నట్లేవచ్చినవి. నే నామె నేటికోరి పెండ్లిచేసికొన్నాను. ఆమెను వలచి పెండ్లిచేసికొన్నాను. ఆమె యేదికోరిన నది తెచ్చియిచ్చి యొక సంవత్సరము బహుప్రయాసపడి యామెయొప్పుదలను పడసినాను. ఆమె బుద్ధిపూర్వకముగా నన్ను వదలిపోదు. ఎవఁడో దుర్మార్గుఁ డామెను బలాత్కారముగా

హరించినాఁడు.' అని యెంతయో విలపించెను." ఇట్లు అచ్చట నున్న నాల్గైదు గుడిసెలవారు నాల్గైదు విధములవార్తలు చెప్పిరి. ఆమె కేమియుఁ దోచలేదు. శ్రీమాలి వారు దేవుని కుమార్తె యన్నంతనే కాలంజరి నిర్జ్యోతియోయెను. దానికి హేతువేమియో కనుగొనవలయు ననఁగా నది యిఁట్లు విఘటితమయ్యెను. అప్పు డమృతవల్లి కింకొక యూహ తోఁచెను. కాలంజరివద్దకుఁబోయి సోదెయడుగు మన్నవాఁడు జయద్రథుఁడు. కాలంజరికి స్వప్నములో కనిపించినవాఁడు జయద్రథుఁడు. ఆ జయద్రథుఁడు యువకుఁడు. ఈ జయద్రథుఁడు వృద్ధుఁడు. అయినను కాలంజరి చెప్పిన వర్ణనము వలన లక్షణములన్నియు నొక్కటిగానే యున్నవి. ఈ కాలంజరి యా జయద్రథు నెఱుఁగదు. అనఁగా జయద్రథుఁడు కాలంజరి నెప్పుడు చూడలేదని యర్థము. అయినచో నామెవద్దకు సోదె నడుగుటకుఁ బొమ్మని యతఁ డేట్లుచెప్పెను. కాలంజరియిల్లు గిరివ్రజమునకు తూర్పుదెసయందు చిట్టచివర నున్నది. జయద్రథునియిల్లు పడమటిదెస చిట్టచివర నున్నది. జయద్రథుఁడిల్లు కదలెడివాఁడుకాదు. విదురుఁడు కదలఁడు. జయద్రథుఁడు కదలఁడు. తా నెఱిఁగినంతవఱకు వారు బయటకు పోయినట్లు వినలేదు. ఇదియేమి? అయినను పోయి జయద్రథుని కనుగొనవలయును. 'తాతా! నీవు కాలంజరి వద్దకుపోయి సోదెనడుగు మంటివి. అచ్చటికి పోయితిని. అచట కాలంజరియేలేదు. పూర్వ ముండెడిదట. ఆమె యిల్లు తగులఁబడిపోయినది. ఆమెయు నామె భర్తయు నెచ్చటికో లేచిపోయిరని చెప్పి ఆసోదె యేదియో నీవేచెప్ప

మని యడుగుదును. జయద్రథుఁడు కొన్ని రహస్యవిద్యలు కలవాఁడని కొన్ని మంత్రములు కలవాఁడని చెప్పికొందురు. నే నెప్పుడును విశ్వసించలేదు. అది యేదోపోయి తెలిసి కొందును." అని యమృతవల్లి బండిని విదురుని యింటికిఁ బట్టించెను. విదురుని యింటిముం దాఁపెను. లోనికిఁ బోయెను. విదురుఁ డరుగుమీఁదఁ గూర్చుండెను. ఆ విదురుఁడు నిర్వీచియైన యమృతపు తటాకమువలె నుండెను. తన్ను చూచెను. పలుకరించలేదు. ఈమె 'తాతా' యనెను. అతఁడు "ఏమమ్మా! చాలదినములకు వచ్చితివి. పిల్లలందఱు నావద్దకు వచ్చుటలేదు. నేనుకూడ దుర్మార్గుఁడ ననుకొనుచున్నారు కాబోలు. నాకు వానిసంగతి చాలదినములుగాఁ దెలియును. వాని దుశ్శీలము ఇంత లోతున్నదని నాకు తెలియదు. రావమ్మా రా! నా గడ్డము నొకసారి లాగిపో తల్లీ!" అని విదురుఁడు కన్నులయందు నీరు పెట్టుకొనెను. అమృతవల్లి కేమియు నర్థము కాలేదు. 'ఏమి జరిగినది తాతా?' యనెను. విదురుఁడు అమ్మా! నేను చెప్పలేను. ఈప్రక్క నున్న యేయింటిలో నడిగినను చెప్పుదురు. పోయి తెలిసికొ మ్మనెను. రాజాశ్వ శకటముమీఁద నొకస్త్రీ వచ్చుట యా వీథియందు కొంత యబ్బురము కలిగించెను. పూర్వము శ్రీమాలి విదురునివద్దకు వచ్చునప్పుడుకూడ నమృతవల్లియు నామెయుఁ గలసి నడచివచ్చుచుండిరేకాని యామె యిట్టి శకటముమీఁద నెప్పుడు రాలేదు. మఱియు గిరివ్రజపురమునకు పడమటిదెసయందు పెరిగిన యీ పట్టణము క్రొత్తది. అచట నిండ్లుకూడ నెడ మెడముగా నుండును. అచ్చట

నెవ్వరును నశ్వశకటములమీఁదఁ బోవుట సామాన్యముగా జరుగదు. ఆమె బండిదిగి యొకయింటిలోనికిఁ బోయి యేమియు నెఱుఁగనట్లు "ఇచట జయద్రథుఁడన్న యొక వృద్ధుఁ డుండ వలయును. ఆయన యిల్లెక్కడ?" యనెను. ఆయింటిలో నీప్రశ్న వినినంతనే నలుగురు మూఁగిరి. అందఱు వానిని తిట్టిరి. నల్వురు నాల్గుమాటలు మాటాడిరి. వానికి నీకేమి సంబంధ మనిరి. నీ వెవరిపిల్ల వనిరి. "వాఁడు నీయీఁడు పిల్లలను పాడుచేసినాఁడు. నీవేదో రాజకుటుంబమునకు చెందిన బాలికవలె నున్నావు. ఎన్నాళ్ళనుండి నీవాతని నెఱుఁగు దువు? పాప మావిదురుఁడు పరమసాధువు. పసిపిల్లలన్నచో నతని కెంతోముద్దు. పిల్లలతని దెసకు సహజముగా నాకర్షింపఁ బడుదురు. ఆ పిల్లల నందఱను ఈ దుర్మార్గుఁడుకూడఁ జేరఁదీయుచుండెను. వానికంటె దుష్టుఁడు సృష్టిలోనుండఁడు. వాఁడిట్టివాఁడని యెన్నాళ్ళకుఁ దెలిసినది. ఇంతకు నతఁడు మురారికూతును చెడ్డత్రోవయందు ప్రవేశపెట్టక పోయినచో వానిసంగతి యెవ్వరికి నింతగాఁ దెలిసెడిదికాదు. ఎంతమంది పెండ్లికాని బాలికలనువాఁడు మోసముచేసినాఁడో? ఇదివఱ కెట్టిపనులు చేసినాఁడో? నీ వెవరవమ్మా, రాజకుటుంబము నకుఁ జెందినదానవా? అయినచో నీతో మేము మాటాడె దేమియులేదు. వెడలిపొమ్మ" అనఁగా నమృతవల్లి తన కును రాజకుటుంబమునకు సంబంధములేదని తాను హరిసేనుఁ డన్న మన్నిని కూతురనియు, తన తలిదండ్రులు వృద్ధులనియు విదురునివద్దకు వచ్చెడి బాలికలలో తా నొక్కర్తుక ననియు తన తోడి బాలికలతో నెంతమందితోడనో జయద్రథుఁడు

దుర్మార్గుఁడని తాను చెప్పితిననియు, వానియందు తనకుఁ బ్రత్యయములేదనియు, వానినిఁగూర్చి సందేహపడితిననియుఁ జెప్పఁగా, వా రామెను విశ్వసించి ధోరణిలోఁబడి యిట్లనిరి. "అమ్మా! మనరాజేమిరాజు. వీఁడారాజు? దేశములో నున్న స్త్రీలయొక్క యీలువు నపహరించువాఁడు రాజా? ప్రజల ధనముఁ దోచికొని తినెడివాఁడు రాజా? ప్రజలమర్యాదలు భంగపఱచెడివాఁడు రాజా? సీసీ! రాజులుచేసెడి పను లిట్టివి. వారినేమైన నన్నచో రాజద్రోహము. ఓయి పరమేశ్వరా! ఇట్టి సంకటమును లేకుండ రాజ్యములు జరుగుట యెప్పుడు? అది కృతయుగముతోడనే పోయినదా? తల్లీ! నీ పేరేమో తెలియదు. అమృతవల్లియా? ఎంతకమ్మని పేరు. ఆ రాజు విదిశానగరమునఁ గూర్చున్నాఁ డమ్మా, సరే. కూర్చుండనిమ్ము. అదివారాంగనల కాటపట్టు. తన కమితకామము కలదు. రాజు. తగినంత ధన మున్నది. అధికారమున్నది. తన ప్రవృత్తియుకూడ నట్టిదే. రాజ్యరక్ష చేయుటకు గొప్ప సేనాపతికలఁడు. తన బ్రతుకు తాను బ్రతుకుమనుము. ఆ మహానగరమంతయు వారాంగనలే. తనకోర్కి యంతయుఁ దీర్చికొననిమ్ము. ఇదియేమి పోవుకాల మమ్మా. రాజ్యములో నెచ్చటెచ్చట నందకత్తెకలదో వారివారి నెల్ల తనవద్దకుఁ బిలిపించుకొనునట. ఎచ్చటెచ్చట నందకత్తెలున్నారో వారిని నిరూపించుటకు, వారినిఁగూర్చిన వార్తలు దనకు పంపుటకు పలుచోట్ల పలుమంది మనుష్యులను నియమించినాఁడట. వా రెవ్వరెవ్వరో యెవ్వరికిని తెలియదు. ఆమె యొకనిభార్య కావచ్చును. అవివాహిత

కావచ్చును. ఈ యుద్యోగస్థులు ఆ రాజునకు తగినవారు. వీ రావిద్యలో నిష్ణాతులట. మగనాండ్రను వ్యామోహ పెట్టుటకు బాలికలను భ్రమింపఁజేయుటకు వారికున్నశక్తి చెప్పరానిది. వారందటిలో మీ జయద్రథుఁడు చాల గొప్పవాఁడట. ఇతఁ డెంతమంది భార్యలనో రాజుకడకు పంపెనట. ఎంతమంది కూతుండ్రనో రాజునకుఁదార్చెనట. అతని కెంతధనము కావలసిన నంతధనము బొక్కసమునుండి యీయవలయునని నిరాఘాటమైన రాజాజ్ఞ కలదు. ఓరి బాబోయి! ఇంకనేమి చెప్పవలయును. నగలుచూపించి, వెలగల చీరలుచూపించి, దివ్యములైన రాజశకటములమీఁద వాహ్యాళులుచెప్పి, విదిశానగరమున జరుగు నాట్యసభలు వర్ణించి, మణిదీపములు రత్నకంబళములు చంద్రకాంతపు జాళ్ళమండపములు, సాలలు, సాలభంజికలు, మొదలైవాని వైచిత్ర్యములు వర్ణించి రాజునుఁగూర్చిచెప్పి యెంతమందిని మోసముచేసెను? అయ్యో! ఆమెను పుట్టింటికిఁ బంపించి నట్లు, బంధువులయిండ్లకు పెండ్లికిపోయినట్లు, ఈ బాలిక మేనత్తగారి యింటికి పోయినట్లు తోడి సహాధ్యాయినితో వారియూరు పోయినట్లు చెప్పరానన్ని యబద్ధములు వెల యించి భర్తలను మోసగించి, తల్లిదండ్రులను గికురించి యిట్లు చేయుచుండెను. మురారి గొప్ప ధనవంతుఁడు. అత నికి మల్లవిద్యయం దభిమానము. అతఁ డెప్పుడును పదిమంది మల్లురను పోషించుచుండును. మల్లయుద్ధముల నతఁ డేర్పాటు చేయును. అది యతని కభిమాన విషయము. ఈ జయ ద్రథుఁడు తనకు దినములు చాలక మురారియొక్క కూతును,

పరమసౌందర్యవతిని రాజువద్దకుఁ బంపెను. సరిగా నాదినము నందే మురారి యొకగొప్పమల్లునితోఁ దనవద్దనున్న యుత్తము డైన మల్లునికి యుద్ధము సహాయత్తపఱచెను. అతఁడు తన కూతు నెంతఁ బ్రేమించుననఁగా నామె స్త్రీయైనను నామెకు మల్లయుద్ధమును నేర్పించెను. ఆమెలేకుండ నతఁ డేమల్ల యుద్ధమును జరుగనీయఁడు. కూతుకొఱకుఁ గబురంపెను. కూతురు నగరమున లేదు. భార్యనడిగెను. భార్య కూతు రెచ్చటికో పోయెనని చెప్పెను. ఆమె చెలికత్తెతో వెళ్ళె ననెను. ఇతఁడు తనకూతురు వెళ్ళినదన్న యూరునకు వెంటనే మనిసినిఁ బంపించెను. అక్కడ లేదు. ఏమైనది? భార్యను దండింపఁబోయెను. ఆరాలుతీసిరి. క్రమక్రమ ముగా నీ దొంగల వరుసయంతయు తెలియవచ్చిరి. మూల రహస్యము తెలిసెను. ఆ మురారి ప్రచండుఁడు. ఎప్పు డిది యంతయు రాజ మూలకమైన వ్యూహముగా భాసిం చినదో దానిని వెంటనే మరుగుపఱచినాఁడు. దొంగలవరుస సగము దూరము వచ్చినది. ఇంక పైన బహిరంగముగాఁ దెలిసికొనరాదు. లోపలినుండి వార్తలు రహస్యములు తీయ నారంభించినాఁడు. అతనిచేతిలో పదిమంది మల్లురు కలరు. వారన్నచో నూరిలో భయము. పదిమంది యల్లరి చిల్లరిగా వారి నాశ్రయించియున్నారు. వారిద్వారా చాటుమాటు పనులన్నియు వెలికి త్రవ్వఁబడెను. చిట్టచివరకు నీ సూత్రాం తమున జయద్రథుఁడు కనిపించెను. అతఁ డున్నాఁడని మురా రికిఁ దెలిసినదని జయద్రథునికిఁ దెలియదు. ఒకనాఁటి యర్ధ రాత్రమునఁ బదిమంది మల్లురు వాని యింటిమీఁదికి వచ్చిరి.

ఏదో పనియున్నట్లు జయద్రథుని బయటకు పిలిచిరి. అతఁడు రాలేదు. తలుపు తీసికొని లోనికిఁ బోయిరి. ఓయమ్మా! ఆ జయద్రథుఁడు సామాన్యుఁడుకాఁడు. వాఁడెంత దుష్టుఁడో అంత శూరుఁడు. అతఁడంత ఖడ్గ విద్యా నిపుణుఁడని యెవ్వరికినిఁ దెలియదు. విదురుఁ డెల్లనివాఁడు; వాఁడునల్లనివాఁడు. విదురుఁడు బక్కపలుచనివాఁడు. వాఁడు కొంచెము బొద్దయిన మనిసి; విదురుని మొగము చూచినచోఁ బూర్ణిమా చంద్రునిఁ జూచిన ట్లుండును. వాని మొగము చూచినచో నమావాస్య చీఁకటిలో దీపమువంకఁ జూచిన ట్లుండును. ఇద్దఱు పేదకులమునందుఁ బుట్టినవారే. ఇద్దఱి జీవితములు నీ వీధి వీధియంతయు నెఱిఁగినవే. ఇద్దఱు నెప్పుడు గడప కదలిన వారు కారు. ఇద్దఱు సామాన్య గృహస్థులు. కత్తి బుచ్చుకొని కుక్కను తోలుటయైన వీరికి చేతనగునా యన్నట్టి సామాన్య గృహములయందలి గృహస్థులు. ఆ జయద్రథుని యింటిలో ఖడ్గములున్నవి, డాళ్ళున్నవి. ఎనిసార్లు మా పొరుగిండ్లవారు వాని యింటికిఁ బోయిరి. ఆ కత్తుల యునికి యెవ్వరికిని తెలియదు. ఆ డాళ్ళ యునికియుఁ దెలియదు. పదిమంది మల్లురును లోనఁ బ్రవేశించిరి. అతఁడు కత్తిఁబూని యెదురు తిరిగెనట. వీరు కలియఁబడి బాహుయుద్ధము చేయఁగలుగుదురుగాని కత్తియుద్ధము వారికి తెలియదు. అతని ఖడ్గవిద్యా నైపుణ్యము ముందు వీరు నిశ్శక్తులై నిలిచిపోయిరట. ఏమి చేయుదురు? ఆ తొలుతఁటి యాశ్చర్యరేఖ మలఁగినంత వారిలో నొకనికి తనకు కత్తివిద్య వచ్చునని స్మృతికి తగిలినదట. వాఁ డచటనున్న మఱియొక ఖడ్గమును

తీసికొని వానిని తలఁబడెను. ఆ జయద్రథుఁడు వానిని రెండు ముక్కలుగా ఖండించెను. తక్కిన తొమ్మండుగురు మోటుగా వానిపై నొక్కసారి దుమికిరి. ఇద్దఱి ముగ్గుఱికిఁ గాయములు తగిలెను. కాని తక్కినవారు వానినిఁ బట్టికొనిరి. పెడఱెక్కలు విఱిచి కట్టిరి. అప్పుడు జయద్రథుఁ డిట్లనాఁడట. ఓరీ! మీ రదృష్టవంతులు. ఇది చిన్నగది యైపోయినది. లేనిచో మిమ్మందఱను నా కత్తికి బలివెట్టియుందును. నేనే తప్పు చేసితిని; నేను మీరు పిలిచినప్పుడు బయటకు రావలసినది. అయినను నాకు వేఱే ప్రయోజన మున్నది." అన్నాఁడట. ఆ మాటలు వారెవ్వరికి నర్థముకాలేదు. తరువాత వా డి ట్లన్నాఁడని వీరు చెప్పికొనుటయేతప్ప ఆ కోపములో వానిని విఱుగఁబొడిచిరి. మఱునాఁటి ప్రొద్దున వాని శవముఁ జూచిన వారికి భీముఁడు కీచకుని శవమునట్లు మెదిపియుండు ననిపించి నది. ఓయమ్మా! యమృతవల్లీ! ఈ సంగతులు మాపేటలో నందఱికిఁ దెలియును. జయద్రథుని చంపినవా రెవరని రాజ భటులు వచ్చి యడుగఁగా నిచ్చట నెవ్వరికినిఁ దెలియదు. ఈ రీతిగా జయద్రథుఁడు వధింపఁబడెను. మఱి యింకొక్క టి జరిగెడిదే. వాని యిల్లు విసురుని యింటి నానుకొనియున్నది. అందుచేత వాని యింటికి నిప్పు ముట్టించలేదు. పైనున్న కప్పంతయుఁ దీసివేయఁబడినది. వాసములు విఱువఁబడినవి. దూలములు పగులఁద్రోయఁబడినవి. వారు మల్లురు. వాఁ డొక్కొ క్కఁడు తన్ని తలుపులు విఱుగఁగొట్టెనుకాబోలు, గోడలు పడఁద్రోసెను కాబోలు. అమృతవల్లి ఇంత జరుగుచుండఁగా నిరుగు పొరుగువా రెవరు మేల్కొనలేదా ? బయటకు వచ్చి

చూడలేదా ? అని యడిగెను. అతఁడిట్లు చెప్పెను. అమ్మా ! ఈ జయద్రథుని విషయము కొన్ని యేండ్లుగా లీలగా మా యందఱకుఁ దెలియును. నిజమో కాదో తెలియదు. ఆ జయద్రథుఁడు భూతవైద్యుఁడు. వాఁడు దయ్యాలపోతు. వానినిఁ గుఱించి చాలకథ లున్నవి. వీరునిచూచి చాలమంది యూరకుందురు. వానిని గుఱించి నిశ్చయముగా నిదియని చెప్పుట కెప్పుడును వీలు కలుగలేదు. మఱియు నీ మురారి కూతురు విషయము వాని యింటి నీరీతిగా నాశనముచేయక మున్న పది పదేను దినములుగా నింటింటఁ జెప్పికొనుచునే యున్నారు. ఈ వార్తలు బయలుదేరినంతనే పురాణ సందేహము లన్నియు నిశ్చయములైనవి. అతనినిఁ జూచి యందఱము భయపడ నారంభించితిమి. ఆ సంగతి ఈ పేటకందఱికి మిక్కిలి ప్రియముగా నున్నది. అదికాక బయటికి వచ్చినచో నామల్లు రేమి చేసిపోవుదురో యన్న భయముకూడ కలదు'' అనఁగా నమృతవల్లి యతఁడు భూతవైద్యుఁడని దయ్యాలపోతని మంత్రగాఁడని చెప్పితిరి. వానినిఁ గుఱించి కథలేమైన చెప్పఁగలరా? యనెను. అతఁడు 'చాలయున్నవి. ఇప్పుడు మొదలుపెట్టినచో తేల'వనెను. మఱల వత్తునని యమృతవల్లి వెడలిపోయెను. ఆమె మనస్సులో నొక్క వాక్య మాడుచుండెను. 'నాకు వేఱే ప్రయోజన మున్నది' ఆ ప్రయోజన మేమి ? కాలంజరి యిల్లు తగులఁబడిపోయెను. ఆమె మగఁడు పది దినములు వచ్చుటకు వీలులేకపోయెను. ఆమె ఏమైనది ? ఎట్టి స్థితిలో నున్నది ? ఎక్కడ నున్నది ? అమృతవల్లికి వాని మంత్రశక్తులు వాని భూతవైద్యపు కథలు వినవలయునని

యెంత యున్నను వచ్చి మఱల నెప్పుడైన వినవచ్చునని యుంచు కాలజ్ఞానము విషయము తెలిసికొనవలయునన్న వాంఛ యధికముగా నుండెను. దీని కొక్కటే మార్గము గలదు. కాలంజరిభర్తకనిపించినచో నీవిషయము తెలియును. అతని నీమె యెఱుఁగనే యెఱుఁగదు. వాఁడెవఁడు? ఎక్కడ నుండును? అతఁడు బిచ్చమెత్తుకొనుచుండును. ఈ యూరని చెప్పుటకు వీలులేదు. మఱియు నిప్పుడు భార్యావియోగ దుఃఖితుఁడై యొకచోట నుండునని చెప్పుటకు వీలులేదు. వానిని పట్టుకొనుట యెట్లు? తన చేతిలో నెవరున్నారు? కాలంజరి యింటికిఁ బోవుటకు శకటము యాచించుటకే తా నంత మొగమోటము పడెను. ఇట్టి ప్రయత్నమునకు పలుమంది భటులను పది యూళ్ళకుఁ బంపించి వెదుకవలసిన దానికిఁ దానెట్లు సమర్థురాలగును? నిజముగా నాలోచించి నచో నీ పనియంతయు తనది కాదు. ఇది నిజముగా వాసుదేవుని పని. ఆ కాలజ్ఞానపు పాటలో వాసుదేవునిఁ గుఱించి యేదియో యుండి యుండును. ఆయన కేమైన నాపద వచ్చునా? ఆయన కాపద వచ్చినచోఁ దాను సహించఁ గలదా? వాసుదేవున కాపద వచ్చినచోఁ దా నేల సహించ లేదు? అతనికినిఁ దనకు నేమి సంబంధము? అతని కూతురును దానును సహాధ్యాయినులు. అంతమాత్రమునకు వాసుదేవునిమీఁదఁ దనకింత యనురాగమో, గౌరవమో, యాయనయొక్క భవిష్యత్తునుఁగూర్చి పట్టరానంత విచారణమో యెందు కుండవలయును? ఎంతమంది సహాధ్యాయినులుండరు? అందఱి పెండ్లిండ్లకు తాను పోయి పెత్తనము

చేయునా? అన్నియును నెత్తిన వేసికొని యీదునా? శ్రీమాలియందు తనకుఁగల ప్రేమ వట్టి సహాధ్యాయినియందు కలది మాత్రమేనా? ఆమె తండ్రియైన వాసుదేవునియందు తనకుఁ గలిగిన యేదో గౌరవము, ఏదో భావము, ఏదో చిత్తము నందలి యార్ద్రత శ్రీమాలియందు వ్యాపించెనా? శ్రీమాలియందు తనకుఁగల యార్ద్రతయే తొలుత వాసుదేవు నియం దభివ్యాపించెను. ఇప్పుడు వాసుదేవునియందుఁ గల యార్ద్రత శ్రీమాలియందువ్యాపించుచుండెను. ముందువచ్చిన చెవులకంటె వెనుక వచ్చిన కొమ్ములు వాడి యన్నట్లున్నది. తనకుఁ దెలియకుండ నమృతవల్లి గుండెలో నొక భయరేఖ సన్నగా తారాడు చుండెను. మనస్సున కెన్నియో తెలి యును. ఎచ్చటనో మనస్సునకు లోఁబొరలలో తెలియును. అవి యన్నియు మనస్సుయొక్క పైపొరలకు రావు. రప్పిం చుకోలేము. రప్పించుకొనుటకు భయపడుదుము. మనస్సు యొక్క పై పొరకు వాక్కునకు పెద్ద యెడములేదు. ఒక భావము మనస్సుయొక్క పైపొరకు వచ్చినదనఁగా వాగ్రూ పముఁ దాల్చినదన్నమాటే. ఈయంతరాంతరములందలి లీలగా రేఖామాత్రముగానున్న భయములనుఁగూర్చి నిశ్చయముగా నిశ్చలముగా వానిని తెలిసికొనవలయునన్న ప్రయత్నముతో భావించినఁగాని వానికిఁ విస్పష్టత కలుగదు. విస్పష్టత కలు గుట యనఁగా ననుచ్చరితమైన స్థితిలో నున్నను వాగ్రూ పము వచ్చినట్లే. అప్పుడే మనకు సరిగాఁ దెలిసినట్లు. ఈ యంతరాంతరములందున్న భయమును అమృతవల్లి యనుభ వించుచున్నది. ఆ భయస్వరూప మెట్టిదో తెలిసికొనుటకు

తీవ్రముగా నాలోచింప నారంభించెను. తదాలోచనా స్వరూప మిట్లు భాసించినది. ఈ జయద్రథుఁడు, వీఁడెవఁడో చండప్రచండుఁడు. వీఁడు కాలంజరిని వశముచేసికొన్నాఁడు. ఆమెను వశముచేసికొనుటకు నైదాఱేండ్లుగాఁ బ్రయత్నించు చున్నాఁడు. శ్రీమాలి యనిన తీవ్రమైన మాటలచేతఁ గాలంజరికిఁ గోపము వచ్చినది. ఆ యెడముఁజూచికొని వాఁ డామె మనస్సులోఁ బ్రవేశించినాఁడు. అనఁగా జయద్రథుని లోనున్న జీవుఁడు సామాన్య మానవులలో నుండెడి జీవుని వంటివాఁడుకాఁడు. వాఁడు శరీరానపేక్షముగా భాసింపఁ గలవాఁడు. శక్తిని ప్రదర్శింపఁగలవాఁడు. ఒక విధమైన స్వాతంత్ర్యమును గడించినవాఁడు. వాఁడీజన్మలోని వాఁడు కాఁడు. బహుజన్మలయందుఁ దానొక తీవ్రభావముతోఁ బ్రవర్తించుచుండి యా తీవ్రభావమునకు తాను వహించు చున్న శరీరములకంటె నతిశయించిన ప్రత్యేకతగలిగిన యొక వైశిష్ట్యమును సంపాదించి కొన్నవాఁడు. సామాన్య జీవు లందఱు తాము ధరించిన దేహములతోఁ దాదాత్మ్యముపొందు దురు. ఆశరీరములే తామనుకొందురు. ఆ శరీరముతోడనే తాము పొందెడి సుఖదుఃఖములుపొందుట కలుగుననుకొందురు. ఇట్టి వైపరీత్యము సంపాదించిన జీవునకు తాత్కాలికమైన శరీరము తృణప్రాయము. వాఁడు సులభముగా నింకొక శరీరమును గ్రహించఁగలఁడు. అల్పశక్తులైన జీవులమీఁద నధికారము చేయఁగలఁడు. వారినిఁ దొలఁగించి తానే వారి స్థానము నాక్రమించఁగలఁడు. అట్టివాఁడు జయద్రథుఁడు. ఈ జయద్రథుఁడు చిన్నప్పటినుండియు నిట్టివాఁడేనా? కడ

చిన కొన్నియేండ్లనుండి యీ శక్తులను సంపాదించెనా? చిన్నప్పటినుండి యిట్టివాఁడైనచో నీ దృక్ప్రతిభా సంపన్నుఁడైనచో నిన్నాళ్లేల యూరకుండును? తానతని నైదాఱేండ్లనుండి యెఱుఁగును. తాను వానినిఁగూర్చి కడచిన నాలుగేండ్లనుండియే కొంత యాలోచన చేయనారంభించెను. అప్పటినుండి యతనిలో నొక వైపరీత్యము లీలగానున్నదని తెలిసికొనెను. కాని ఇంత పరిపక్వస్థితిలో నీ లక్షణమున్నట్లు తెలియలేదు. ఆమె వెంటనే విదురునియింటికిఁ బోయెను. విదురుఁడామెను చూచెను. "ఏమమ్మా! ఇంక నింటికిఁ బోలేదా? ప్రొద్దునవే వచ్చితివి. ఇప్పుడు రెండుజాములు దాటినది. భోజనము చేసితివా? లేదా? తల్లీ! నా యింటిలో భోజనము చేయుదువా? మాది పేదయిల్లు, మీరాగర్భ శ్రీమంతులు. నీకు మాతిండి రుచించునో రుచించదో? వేళతప్పి భోజనము చేసినచో నారోగ్యము చెడిపోవును. ఆరోగ్యమును నిలఁబెట్టి కొనుటకు తొలుతఁ జేయవలసినపని వేళకు భోజనము చేయుట. ఒక కథ యున్నది. ఒక రాజు కలఁడు. ఆరాజు భార్యవెంట నొక యవనపువైద్యుఁడు వచ్చెను. ఆతఁడు మహావైద్యుఁడు. రాజునకు జబ్బుచేసినచో తన వైద్యము నందలి ప్రావీణ్యము రాజునకు మెఱయించి ప్రశంస పొందవలయునని యతనియూహ. అడఁ జెన్నియేండ్లున్నను రాజునకు వ్యాధియే కలుగలేదు. దానికిఁ గారణము నతఁడు విచారించఁగా నతఁడు వేళకు భోజనము చేయునని తెలిసెను. ఒక్క లిప్తకాలముకూడ నటు నిటు కారాదు. అంత సరి

మైనవేళ కతఁడు భోజనము చేయునట. ఆరాజునకు జబ్బు చేయవలసినచోఁ దాను వైద్యము చేయవలసినచో నొక్క-పూటనైనను వాని సవేళాభోజన నియమమును చెడఁగొట్ట వలయునని రాజునకు ప్రతిదినము నభ్యంగనముసేయు మంగలితో కుట్రపన్ని యానాఁడు తలగడుగువేళ నంగమర్దనము నందు నాలస్యము చేయించెను. రాజునకు భోజనవేళ యయ్యెను. తలంటిలో సగముకాలేదు. అతని యొడలికి నలుగుపెట్టవలయునని సున్నిపిండి కలిపి దాసీజన మచ్చట పెట్టిరి. ఆరాజు వేళ దాటిపోకుండ నాసున్నిపిండిని తినెనట. వైద్యుఁ డాశించిన వ్యాధి రాలేదు. అందుచేత తల్లీ! వేళకు భోజనము చేసితీరవలయును. ఏదోతిండి నాయింటిలో తినుము. రాత్రికి మఱల మీయింటిలో రాజభోజనము చేయవచ్చును." అనఁగా నమృతవల్లి మనసులో నిట్లనుకొనెను. ఓయి విదురుఁడు తాతా! నీవును జయద్రథుఁడును సోదరులా! అచ్చముగా సోదరులు కాకపోయినను సౌదర్య మధికముగా భాసించు దగ్గఱి బంధువులా? అతఁ డట్టివాఁడా? నీవిట్టివాఁడవా? - అనుకొని యిట్లనెను. "తాతా! అది యట్లుంచుము. జయద్రథుఁడు తాతనుఁగూర్చి వందమాటలు విన్నాము. కాని నాకొక యనుమాన మున్నది. ఆయన చిన్నప్పటినుండియు నిట్టివాఁడా? లేదా యే వైద్యాఁడేంద్ల క్రిందనో మాఱినాఁడా? ఈసంగతి నిన్నుఁ గనుఁగొనవలయునని వచ్చితిని." విదురుఁ డాశ్చర్యపడెను. "నీ కీ యూహ యెట్లు వచ్చినదమ్మా? నీ వెంత యూహాశాలినివి. ఈమాట యడిగినవారే లేరే? చిత్రముగానున్నది. అవునమ్మా! అవును.

అతని కెనిమిదేండ్లక్రింద నొక పెద్దవ్యాధి వచ్చినది. చని పోయినాఁ డనుకొన్నాము. క్రిందఁబెట్టితిమి. ప్రాణములు పోయినవి. కాని యాప్రాణములు పోయినవో లేవో మాకు తెలియలేదు. కొంతసేపటికి–కొంతసేపటి కనుటకు వీలులేదు. చాలసేపటికి–చనిపోయినాఁడని నిశ్చయమైన తరువాత బ్రతికెను. అది నీకెట్లు తెలిసెను.” అనఁగా నమృతవల్లియిట్లడిగెను. “తాతా! తత్పూర్వమున తమ్ముని ప్రవర్తనలో తరువాతనైన యతని ప్రవర్తనలో భేదము విస్పష్టముగా నున్నదా? అనఁగా మఱియు నిర్దిష్టముగా నడుగుదును. పూర్వ మతని నడకకు తరువాత నతని నడకకు పూర్వమందలి యతనిమాటపాటునకు తరువాతి మాటపాటునకు నడువఁగా, మాటాడఁగా చూడఁగా తత్పూర్వమునందలి వాని శరీరావయవముల చాలనము నందలి లక్షణమునకు తరువాతి లక్షణమునకు నేమైన భేద మున్నదా! దానిని మీరు బరిశీలించితిరా? ఆ భేదమును గుర్తించితిరా?” అనఁగా విదురుఁడు కూర్చున్నవాఁడు లేచి నిలుచుండి యమృతవల్లి వద్దకు వచ్చి యామె రెండు బుగ్గలమీఁదఁ జేతులునైచి యవధిలేని ప్రేమతో, గౌరవముతో, నాశ్చర్యముతో, సంభావనా దృక్కులతో స్పృశించెను. విదురుఁడు కూర్చున్నచోటినుండి లేచుట తొల్లి యమృతవల్లి యెఱుఁగదు. విదురుఁ డనెనుగదా? “తల్లీ! ఆసంగతి యెవ్వరికిని తెలియలేదు. నాకుఁ దెలిసెను. నే నెవ్వరితోడను చెప్పలేదు. మఱల బ్రతికినది మా జయద్రథుఁడు కాఁడు. ఇంకెవ్వఁడో జీవుఁడువచ్చి వానియందుఁ బ్రవేశించెను. నేను చెప్పుట యెందులకని యూరకుంటిని.

నీ వడిగితివి.'' అనఁగా నమృతవల్లి యిట్లనెను. తాతా! మఱియొక్క మాటకూడ చెప్పుము. ఈ జయద్రథుఁడు సామాన్య కుటుంబములో పుట్టెను. నీవలెనే పెరిగెను అనేకములైన శూద్ర కుటుంబములలోనివారు సేనలో చేరుదురు. వారికి ఖడ్గవిద్య వచ్చును. ధనుర్విద్య వచ్చును. బల్లెములతోఁ బొడుచుట చేతనగును. ఈ విద్యలయందు వారు సైన్యములోచేరి శిక్షితు లగుదురు. ఉత్తమ శూద్రకులములయందు కుటుంబములయందున్న పలుమంది మహావీరులై యుందురు. సేనానులై యుందురు. మీ కుటుంబములో నాకట్టి చిహ్నము కనిపించలేదు. మీరు దొలినాఁడు పొలములు దున్నుకొని అచట సాగక రాజధానికి పట్టిన, మర్యాద గల కుటుంబముగా నేననుకొందును, మీ జయద్రథుఁడు గూడ నట్టివాఁడేనా? లేక కొన్నాళ్లు సైన్యములో పని చేసెనా? అని యడుగఁగా విదురుఁడు "వాఁడును నావంటి వాఁడే; ఎన్నడు సైన్యములోఁ బనిచేయలేదు." అనెను. అమృతవల్లి:- అట్లైనచో నతని యింటిలో నన్ని ఖడ్గములేమి? అతఁ డొక్క మల్లుని నిముసములో రెండుగా నరకుట యేమి? గుంపుగా మీఁదఁబడిన మల్లురకు పెద్ద గాయములు తగులుట యేమి? ఈ విద్య యతని కెట్లువచ్చెను? విదురుఁడు:— నాకునుఁ దెలియదమ్మా! ఈ వార్త విన్నప్పుడు నేను నాశ్చర్యపోయితిని. ఏదో గ్రుడ్డివేటుగా కొట్టఁగా నొకఁడు చనిపోవచ్చును. కాని యతని యింటిలో నీ ఖడ్గములు డాల్లు నెట్లు వచ్చెనని నాకు సందేహము కలిగెను. నీకు నా సందేహమే కలిగెను. అనఁగా నమృతవల్లి యిట్లనెను. తాతా!

నీకొక రహస్యము చెప్పుదును. అయినను నీకు చెప్పుట యెందులకు? చెప్పినందువలన ప్రయోజనమేమి? నీయందు నాకుఁగల గౌరవము వెలయించికొనుటకుఁ జెప్పవలయునే కాని వేఱ చెప్పవలసిన యవసరము లేదు. అని యమృతవల్లి కాదు చెప్పుమని యతఁడడుగునేమోయని యెదురుచూచెను. విదురుఁ డడుగలేదు. అవ్వ నతని కేమిపట్టినది? ఎదురు చూచుటయే తప్పనియు, నది విదురుని విషయములో సందేహపడుట యనియు నామె యనుకొనెను. అనుకొని యిట్లడిగెను. "తాతా! కాలజ్ఞానము చెప్పుదురట. నీకుఁ దెలియునా?"యనఁగా విదురుఁడు తెలియకేమితల్లీ! నీ కేమి తెలియును. నీ కేమి కావలయును? అమృత:- నీవు చెప్పఁ గలవా? విదురుఁడు:- నేను చెప్పలేను. అమృత:- చెప్పెడి వారి నెవరినైన నెఱుఁగుదువా? విదురుఁడు:- తల్లీ! కాలజ్ఞాన మనఁగా నేమియును లేదు. కొందఱు వానినిఁ గూర్చిన పాటలను పాడుచు బిచ్చమెత్తుకొందురు. కొందఱు బైరాగులు తాము కాలజ్ఞానమును చెప్పుదుమని కూర్చుండి భిక్షా వృత్తి నవలంబింతురు. ఈ కాలజ్ఞానమనఁగా పూర్వము మన దేశముఁ బాలించిన రాజవంశములును, భిన్నవంశముల యందలి రాజుల పేర్లును. రాజ్యము లెట్లు మాఱినవియును మొదలైన కథ. ఈ కథలకు జోడించి ముందు రాజ్యము లెట్లు మారును? ఏరాజ వంశముపోయి యేరాజవంశము వచ్చును. ఒక రాజవంశము మాఱుటకు నేవిప్లవము జరుగును, మొదలైన కథల నల్లి చెప్పుచుందురు. వానినన్నిం టిని విశ్వసించుటకు వీలులేదు. కొన్ని నిజము లగును. ఈ

పాటలు కొందఱు బ్రాహ్మణులు వ్రాయుదురు. వానిని ప్రచారములోఁ బెట్టుదురు. దీనిపేరు కాలజ్ఞానము. అమృత:- పూర్వము జరిగిన రాజవంశములమాట సరియే, యొప్పి కొందుము. భవిష్యత్కథ యంతయు నా పాటలు వ్రాసిన బ్రాహ్మణులు కల్పించినవేనా? అట్లు కల్పించుటవలన వారికేమి ప్రయోజనము? విదురుఁడు:- అన్నియు వారచ్చ ముగాఁ గల్పింపరు. కొన్ని కల్పింతురు. మూలగ్రంథములో నున్న వానితోపాటు వీరు కొన్ని జోడించి పాటలు వ్రాయు దురు. ప్రజలకు విన నింపుగా నుండుటకు నాశ్చర్యము కలిగించుటకు నీ పాటలు వ్రాసిన సామాన్య బ్రాహ్మణులు కొన్నిఁటినిఁ గల్పింతురు. అమృత:- అనఁగా వీరు కల్పించని భాగము భవిష్యత్తును గుఱించి యెవరో చెప్పిన దున్నదన్న మాట. అది యెక్కడ నున్నది? దాని నెవరు వ్రాసిరి? విదురుఁడు:- తల్లీ! నీవు నావద్దకు నాఱేండ్లనుండి వచ్చు చుంటివి. నీవింత తెలివికల పిల్లవని నే నెఱుఁగను. అందఱు బాలికలవంటిదానవే యనుకొంటిని. నీకు పదునేను పదునాఱేండ్లకన్న నెక్కువ వయసుండదు. నీవు బ్రతికి బట్ట కట్టినచో నీవు రాజ్యములు పాలించుటకు యోగ్యమైన ప్రతిభగలదానవు. నీవొక మహారాజునకు భార్యవు కాఁదగిన దానవు. అతఁడు రాజ్యమునందలి ప్రతివిషయము నిన్నడిగి రాజ్యము చేసికొన్నచో వాని రాజ్యమునకు చేటురాదు అందఱు రాజులు కాలజ్ఞానమును తెలిసికొని ప్రవర్తించ వలయును. కాలజ్ఞానము వారి రాజనీతిలో నొకభాగముగా నుండవలయును. కాలజ్ఞాన మనఁగా రాజవంశముల చరిత్ర.

పురాణములని విన్నావుగదా, అమృత:-విన్నాను. విదురుఁడు:- పురాణములెన్ని? అమృత:- పదునెనిమిది. విదురుఁడు:- వానిని వ్రాసినదెవరు? అమృత:- భగవంతుఁడైన వ్యాసుఁడు. విదురుఁడు:- నీ వేపురాణము నెఱుఁగుదువు? అమృత:-భాగవతము నెఱుఁగుదును. పురాణము చెప్పఁగా కొన్నిచోట్ల విన్నాను. విదురుఁడు:-పురాణమనఁగా నేమి? అమృత:-అదియొక గ్రంథము. భగవంతుఁడైన శ్రీవిష్ణువు యొక్క లీలలు దానియం దభివర్ణింపఁబడి యుండును. దశావతారములనుఁగూర్చి యుండును. విదురుఁడు:- (నవ్వి) ఇవి యెక్కువగా భాగవతమునందే యుండును. తక్కిన పురాణము లిట్లుండవు. పురాణ మైదులక్షణములు కలది. 'పురాణం పంచలక్షణం' అని. అన్నిపురాణములయందు నీయైదు లక్షణము లుండును. మొదటిది సృష్టి. రెండవది అనుసృష్టి. మూఁడవది రాజవంశముల చరిత్రము. నాల్గవది మన్వంతరములయందలి కథలు. ఐదవది అనువంశ చరిత్రము. అనువంశ చరిత్రమనఁగా కృత త్రేతాయుగములయందలి రాజవంశముల ననుసరించి తరువాత తరువాత పుట్టిన రాజవంశములయొక్క కథలు. మన మగధరాజ్య మున్నది. పూర్వము నందు మన గిరివ్రజపురము రాజధానిగా నుపరిచరవసువు పాలించెను. ఆయన వంశమునకు 'బార్హద్రథవంశ'మని పేరు. ఇది యనువంశమే. తరువాత తరువాత కలి ప్రవేశింపఁగా వానివంశముపోయి మఱికొన్ని వంశములు వచ్చినవి. ఈకథలు అనువంశకథ లందురు. అన్నిపురాణములలో నీయైదులక్షణము లుండును. అందుచేత నీ కాలజ్ఞానమన్న

దానికి మూలమైన విషయము పురాణములు. అమృత:—ఈ సంగతి భాగవతములోఁగూడ నుండునా? విదురుఁడు:— ఉన్నది. భాగవతముకంటె నీ విషయము మత్స్యపురాణములో, వాయుపురాణములో నెక్కువగా నుండునని మా గురువుగారు చెప్పినారు. భవిష్యపురాణమని యింకొకటి కలదట. అందులో నెక్కువగా కలియుగమునందలి రాజ వంశములనుఁగూర్చియే యుండునట. ఆ గ్రంథములు దొరకవు. వేదములను, శాస్త్రములను, బ్రాహ్మణులు కంఠతః గ్రహింతురు. పురాణములను గ్రహించరు. తొలుత వ్యాస భగవానుఁడు వానిని నిర్మించినపుడు కొందఱు శిష్యులకు చెప్పెను. వానివ్యాప్తి బ్రాహ్మణేతరులయందే కలదు. ఎక్కడో యొకచోట నొక్కొక్క రాజ్యములో నిద్దఱుముగ్గుఱు తప్ప వీని నెఱిఁగినవా రుండరు. వారివద్ద వీనిని గ్రహించికొందఱు పేదబ్రాహ్మణులు వానిని దేశభాషలలోఁబాటలుగా వ్రాసి బిచ్చగాండ్రకు చెప్పుదురు. కొందఱు బ్రాహ్మణు లీవృత్తిమీఁద బ్రదుకుదురు. వారి కీ పాటలు చెప్పి వారివద్దనుండి ధనము తీసికొందురు. అమృత:— మన కా భవిష్యపురాణ మెచ్చట లభించును? విదురుఁడు:— కోటలో నుండవలయును. నీవు చూచితివో లేదో నేనెప్పుడు కోటలోనికిఁ బోలేదు. నీవు కోటయొక్క లోపలిభాగము నెఱిఁగియుండవలయును. నీవొక యధికారి కుమార్తెవుకదా! ప్రతి దుర్గమునందును రాజుగారు కొలువుతీర్చు సావడి యుండును. ఆ చావడిముందు, జాము జామునకు గంటలుకొట్టు మొగసాలవద్దనో, కొందఱు వ్రాయసగాండ్రు కూర్చుండి భూర్జపత్రములమీఁదనో తాళ

పత్రములమీఁదనో కుంచెలతోడనో గంటములతోడనో యెప్పుడు నేదియో వ్రాయుచుందురు. ఆ వ్రాయఁబడుచున్న గ్రంథములలో పురాణములుకూడ నుండును. ఈ మనరాజు రాజ్యమునకు తచ్చినతరువాత నా గ్రంథములను వ్రాయించుట యందలి శ్రద్ధ తక్కువ యైనదని విన్నాను. అమృత:- అట్లనా? తాతా! నీ వింటివద్దఁ గూర్చుండి రాజధానిలోని సర్వవిషయములను గ్రహింతువు. విదురుఁడు:- ఏమమ్మా! నన్నుఁగూర్చికూడ సందేహించుచున్నావా! రాజనీతికి తల్లి-తోడు గూడ నుండదు. నేను తాతను. జయద్రథుఁడనుకాను. నాపేరు విదురుఁడు. నాకు నా తలిదండ్రులు పెట్టినపేరు వృథాగా పెట్టలేదు? అనఁగా నమృతవల్లి "తాతా! నేను నిన్ను ప్రశంసించుట కడిగితిని, గాని నీవనుకొన్నంత రాజనీతి నాకుఁ దెలియదు. నా తండ్రి మంత్రికాఁడు. ఒక చిన్న సామంత ప్రభువు. ఆయనకు నేనొక్కర్తుకనే కూతురను. నా తల్లితండ్రులు వృద్ధులు. నాకు రాజ్యములతో పనిలేదు. ఒకానొక నా ప్రేమస్థానమునందు నొక యాపత్తి కలుగునేమో యన్న భీతి నా గుండెలోఁ గలిగి యీ విచారణ చేయుచున్నాను. తాతా! జయద్రథుఁడు తాదృశుఁడగుట చేత నీవు తాదృశుఁడ వగుదువా? మఱియు నాకు రాజనీతితో నేమిపని? నన్ను క్షమించుము. నీవింతటి పండితుఁడవు. నీ వెవరి దగ్గఱ చదువుకొన్నావు? విదురుఁడు:-అసలు మా దీ యూరుకాదు. మాది యొక పల్లెటూరు. ఆయూరిలో నొక పండితుఁ డున్నాఁడు. ఆయన మాకందఱకు భారత భాగవతములు పురాణము చెప్పెడివాఁడు. నేను ప్రత్యేక

ముగా నాయనవద్దకుపోయి పలువిషయములు తెలిసికొన్నాను. నాకు పురాణ కథలమీఁద వేదాంతములమీఁద నున్నంత యభిలాష పొలము దున్నుకొనుటమీఁద లేకపోయినది. జయద్రథుఁడు నాకంటె సోమరి. నా సోమరితనము పని పాటలయందేకాని గొప్ప విషయములు తెలిసికొనవలయు నన్నదాని యందు లేదు. జయద్రథుఁడు రెంటియందును సోమరి. మేము మా పొలమును పాడుచేసికొంటిమి. దాని దారి నది పోయెను. మేము రాజధాని నగరమునకుఁ జేరితిమి. ఇచట మేము చేసెడు వృత్తిలేదు. బ్రతుకుచున్నాము. ఎట్లు బ్రతుకుచున్నామో తెలియదు." అమృతవల్లి:- తాతా! నేను వెళివత్తు ననెను. విదురుఁడు మఱల నెప్పుడైన వచ్చి చూచిపో తల్లీ! యనెను. అమృతవల్లి నవ్వి నేను రాఁగలు గుదునో రాలేనో నాకు కాలజ్ఞానము లేదుకదా?' యనెను.

ఆనాఁటి సాయంకాలమున అమృతవల్లి రాచకొలువు సావడికివెళ్ళి యచ్చట నీ వ్రాయసగాండ్రు కలరేమోయని చూచెను. అచ్చటలేరు. ఎవరినో కనుగొనఁగా వారు మొగ సాలయందు వ్రాయుచుందురని చెప్పిరి. అచ్చటికిఁబోయెను. వ్రాయుచున్నవారు వందులు. మెడలలో జందెములు వేసి కొని శిఖలు ప్రక్కముడులు వేసికొని కనపడీ కనపడని పంగ నామములతో, కోలమొగములతో, కాలిదోవతులతో చెవు లలో నీక కలములను దోపికొని పత్రములను ముందువేసికొని కూర్చుండిరి. వారినిపోయి యమృతవల్లి 'అమ్మా! మీవద్ద మత్స్యపురాణము, వాయుపురాణము, భవిష్య పురాణము నున్నవా?' యని యడుగఁగా, వారు 'మత్స్య వాయుపురాణ

ములు లేవు. వానిని మన మహారాజు విదిశానగరమునకుఁ దరలించికొని పోయెను. భవిష్యత్పురాణ ముండ వలయును. చూతు'మని వారు భూర్జపత్రగ్రంథములను వెదకిరి. చాల సేపు వెదకి 'అమ్మా! ఈ యింటిలో నది కనిపించుటలేదు. రెండు మూఁడు దినములలో వెదకి మీకు తెలియఁజేతు' మనిరి. ఆమె యింటికి వచ్చెను. మఱియు కాలంజరిభర్తను వెదకించుట తనకొక ధర్మ మనుకొనెను. రేపు భవిష్యత్పురాణము దొరకును. అందులోఁ దనకుఁ గావలసిన సంగతులుండును. కాని కాలంజరి యేమైనట్లు? ఆమెభర్త యేమైనట్లు? అమృతవల్లి యీ యూహలయొత్తిడిచేత నితరములైన యూహల విరళత్వముచేత వాసుదేవుని సైనికులను బంట్లను తన పనిమీఁదఁ బంపించుటకు మొన్న నటుమొన్న సంశయించినట్లు నేఁడు సంశయించుటలేదు. రెండు దినములలో నామెలో నెంతయో మార్పువచ్చెను. ఆమె మనస్సు సముద్దీప్త మయ్యెను. సాహంకార మయ్యెను. సప్రశ్రయ మయ్యెను. విదురుఁ డామె మేధాలక్షణమును పొగడిన సన్నివేశమునుఁబట్టి యామెకుఁ దెలియకుండ నామె తాను రాజ్యాంగ విషయములనుఁగూర్చి నీతిజ్ఞులవలె నూహించఁగల ననుకొనుట తటస్థించెను. వాసుదేవుఁడు తనకు శకటమును సమకూర్చెను. ఆయననుఁ దానడుగలేదు. తన కిట్టి యవసర మున్నదని యూహయున్నదని వాసుదేవున కెట్లు తెలిసెను? వారి యిద్దఱియాత్మలు నంతకలసియున్నవా? ఈమె మనసులో నూహించిన యూహ యాతనికిఁ దెలియునా? ఇద్దఱి జీవలక్షణములయందు నంత సాజాత్యమున్నదా? తమయిద్దఱి

సంబంధ మెట్టిది ? ఇది యేమి చిత్రముగా నున్నది? తా నెవరు? ఆయన యెవరు? తన వయస్సేమి? ఆయన వయస్సేమి? తమ యిద్దఱినడుమ మైత్రియున్నదనుటకు వీలున్నదా ? మైత్రి యిద్దఱు పురుషులనడుమ నుండవచ్చును. ఇద్దఱు స్త్రీల నడుమ నుండవచ్చును. స్త్రీ పురుషులనడుమ నున్నభావము నకు మైత్రి యనవచ్చునా? ఏనుగుపాదములో లేడిపాద మిమిడి యున్నట్లు ప్రేమలో మైత్రి యున్నది. దానిని మైత్రియనుట మనము మనలను ప్రతారించుకొనుట. మైత్రికి మించిన భావ ములో మైత్రిపాళ్ళెందుకుండవు? రెండు నొకటే లక్షణము కల భావము లాయెను. అహంకారములో గర్వ మిమిడి యుండును. అట్లే స్త్రీ పురుషులు తమ నడుమ మైత్రి కల దనుకొనుట స్వయంప్రతారణము. మైత్రి యుండక యేమ గును? కొందఱు భార్యాభర్తల సంబంధములో మైత్రి లేనట్లు కనిపించును. మైత్రి లేకపోవుటలేదు. మైత్రియొక్క పాళ్ళు దృశ్యమానములుగా నుండును. కొందఱి నడుమగల మైత్రి బహిరాడంబరము కలిగియుండదు. చెట్టాపట్టాలు పట్టుకొని తిరుగదు. ఊరివెంట వాహ్యాళిపోరుఁ కాని వారి కొకరియం దొకరికి గాఢమైన మైత్రి యుండదు. వ్యవహా రము వచ్చినచో నీ మిత్రుల మనుకొనువారు పరస్పరము సాహాయ్యము చేసికొందురు. చేసికొనరు. ఆ మిత్రులు నిస్సందేహముగా నొకరికొకరు సాయపడుదురు. ఈ వెలికిఁ గనిపించు లౌకికపు మైత్రియే మైత్రియా? మైత్రీలక్షణములో దీనియం దెక్కువ యున్నవని యనుకొనుట వట్టి భ్రమకదా ! నిజమైన మైత్రి యిద్దఱు మానవులు తమ కాపదలైనయెడ

యొకళ్ళనొకళ్ళాదుకొనుట నైనచో భార్యాభర్తల నడుమ మైత్రిలేదనుట న్యాయముకాదు. మైత్రీశబ్దార్థమును చక్కఁగా గ్రహించుటకాదు. దానియొక్క లౌకిక బహిరాకారమునకుఁ బ్రాధాన్య మిచ్చుట కావచ్చును. ఇప్పుడు వాసుదేవునకు నమృతవల్లికి నడుమ మైత్రి యున్నదాలేదా? వారిది భార్యా భర్తృసంబంధమా? సీసీ! తాదృశమైనదా? కావచ్చును. అయినచోఁ దప్పేమి? ఒకానొక స్త్రీ యొకానొక పురుషుని మనసుతో భావించును. వానిని పెండ్లి యాడక పోవచ్చును. మఱియొకనినిఁ బెండ్లియాడవచ్చును. అప్పు డామె మనస్సుచేత వ్యభిచరించినదనవచ్చునా? అమృతవల్లి కాభావమునందు విశ్వాసము లేకపోయెను. స్త్రీపురుషుల నడిమి సంబంధ మెట్టిది? ఒక స్త్రీ జన్మించినది. ఒక పురుషుఁడు జన్మించినాఁడు. ఆ స్త్రీకి పురుషునియందు సృష్టి సహజమై యున్నది. ఆ పురుషునకు స్త్రీయందుఁ గోరిక యున్నది. ఇదియును సృష్టి సహజమైన విషయము. ఆ స్త్రీ కాని ఆ పురుషుఁడుకాని సహజమైన కోరికచేత నియమితులై లేరు. వారియొక్క నియతి వారు జన్మించిన దేశము వర్ణము వంశము, వారి సంపద మొదలైనవానిచేత నియమితమైనది. మఱియు జీవునియొక్క యిష్టానిష్టములచేతకూడ నియమిత మైనది. ఈ నియతి నొక్కొక్కప్పుడు విచిత్రమైన పరిస్థితులు పరిపాలించుచుండును. ఒక స్త్రీ యెవ్వనియందును కోరికతో నుండదు. స్త్రీ సహజమైన వాంఛ యామెయందున్న స్త్రీత్వము నాశ్రయించి యుండును. దానికి బహిరాగతిలేదు. ఒకప్పుడొక పరిస్థితి జరుగును. ఒక పురుషునిఁ గలిసి

కొనుట సంభవించును. వాని చమత్కృతిమత్సంభాషణ చేత నీమెయాత్మ సమాకృష్టము కావచ్చును. ఒకని పౌరుషమో, దయాగుణమో, పాండిత్యమో, సౌందర్యమో హఠాత్సంగతములై యామెలో నాకోర్కినిఁ గలిగించవచ్చును. పురుషగతమైన స్త్రీయొక్క వాంఛయు, స్త్రీగతమైన పురుష వాంఛయు నిట్లవ్యవస్థితములై యనియతప్రసారములై యుండుచుండును. కాని తనదేశము తనవర్ణము తనకుటుంబ గౌరవమునకు తగిన కుటుంబగౌరవము తన సంపత్తికి తగిన సంపత్తి మొదలైన బహిర్విషయములయందు భారతదేశ వివాహము లగ్నమై యున్నది. ఇది న్యాయ్యమా? స్వేచ్ఛ నాటంకపఱచుటకాదా? అయినచో పురుషులు దీని నిట్లేల దుకు తీర్మానించిరి. ఇట్లూహించినచో నెట్లుండును? జన్మతః స్త్రీపురుషులకు స్వేతరులయందు వాంఛకలదు. దాని పరి ణాహ మింతయని చెప్పుటకు వీలులేదు. సర్వమును గ్రసించు టకు సాధ్యముకాదు. అందుచేత నొక నియమ ముండవల యును. నియమ మనుటతోడనే - దేనికున్నది? సత్ఫలితము కలుగుట కున్నది. అందుచేత నీ నియమములు సర్వదా సముపాదేయములు. అయినచో నొకవేళ నమృతవల్లి యొక్క మనోభావము వాసుదేవునియందు తద్విషయకమైన దైనచో నిచ్చట రెండు విపరీతలక్షణములు కలవు. తమ యిద్దఱికి వయస్సామ్యములేదు. మఱియు నతఁడు పూర్వమే వివాహితుఁడు. ఈ రెండు నియమములయొక్క సముల్లంఘ నము పూర్వము వేయిచోట్ల జరిగినది. జరిగినట్లు పురాణ కథ లున్నవి. కాని లోకమానందు వీనియం దెప్పటికప్పుడు

క్రొత్తగా నుండునేలొకో? రాజులైనచోఁ జేసికొనవచ్చును. వాసుదేవుఁడు రాజుకాఁడు. మొన్న విదురుఁడు చమత్కారముగా నన్నాఁడు. 'నీవేరాజునకైన భార్యవైనచో నతని రాజ్యము నెంతచక్కఁగాఁ దీర్చిపెట్టెదవు' అనిరి తాను వాసుదేవునిఁ బెండ్లియాడుదునన్నచోఁ దన తలిదండ్రులు మొదట కాదన్నను తన యిష్టమున కెదురుపోరు. కనుక వారితో వచ్చిన యిబ్బందిలేదు. భూమిమిత్రుఁ డంగీకరించునా? ఈనడుమఁ దనయందు కొంతమర్యాదగా నతఁడు ప్రవర్తించుచుండెను. తన కెక్కడనో మనస్సులో నొక యనుమాన ముండెను. అతనికిఁ దనమీఁద నీ వైమనస్యముండుటకుఁ దనతండ్రి తన్ను ప్రేమించుచుండె నని. ఆప్రేమకుఁ దానేమో యనుకూలముగాఁ బ్రవర్తించు చున్నానని యతఁ డనుకొని యుండవచ్చును. అందుచేత నతనికిఁ దనయందు నట్లుండెను. ఇప్పుడు తన చెల్లెలి వివాహ సందర్భములో వారి యింటిలో తాను స్వతంత్రముగాఁ దిరిగిననాళ్ళలోఁ దనతండ్రికి తనకు నేమియు సంబంధములేదని విస్పష్టముగాఁ దెలిసెను. అందుచేత నతఁడు ప్రసన్నుఁడయ్యెను. ఇప్పుడీభావము తాను వెలయించినచో మఱల రెడ్డివచ్చి మొదలాడె నన్నట్లుండును. వాసుదేవునిభార్య యేమనుకొనును? తాను దుష్టురా లనుకొనును. ఇదియొక పదకము వేసికొని శ్రీమాలి యందలి చెలిమి నభినయించితి ననుకొనును. మఱియు వారిని వారినిఁ గూర్చి యాలోచించుచుండునే గాని వాసుదేవుఁ డేమనుకొనును. వాసుదేవునకు తనయం దట్టి భావ మున్నదని తా నెట్లనుకొనఁగలదు? వాసుదేవునిఁగూర్చి తానెప్పుడు

నిట్లూహించలేదే. ఆయనఁగూర్చి యిప్పు డీభావ మెట్లు వచ్చినది? తనకేమాశ్చర్యముగానున్నదే. అవివాహితయైన బాలిక కిట్టి యూహలు రావచ్చునా? తన యూహలు తన యదుపులో నుండవేమి? ఇది సైకి ననవలసినమాటయా? వాసుదేవుఁడు తనయందు కోరికను వెలయించునా? తాను పోయి చెప్పునా? ఈ రెండును జరుగునవి కావే. ఇది యెట్లు పరిణమించును? తన కర్థమగుటలేదు. పలుసార్లు వాసుదేవుని మాటలలో నీ యర్థము దూర దూరముగా భాసించినది. ఆయన తన భార్యయందు బద్ధవ్రతుఁడు. కొడుకునందు మహానురాగము కలవాఁడు. ఒక దురాశచేత తాడింపఁబడిన బుద్ధికలవాఁడు కాఁడు. దుర్వ్యసని కాఁడు. ఆయన తన యందు కోరికను కలిగించుకొనునా? కలిగినచో నియమించుకొనును గాని దానిని ప్రాచుర్యమునకు రానీయఁడు. ఇంతకు తనకు నిజముగా వాసుదేవునియందు నట్టి భావముకలదా? ఈవఱ కెప్పుడును తానిట్లూహించలేదు. తన మనస్సులోని కీభావమే రాలేదు. ఇప్పు డెందుకు వచ్చినది? అహో! మానవులకు వచ్చెడి యూహలు వారికి వారికే దెలియును గావున లోకము సాగుచున్నది గాని సర్వజనుల యూహలు సర్వేతరులకుఁ దెలియుటయేయున్నచో, నీసృష్టి, యీలోకము నిముసము సాగదు. ఎవ్వరికిని చెలిమి యుండదు. ఎవ్వరి నడుమ యుండదు. కుటుంబములు నిలువవు. సంఘ మాగదు. అందుచేత నమృతవల్లి రక్షింపఁబడెను. ఈ యూహ లామెకే తెలియును. వాసుదేవునకు వీని పొడయైన కల్పించదు. ఇట్టి యూహలు తనకు వచ్చినందుకు నమృతవల్లి సిగ్గుపడ నక్కఱ

లేదు. సిగ్గుపడలేదు. ఈ జీవలక్షణము విలక్షణమైనది. తనకుఁదా వచ్చిన యూహలయందు రమించుచుండును. ఆ యూహలు క్రియాదశలోనికి వచ్చినపుడు వానియందు సామంజస్యము లేకపోవచ్చును. లోకమునందలి మర్యాదకు వానికి సంబంధము లేకపోవచ్చును. మనస్సులోని రమణములో నీ యమర్యాదయు నీ యసామంజస్యములేవు. అది వట్టి రమణము. ఆ యూహ పాపపుటూహ యనవచ్చును. వానిని బుద్ధిమంతులు సన్మార్గులు పరలోక భావనానిత్యబుద్ధులు, నీతిపథ సదా ప్రవర్తకులు నియమించవచ్చును. నియమింతురు. నియమింపఁబడక పూర్వము వాని మనస్సు తదూహ యేల తెచ్చికొన్నది? అది రమణముయొక్క యొక త్రోవ అట్టి స్థితి తన మనస్సున కున్నది. తప్పేమి? తా నీయూహను వెలికి చెప్పదు. దీనికి క్రియాదశలేదు. పరిణామదశలేదు. వాసుదేవునకుఁ దెలియదు. భూమిమిత్రునకుఁ దెలియదు. భూమిమిత్రుని తల్లికిఁ దెలియదు. తన తల్లిదండ్రులకుఁ దెలియదు. తాను కన్యయై యవివాహితయై తనభర్త యితఁడని నిర్ణయింపఁబడకపూర్వము వేఱొక పురుషునిఁగూర్చి భావించుట పాపమా? పాపము కాకపోవచ్చును. తాను తరువాత మఱియొక పురుషునిఁ బెండ్లియాడినచో నిదిదోషము కావచ్చును. తాను పెండ్లియాడనే యాడదు. జీవితాంతము వాసుదేవుని భావించుచునే యుండును. భర్తయన్నయూహ వచ్చినచో వాసుదేవుఁడే యనుకొనును. వివాహము జరుగదు. సంసారము లేదు. - ఆ వాసుదేవునకుఁగూడ తెలియదు. అట్లను

దీనియందు దోషములేదుకదా! తనది తీవ్రమైన ప్రకృతి. నిజముగా తాను వేనినిఁ బెండ్లియాడరాదు. ఆసంగతి తనకే తెలియును. ఇది పరమరహస్యము. ఆజ్ఞక్రింద జయద్రథుఁడు తనకొక యుపదేశమును చేసెను. తా నా రహస్యము తెలిసికొనలేక నా యభ్యాసమును చేసెను. తరు వాత తరువాత తా నూహించఁగా నందందు రెండు మూఁడు కథలు వినఁగా తనకు తెలిసెను. ఆ జయద్రథుఁడు తన్ను కూడ కాలంజానివలెఁ జేయవలయు ననుకొన్నాఁడు. తన్నిం కొక విధముగాఁ జేసినాఁడు. నా ప్రకృతి యెవ్వారికిని లొంగని దని యతఁడు గ్రహించెను. అందుచేత నాపైన నీ పన్నా గము పన్ని నాఁడనుకొందును. నా మనస్సు నేను వివాహ మాడి సుఖపడఁదగిన వ్యక్తిమీఁద ప్రసరించకపోవుటకుఁగూడ నిదియే హేతువేమో! అది యట్లుంచి నా కిన్నాళ్ళవఱకు దీనినిఁగుఱించి యింత విస్పష్టముగా నూహించు సామర్థ్యము లేకపోయెను. ఈయూహ నా కింతవఱకు రూపుకట్టలేదు. ఇప్పుడు కట్టినది. ఒకటి నాకు నిశ్చయమైనది. నేనిన్నాళ్లను నాకుఁ దెలియకుండ వాసుదేవుని ప్రేమించుచున్నాను. అతఁడు నాకుభర్త. అతఁడు నాకు భర్తయన్న విషయము మఱెవ్వారికినిఁ దెలియరాదు. ఆయనకునుఁ దెలియరాదు. నే నతనినిఁ బెండ్లియాడుటకు వాని బహిఃపరిస్థితులు సాను కూలపడవు. నా యంతఃపరిస్థితి మిక్కిలి వ్యతిరేకమైనది. ఒక్క యేడాదినుండి నేను జయద్రథుఁడు చెప్పినపని చేయుట లేదు. అతఁ డుద్దేశించిన ఫలితము నాయందు సన్నిహితమై యున్నదా? లేనిచో మఱల నా యభ్యాసము నారంభింతును.

అది యట్లుంచి దాని ఫలితము నాయందెంత సన్నిహితమై యున్నదో తరువాత పరీక్షింతును. నేనింక వాసుదేవుని యింటిలో బెరుకులేకుండ నతనియాస్తిమీఁద సర్వాధికారము కలదానివలెఁ బ్రవర్తింతును. ఎవ్వరును కాదనెడివారు లేరు. వాసుదేవుఁడు కాదనఁడు. భూమిమిత్రుఁ డూరకుండును. వాసుదేవునిభార్య నాయందు మిక్కిలి యాదరభావము కలది. శ్రీమాలిని చూచినట్లే నన్ను చూచును. ఆయన విషయములో నేను స్వాతంత్ర్య మవలంబించుటకు వానియందు నాకుఁగల యీదృగ్భావము బలము నిచ్చుచున్నది. అతఁడు కాదన్నప్పటిమాట చూచుకొందము. ఒకవేళ నా యీ భావము లీలగా వాసుదేవునకుఁ దెలిసినచో నే మగును? అతఁ డూరకుండును. నేనుపోయి నాయంతట నేను వానితో నిన్నుఁ బ్రేమించుచున్నాను. నీవే నాకు భర్తవు. అని చెప్పుదునని యతఁ డనుకొనునా? అతఁ డట్లనుకొనఁడు. తనయందు నాకిట్టి భావము కలదని యతఁడు గ్రహించి నన్ను వశము చేసికొనుటకుఁ బ్రయత్నించునా? అట్లు ప్రయత్నించెడి ప్రకృతి యాయనవద్ద లేదు. నిజానకు నన్ను వశముచేసికొనుట కతఁడు ప్రయత్నించనక్కఱలేదు. ఇప్పుడు నాకు తెలియుచున్నది. మనసా నేనతనిని భర్తగా స్వీకరించితిని. ఇన్నాళ్ళుగా నా కీభావము చక్కగా రూపు కట్టలేదు. మఱియు దీనివలన నేమి ప్రయోజనము? ఈ సంఘటన మెంత విచిత్రముగా నున్నది? పరమేశ్వరుఁడు నీ కొకనియందు భర్తృభావము కలిగించినాఁడు. భర్తృ సంగమ సౌఖ్య మనుభవించుటకు వీలులేని యొక్క శరీరస్థితిని

పరిణమింపఁజేసినాడు. తత్పురుష సంగమమునకు వీలులేని బహిః పరిస్థితుల నేర్పాటు చేసినాఁడు. ఎంత చక్కఁగా పొసఁగించినాఁడు. గాలి ప్రోవుచేసి మూఁట కట్టినట్లున్నది. ఇచట భర్తృభావ మెందులకు? స్త్రీపురుషభావ మెందులకు? ఎందులకా? అట్టి భావముతో లోకమునందు ప్రవర్తించి కొన్ని సంఘటనలు సర్దుకొనుటకు. ఇప్పుడు తెలిసినది.

మఱునాఁడు ప్రొద్దున నమృతవల్లి వాసుదేవుని ఇంటికిఁబోయి నలుగురైదుగురు సైనికులనుఁబిలిచి కాలంజరి భర్తను వెదకుటకుఁ బంపించెను. చెప్పుటకు గుర్తులు లేవు. ఒక్కటే గుర్తు. అతఁడు కాలజ్ఞానపు పాటలు పాడుచు బిచ్చ మెత్తుకొనుచుండును. అతని కిరువదియేం డ్లుండ వచ్చును. ప్రస్తుత స్థితిలోఁ బిచ్చివాఁడుగా నుండవచ్చును. అతని నడుగవలయును. నీవేనా కాలంజరి భర్తవని. వాఁ డౌనన్నచో నా యీ గుర్తులు వాఁడు చెప్పవలయును. తమది గిరివ్రజపురమని తన భార్య పోదెలు చెప్పనని పది దినములు తానామెను చూచుటకు వెళ్లుటకు లేపోయినదని, ఒకనాఁడు పోఁగా తన ఇల్లు తగులఁబడిపోయినదని ఇంటిలో తన భార్య లేదని యీ గుర్తులు చెప్పవలయును. అట్లు చెప్పినవానిని వారు దీసికొని వచ్చినచోఁ దా నేమిచేయును? వానినిఁ దన యింట నుంచును. తరువాతఁ గాలంజరికొఱకు వెదకించును. సైనికులనుఁ బంపెను. వారు కాదనుటలేదు. అమృతవల్లి యాజ్ఞాపించఁగలదు. రెండు మూఁన్నాళ్ళకు నీ సంగతి వాసుదేవునకుఁ దెలిసెను. ఆయన యేమియు ననలేదు. భూమిమిత్రునకుఁగూడఁ దెలిసెను. ఎప్పుడు

నెవ్వరో పదిమంది సైనికులు విడతలు విడతలుగాఁ దమ యింటియందు పనిచేయు చుందురు. వారిలో నలుగురిని అమృతవల్లి తెచ్చుటకో పంపించినచో వచ్చిన నష్టమేమి? అమృతవల్లి వచ్చుచుండెను; పోవుచుండెను. తరువాత రెండు మూఁన్నాళ్ళకు వంది వచ్చెను. భవిష్య పురాణము దొరకినదిగాని యందులోఁ గొన్నిపుటలు లేవనెను. ఈమె యాగ్రంథమునుఁ దెప్పించెను. మగధరాజ్య వంశములకథ చదివించెను. ఆవంది చదువఁగలఁడుగాని యర్థము చెప్ప లేఁడు. ఆ గ్రంథము సంస్కృతములో నున్నది. మగధ రాజ్య వంశమునుఁగూర్చియున్న పత్త్రములన్నియు పది పన్నెండుకన్న మించిలేవు. ఆ పత్రములు తనవద్దనిచ్చి యా వందిని వెళ్ళిపొమ్మనెను. అతఁడు తటపటలాడెను. ఆమె యోయి వందీ, ఎవ్వరడుగుదురు? రాజూరిలోలేఁడు. మంత్రులకు దీనితోఁ బనిలేదు. రెండుమూఁడు దినములలో నీయాకులు నీకిచ్చివేసెదను. నాయందు నీకు నమ్మకము లేనిచో మహాసేనాధిపతియే నీనుండి యీపత్రములు తీసికొను ననెను. అతఁడు తరతరలాడి వెడలిపోయెను. తరువాత నీ పత్రము లెవరిచేతఁ జదివించవలయును, అన్న ప్రశ్న పుట్టెను. తనకు సంస్కృతము రాదు. తన తండ్రికి సంస్కృతము రాదు. శ్రీమాలికి వచ్చును. కాని యెంతవచ్చుట? గ్రంథములు చదివి యర్థము చెప్పఁదగినంత రాదని తనకుఁ దెలియును. వాసుదేవుఁడు తన కొడుకైన భూమిమిత్రునకుఁ జక్కగా సంస్కృతముఁ జెప్పించెనట. ఆయన గొప్ప పండితుఁడట. ఇప్పుడు సంస్కృత భాషయందలి పాండిత్యము

తొల్లిటికంటె వేయి మడుంగు లెక్కువ భాసించుచున్నదట. ఈ మాటలన్నియు శ్రీమాలి చెప్పెను. ఆ పేస్లుకూడఁ దనకు తెలియవు. తాను పోయి భూమిమిత్రునిచేత నీ యాకులు చదివించుట న్యాయముకాదు. వాసుదేవుని చదువుమని యడిగినచో నేమగును? ఆయన తన మాట వినునా? ఆ మాత్రము వినఁడా? ఇప్పుడు వానియందు తనకుఁగల భావము వేఱు. ఈభావమునుఁ బురస్కరించికొని తానెంత చనవైనను తీసికొనవచ్చును. తీసికొనినచో నతఁ డేమనుకొనును? ఏమిరా? ఈ బాలిక నాయం దింత స్వాతంత్ర్యము వహించుచున్న దనుకొనును. తాను వాసుదేవునితో పూర్వమునందువలె నిశ్చలముగా మాటాడఁగలదా? వట్టి బాలికాత్వము నెఱపఁగలదా? స్త్రీలక్షణము భాసించునట్లు మాటాడునా? మనసులో మనకొక భావ ముదయించినచో తరువాతి మనః ప్రవర్తన దానియంతట నదియే మనకుఁ దెలియకుండ మారును. నష్టమేమి? వాసుదేవుఁ డనుకొననిమ్ము. అందులో నబద్ధ మేమియు నుండదుకదా? మఱియు నతఁడు నింకొకరీతిగా నూహించినచో నిట్లనవచ్చును. "అమృతవల్లీ! నీవు నాతో నిట్లు ప్రవర్తించరాదు. నా వయసేమి?" అనిన నే నేమందును? వయసుయొక్క తారతమ్యము లేనిచో నీ కంగీకారమేకదా యందును. అతఁ డేమనును? నిరుత్తరుఁడగును. అతఁ డే ప్రశ్న వేసినను నన్ను తప్పించుకొనలేఁడు. అతఁ డూరకుండవలయును. అది యుత్తమమైన మార్గము.—

ఆనాఁడు సాయంకాల మమృతవల్లి వాసుదేవునివద్దకు పోయి యిట్లనెను. "నేను భవిష్య పురాణములోని కొన్ని పత్రము

లనుఁ దెచ్చితిని. వానిన్ని మీరు నాకుఁ జదివి యర్థము చెప్ప వలయును. అనఁగా వాసుదేవుఁడు. భవిష్య పురాణమని యొక గ్రంథ మున్నదని నీ కెట్లు తెలియును? అమృత:— నాకు విదురుఁడు చెప్పెను. వాసు:- దానితో నీ కేమిపని? అమృత:- నాకు లేదు. మీ కున్నదా? వాసు:- నాకున్నదో లేదో నాకుఁ దెలియదు. అమృత:- మీ కున్నదని నాకుఁ దెలియును. అందుచేత చదివించి యర్థము చెప్పించుకొన వలయునని నా కున్నది. వాసుదేవుఁడు:- దానితో నాకు పని యున్నచో నీ కీ ప్రయత్న మెందులకు? అమృత:- మీ విషయములో నేనింత ప్రయత్నము చేయరాదా? వాసు:- ఎందుకు చేయవలయును? అమృత:- ఎందుకు చేయరాదు? ఇద్దఱును నవ్విరి. ఆనాఁటిరాత్రి యామె యా భూర్జపత్రము లను తీసికొనిపోయి యాయనవద్దఁ గూర్చుండెను. ఆయన భోజనముచేసి విశ్రాంతి తీసికొనుచుండెను. మెత్తని పట్టు పరుపుమీఁద నాసీనుఁడై వెనుకనాను బిడ్డలకు వ్రాలి తాంబూలసేవనము చేయుచుండెను. ప్రక్క నాయన భార్య యుండెను. భూమిమిత్రుఁడు తండ్రితోఁ గలిసి భోజనముచేసి తన సౌధాంతః ప్రదేశాంతరమునకుఁ బోయెను. దీపము జాజ్వల్యమానముగా వెలుగుచుండెను. అమృతవల్లి యా భూర్జపత్రములనుఁ దన చేతిలో తీసికొనిపోయి యాయనకుఁ గొంత దగ్గఱలోఁ గూర్చుండెను. వాసుదేవుని భార్య నవ్వెను. వాసుదేవుఁ డాపత్రములను తనచేతి కిమ్మనెను. అమృత:-సంస్కృతము రావలయునన్నచో నెన్నాళ్ళుపట్టును? వాసు:-నేను తొమ్మిదియేండ్లు చదివితిని. ఒక్క వ్యాకరణ

శాస్త్రమే యేడేండ్లు పట్టినది. అమృత:- అంత శాస్త్ర మున్నదా? వాసు:-ఇప్పు డున్నది. పూర్వమునందు లేదు. మూఁడువందల యేండ్లక్రింద నింతశాస్త్రములేదు. అమృత:- నాకర్థముకాలేదు. వాసు:- నిజమేనమ్మా! తత్పూర్వము జదివెడివారు భారత భాగవతములతో మొదలుపెట్టెడివారు. వేదములు శాస్త్రములు చదివెడివారు. ఆశాస్త్రములుకూడ సూత్రగ్రంథములు చదివెడివారు. వ్యాకరణ శాస్త్రమునకు తత్పూర్వమునందు ననఁగా నేఁటికి సుమారు నాల్గైదు వందలయేండ్లకు పూర్వము సూత్రములులేవు. సంస్కృతము చదువుట యనఁగా బ్రహ్మసూత్రములు, కణాద సూత్రములు, నక్షపాద సూత్రములు చదువుటయు, కొన్ని వ్యాకరణ గ్రంథము లుండెడివి. వానిని చదువుటయు మాత్రముగానే యుండెడిది. కాని నాలుగైదు వందల యేండ్లక్రింద యొక మహానుభావుఁడు పుట్టెను. ఆయన పేరు పాణిని. ఆయన వ్యాకరణ శాస్త్రమునకు సూత్రములు వ్రాసెను. ఆ గ్రంథముపేరు అష్టాధ్యాయి. దానిమీఁద కాత్యాయనుఁడన్న మహాపురుషుఁడు కొన్ని సవరణలఁ జేసెను. అంతకంటె నాశ్చర్యకరమైన యొక విషయము జరిగెను. అది మూఁడువందల యేండ్ల క్రిందట జరిగెను. మన మహారాజుగా రున్నారుకదా దేవభూతి. వీరిది బ్రాహ్మణ రాజవంశము. వీరి పూర్వుఁడు పుష్యమిత్రమహారాజు. ఆయన యిప్పటికి మూఁడువందల యేండ్లక్రింద రాజ్యము చేసెను. కలి ప్రవేశించిన తరువాత పదునెనిమిదివందల యెనుఁబదినాలుగేండ్లకు పుష్యమిత్రుఁడు

మగధరాజ్యమునకు రాజయ్యెను. ఆయన యిరువదియేండ్లు రాజ్యము చేసెను. ఆయన కుమారుఁ డగ్నిమిత్రమహారాజు ఆయన యేఁబదియేండ్లు రాజ్యము చేసెను. ఆ పుష్యమిత్ర మహారాజు రాజ్యము చేయుచుండఁగా సర్వభూమి మోయుచున్న యాదిశేషుఁడు తానొక యవతార మెత్తెను. ఆయన పేరు పతంజలి మహర్షి. ఆయన పాణిన్యాచార్యులు వ్రాసిన వ్యాకరణ సూత్రములమీఁద మహాభాష్యము వ్రాసెను. ఆ గ్రంథము చదివినవాఁడుమాత్రమే సంస్కృతములో పండితుఁడని చెప్పఁబడఁదగినవాఁడు. ఆ గ్రంథము వెంటనే యెవ్వఁడును చదువలేఁడు. సూత్రములు వానిమీఁద నున్న యనేక వ్యాఖ్యలు, వృత్తులు సర్వాంకషముగాఁ దెలిసికొన్న తరువాత నా మహాగ్రంథమును చదువలయును. పుష్యమిత్ర మహారాజుపేరుతో పతంజలిమహర్షి పేరు లంకెఁగొనియున్నది. ఆ పుష్యమిత్రమహారాజు పదునెన్మిదివందలయేండ్లు భ్రష్టమై పోయిన వేదధర్మమును మఱల సముద్ధరించెను. ఆయన యశ్వమేధయాగమును చేసెను. పతంజలిమహర్షి తనభాష్యములోఁ బుష్యమిత్రునిపే రెన్నెను. నాకు మన దేవభూతి మహారాజనఁగా నింత గౌరవ మెందుకనఁగా నీయన పుష్యమిత్ర మహారాజు వంశములోనివాఁడని. కలిలో పదునెన్మిది వందల యేండ్లు గడచిన తరువాత మఱల భారతదేశము కృతయుగ ధర్మమును నడపిన బ్రాహ్మణ ప్రభువులు తండ్రి కొడుకులు పుష్యమిత్రాగ్నిమిత్రులు నాకు ధ్యేయులుగాఁ గనిపింతురు. ఇప్పుడు సంస్కృత వ్యాకరణము చదివినవాఁడే పండితుఁడు. అమృత:- నేను తొమ్మిదేండ్లు చదువగలనా?

వాసు:- తొమ్మిదినెల లైనచోఁ జదువవచ్చును. వాసుదేవుని భార్య యిట్లనెను. పెండ్లియాడినచోఁ దొమ్మిదినెలలు సులభముగాఁ జదువవచ్చును. ఎంతమంది పిల్లలనుఁ గన్నచో నన్నిసార్లు జదువవచ్చును. అమృత:—నేను పెండ్లియాడను. వాసు:—మాయింటిలోనుండి పోవుదువా? అమృత:- ఈ భూర్జపత్రములను చదివి నాకర్థము చెప్పవలయును. అనఁగా వాసుదేవుఁడు పత్రములనుఁ దీసికొని తనలోతాను చదువుకొనెను. కొంత చదువఁగా నది మగధ రాజవంశ వృత్తాంత మని తెలిసినది. భారతయుద్ధమునకు పూర్వము వేయియేండ్లనుండి బార్హద్రథ వంశముయొక్క చరిత్రమంతయు వ్రాయఁబడియున్నభాగము. ఆయన బార్హద్రథవంశము, ప్రద్యోతవంశము, శిశునాగవంశము, నంద వంశము, మౌర్యవంశము, శుంగవంశము మొదటివఱకు జదివెను. దానిని పూర్తిగా చదువక చదువుట యాపి యమృతవల్లితో నిట్లనెను. ఈభాగము తెచ్చితివెందులకు? అమృత:-ఎంతవఱకు చదివితిరి? వాసు:-నీకేమి కావలయును? అమృత:-నిజము చెప్పుమందురా? వాసు:-అవును. అమృత:- మీరెంతవఱ చదివితిరి? వాసు:- శుంగవంశారంభమువఱకుఁ జదివితిని. అమృత:- ఇంక నెన్నిపత్రము లున్నవి. వాసు:- ఇంకఁ జాల కలవు. అమృత:-ఇప్పుడు చదువుట కష్టమేమో? మీయంతట మీరు చదువుడు. రేపో ఎల్లుండియో నేను వత్తును. ఈవంశముల కథయంతయు నాకుఁ దెలియవలయును. నాకు దానితోఁబని యున్నది. వాసు:- నాకర్థ మగుటలేదు. కాని నీవు చదివి చెప్పుమనఁగా నాకు కాదను

టకు నాకు సామర్థ్యములేదు. అమృత:- ఎందుచేతలేదు. అనఁగా వాసుదేవునిభార్య యిట్లనెను. "అమృతవల్లీ! నీ మాటలు చిత్రములుగా నుండును. నీ కాయన మహాసేనాధిపతివలె కనిపించఁడా? అందఱు నాయననుచూచి భయపడుదురు. నీకు భయములేదా? అనఁగా నమృతవల్లి యామెతో తిరిగి 'నీకు భయములేదా' యనెను. ముువ్వురును విఱుగఁబడి నవ్విరి. వాసుదేవునిభార్య ఇంతప్రొద్దుపోయి యేమి పోవుదువు. ఇక్కడనే పండుకొ మ్మనెను. అమృతవల్లి తనతల్లి తనకోస మెదురుచూచు ననెను. నాబండి యున్నదికదా? బండిమీఁద పోదు ననెను. వాసుదేవునిభార్య నీకు బండి యెక్కడిది? నే నెఱుఁగనే. అనఁగా నమృతవల్లి నేను సంపాదించితి ననెను. వాసుదేవుఁ డిట్లనెను. అమృతవల్లి కాలినడకతో నట్లిట్లు దిరుగుట నాకు బాగుగాలేదు. నేనొకబండి నామెకుఁ బంపించితి ననెను. అనఁగా వాసుదేవునిభార్య ఇదా సంపాదించుట యనఁగా? నిజముగా సంపాదించితి ననుకొన్నాను. అనఁగా నమృతవల్లి "ఇది సంపాదనకాదా? నేను కొన్నానా? వాసు:-కొన్నచో సంపాదన యగునా? అమృత:-మనడబ్బుపెట్టి మనము కొందుము. సంపాదించకున్నచో డబ్బెట్లువచ్చును? వాసు:-ఊరకే ధనమురారాదా? అందఱివద్దనున్న ధనమును సంపాదించినదేకాదు. దేవభూతి మహారాజునకు నింత రాజ్య మున్నది. ఇంతబొక్కస మున్నది. ఆయన సంపాదించెనా? అమృత:- సంపాదించలేదు. పూర్వులు సంపాదించిన దానిని వ్యయపెట్టుచున్నాఁడు. దుర్వ్యయము చేయుచున్నాఁడు. - ఈమాట యమృతవల్లి

యనినంతనే వాసుదేవుఁడు తలక్రిందులైపోయెను. తన మహా రాజునుఁగూర్చి తనయెదుట నిట్టిమాట యనుటకు సాహసించెడిప్రాణి మగధరాజ్యములోలేదు. అమృతవల్లి యన్నది. నిజముగా వాసుదేవుఁడు వెంటనే యమృతవల్లిని బంధించవలయును. అది రాజద్రోహపుమాట. వాసుదేవుని భార్య మొగము వెలతెలపోయెను. భార్యాభర్త లిద్దఱు కనుబొమ కదలికకూడ లేకుండఁ దలలు వంచికొనిరి. అమృతవల్లి వెంటనే గ్రహించెను. తాను మంచిపని చేసినది. వాసుదేవుఁడు భవిష్యపురాణగత రాజవంశకథనము చదువక ముందు నతని మనస్సులో నీ బీజావాపము జరుగుటమంచిదే. ఇప్పుడు తాను మిక్కిలి భయస్థానమున నున్నది. వాసుదేవుఁడు తన్ను వెంటనే శిక్షించవచ్చును. లేదా తనయింటికి రావద్దని యాజ్ఞాపింపవచ్చును. తన్నుఁగూర్చి వాసుదేవుని యభిప్రాయముయొక్క గాఢత్వమెట్టిదో దాని స్వరూపములో నున్న యార్ద్రితాలక్షణ మెట్టిదో పరీక్షింపఁబడు నిముసముగా నున్నది. ముప్పురును మాటాడలేదు. అమృతవల్లి యిట్లనెను. "నేను జేపురాత్రికి వత్తును. మీరా భవిష్యపురాణగతశుంగ వంశరాజకథనమంతయు చదివి నాకుఁ జెప్పవలయును. అందులో మీసంగతి యున్నది. ఈ దేవభూతి మహారాజుకాలములో వాసుదేవుఁడన్న సేనాపతి యుండును. అప్పుడేదో జరుగును అని నేను విన్నాను. ఆపాడెడువాఁడు నాకు కనిపించలేదు. నేనును శ్రీమాలియు వానిభార్యవద్ద కొకనాఁడు పోయితిమి. శ్రీమాలి తమరి కుమార్తెయని నేను చెప్పఁగా నామె నివ్వెఱపోయెను. గగ్గోలుపడెను.

దానికిఁ గారణము తెలిసికొనుటకు నేనెంతయో ప్రయత్నించితిని. ఆమె చెప్పలేదు. ఆమె భయపడినది. ఆమె మఱల నాకు మనిసియే కనిపించలేను. ఈ భవిష్యపురాణముకోసము వెదకితిని. మన కోటలోని మొగసాలయందున్న పాతగ్రంథములు వ్రాసెడు వందులవద్దకుఁ బోయితిని. అతఁడు దీనిని వెదకి తెచ్చి నా కిచ్చెను. నాకు సంస్కృతమురాదు. శ్రీమాలికి కొద్దిగా వచ్చునని నాకు తెలియును. గ్రంథములు చదివి యర్థముచెప్పఁగలశక్తి యామెకులేదని నే నను కొంటిని. భూమిమిత్రునివద్దకుఁ బోయినచో నతఁడు నిరాకరింపవచ్చును. నా కొక్కఁడే కనిపించినాఁడు. అది మీరు. మీవద్దకు తెచ్చితిని. మీభార్యయుండఁగా నే నివియన్నియు చెప్పరాదు. ఆమె పిచ్చిబాగులది. చెప్పినను నష్టములేదు. రేపురాత్రికి వత్తును. అప్పుడుగాని నేనేమియు నిర్ణయించికొనలేను."

మఱునాఁడురాత్రి వాసుదేవుఁడు భోజనముచేసి సావడిలోనికి వచ్చెను. ఆయనతో భూమిమిత్రుఁడుకూడ వచ్చెను. అదివఱకే యమృతవల్లి వచ్చియుండెను. భూమిమిత్రుఁడు తన గదిలోనికి పోఁబోవుచుండెను. అమృతవల్లి యిట్లనెను. భూమిమిత్రా! నాన్నగారివద్దఁ గొంచెముసే పుండరాదా! భోజనము చేసినవెంటనే నీదారిని నీవు పోయినచో నాయనగారు నీతో నేదైన మాటాడవలయునన్నచోఁ బనివెట్టికొని నీవద్దకు రావలయును. తండ్రి యేమైన మాటాడునేమోయని కొంతసేపు ప్రతీక్షించుట కొడుకుయొక్క ధర్మము - అనఁగా భూమిమిత్రుఁడు కొంత కలవరపడెను. ఇదివఱకు తానేదో

దోషము చేయుచున్నట్లు భావించెను. అమృతవల్లి యనఁగా నతనికి కొంచెము భీతి కలిగెను. ఈమె యెప్పు డేమాట మాటాడునో యేమాట కేయర్థము వచ్చునో యది యెవని శీలమునుఁగూర్చి దోషారోపణవంటిది చేసినట్లుండునో తెలి యదు. ఆస్వభావ మామెలో నున్నదని యతనికిఁ దెలియును. కాని యామె ఈ ప్రయోగమును తనమీఁద చేయలేదు. తా నన్నచో నామెకొక భయమని యాతఁ డనుకొనెను. ఇప్పుడు తెలిసిన దేమనఁగాఁ దా నన్నచో నామెకు భయము లేదు సరికదా! నామో యనినచోఁ దానే భయపడవలయును. భూమిమిత్రుఁడు వచ్చి తండ్రివద్ద నిలుచుండెను. తండ్రి భూమిమిత్రునిఁ బిలువలేదు. అతఁడువచ్చి యీ సమయమునఁ దాను చదివిన భవిష్యపురాణములోని యర్థము నతఁడు వినవలయునని యనుకొనలేదు. అమృతవల్లియే యిది యంతయు సంకల్పించినది. ఆమెనుఁగూర్చి వాసుదేవునకు పూర్వము వివేకవతియని సమర్థురాలని యేపనినైనను నెత్తిన వేసికొని యీఁదఁగలదని నిర్వ్యాజముగాఁ బ్రేమించకలదని అంతియేకాని యీమెయందు రాజనీతి ప్రకాశించుచున్నదని తెలియదు. వాసుదేవుఁ డనుకొన్నది వేఱు. అమృతవల్లి సంకల్పించినది వేఱు. ఆ భవిష్య పురాణమునందలి కథ చదివి యమృతవల్లితోఁ జెప్పి యామెను మందలించవలయు నని వాసుదేవుఁ డనుకొనెను. ఇట్టివానినిఁగూర్చి మనము చింతించరాదు. అందులో వ్రాసినట్లే జరుగవలయునన్న నమ్మక మేమున్నది? పూర్వ మెవ్వరో వ్రాసిపెట్టిరి. అవి యన్నియు సూచనలేకాని నిశ్చితములైన విషయములు

కావని యమృతవల్లితోఁ జెప్పవలయు ననుకొనెను. అమృత వల్లితోఁ జెప్పవలయు ననుకొనెను. అమృతవల్లి బాలిక, చిన్నపిల్ల. ఆమె కేమియుఁ దెలియదు. అనియే వాసుదేవుఁ డనుకొనుచుండెను. ఇపుడు భూమిమిత్రు నచ్చట నిలువు మనుటచేత వాసుదేవుఁ డమృతవల్లిని పూర్వము మందలింపఁ దలచినట్లు మందలించుటకు వీలులేదు. ఇందులో నింకొక చిక్కు వచ్చినది. ఈ భవిష్య పురాణమునందలి కథను తాను భావించినట్లే భూమిమిత్రుఁడుకూడ భావించునా? భూమిమిత్రుఁడు భిన్నముగా నూహించినచోఁ దా నమృత వల్లిని మందలించి ప్రయోజనములేదు. ఇంతలో నమృతవల్లి యిట్లనెను. నాయనగారిని నేనొక విషయ మడిగితిని. వారు చెప్పఁబోవుచున్నారు. నీవును అమ్మగారుకూడ నిచ్చటనే యుండవలయును. ఇది శ్రీమాలినిఁగూర్చిన విషయము. నాయెడఁద యాందోళన పడుచున్నది. అనఁగా నచటికి వాసుదేవుని భార్యకూడ వచ్చెను. ఆమె ప్రక్క నిలు చుండెను. భూమిమిత్రుఁడు కూర్చుండెను. అమృతవల్లి నిన్న వాసుదేవున కెంత దగ్గఱగా కూర్చున్నదో అంత దగ్గఱగా కూర్చుండక దూరముగాఁ గూర్చుండెను. వాసు దేవునకు కొంత మనస్సులో స్తిమితత్వము లేకపోయెను. అమృతవల్లి యేదో పదక మెత్తిన దనిపించెను. దీని నింత గడుసురా లనుకొనలేదు. ఒక విషయములో చాకచక్య మున్నప్పుడు నది యింకొక విషయములోనూత్ర మేల పని చేయదు? ఇట్లనుకొనుచుండఁగా నమృతవల్లి యిట్లనెను. ఇదివఱ కామె వాసుదేవునితోఁ దాను చెప్పఁదలచుకొన్నది

సూటిగాఁ జెప్పుటయేకాని యొక వరుసతోఁకాని యధికారము నుద్దేశించికాని సంబోధించుట చేయలేదు. ఇప్పుడు సంబోధించెను. మహాసేనాపతీ! శ్రీవాసుదేవా! తమరు తద్గ్రంథము చదివితిరా? నాకు దానిలోని విషయము చెప్పెదరా? ఆ పత్రములు భూమిమిత్రునకుఁగూడ వినిపించినచో నతఁడు గూడ చదువును. ఆయనకును సంస్కృతము గట్టిగా వచ్చును కదా! అని వాసుదేవుని ప్రక్కనున్న పత్రములు తీసికొని భూమిమిత్రుఁడు వానివంకఁ జూచుచుండెను. అమృతవల్లి యిట్లనెను. "మొదటినుండి చూడనక్కఱలేదు. ఇది భవిష్య పురాణములోని మగధరాజవంశ చరిత్రము శుంగవంశము గిరివ్రజ రాజధాని నాక్రమించిన తరువాత వారిలోఁ బదవ రాజు దేవభూతి. ఆయనయే యిప్పటి మన మహారాజు. ఆ భాగము తీసి చదివినచోఁ జాలును. అది తీసి చదువుము. అని మఱల నా యాకులు తానే తీసికొని వాసుదేవునకిచ్చి యా భాగము తీసి భూమిమిత్రునకుఁ జూపింపుమనెను. వాసుదేవుఁడు నిస్సహాయుఁడై యా పుటను భూమిమిత్రునకుఁ జూపించెను. భూమిమిత్రుఁ డచటనున్న రెండు మూఁడు పుటలను చదివెను. చదివి యిట్లనెను. ఈ నడుమ నొకపుట పోయినది. అనఁగా వాసుదేవుడు నేన ట్లనుకొనలేదే యనెను. భూమిమిత్రుఁడు అనుకొనకపోవుటకుఁ గారణ మున్నది. వెనుకటి పత్రములో శ్లోకము పూర్తియైనది. రెండవపత్రము క్రొత్తశ్లోకముతోఁ బ్రారంభించినది. అందుచేతఁ దమరు దానిని చిత్తగించలేదు. చూచితిరా! వెనుకటి పత్రములోని కథ రాజుయొక్క దుశ్శీలతతో విదిశానగరమునందలి

కుటుంబికులఁ జెఱచుటతో నంతమైనది. రెండవ పత్రము మొదట వాసుదేవుఁడు రాజ్యము చేయుటతోఁ బ్రారంభించినది. నడుమ కొంత కథ పోయినట్లు లేదా? వాసుదేవుఁడెట్లు రాజ్యమునకు వచ్చెను. రాజును చంపెనా? చంపవలసిన యవసర మేమున్నది? ఆవాసుదేవుఁడు దురాశాపరుఁడా? కుత్సితుఁడా? రాజద్రోహియా? రాజ్యమునందాశకలవాఁడా? రాజు నెందుకు చంపెను? చంపనేలేదా? రాజు వాసుదేవునిఁ బిలిచి రాజ్యము నాయన కిచ్చెనా? ఏదైనను కొంత చెప్పఁబడవలసి యున్నదికదా? అది యేమియు నిందులో లేదు. అందుచేత నొక పత్రము పోయినదనియే యనుకొనుచున్నాను. అమృతవల్లి:-ఎట్లైననేమి? దేవభూతికి రాజ్యముపోవును. వాసుదేవునకు వచ్చును. వాసు:-అయినచో నేమి? అమృత:-ఆ దేవభూతి ఈదేవభూతియేనా? ఆ వాసుదేవుఁడు మీరేనా? వాసు:-కాదనియే నా యుద్దేశ్యము. అమృత:- ఆ వాసుదేవుఁడు మీరు కారేమోకాని ఆ దేవభూతిమాత్రము మన రాజే. ఈ సుంగవంశము పుష్యమిత్రుఁడు, అగ్నిమిత్రుఁడు మొదలుగా రాజులపేళ్లు చెప్పఁబడియున్నవికదా? అందులో పదియవరాజు దేవభూతి. ఆయన భాగవత మహారాజు కుమారుఁడు. విదిశానగరము నందుండెను. దుర్వ్యాభిచారి యయ్యెను. సర్వము దేవభూతికి సరిపోవుచున్నవి. ఆ వాసుదేవుఁడు సేనాపతియనిగూడ చెప్పఁబడియున్నది. అదిమీకు సరిపోవునో సరిపోదో నాకు తెలియదు. భూమిమిత్రా! తరువాతికథ చదివి నాకు చెప్పఁగలుగుదువా? భూమిమిత్రుఁడు చదివెను. ఇట్లు చెప్పెను. శుంగవంశమునుండి యీరాజ్యము

కాణ్వావంశమునకుఁ బోవును. కాణ్వాయనుఁడైన వాసు దేవుఁడు రాజ్యమునకు వచ్చును. ఆయన బాల్యమునుండియు అవ్యసని. ఈ కాణ్వావంశీయులు నలువురుందురు. వాసు దేవుఁడు ముప్పది తొమ్మిదేండ్లు రాజ్యముచేయును. తరు వాత నతని కుమారుఁడు భూమిమిత్రుఁడు రాజ్యమునకు వచ్చును. అతఁడు 'చతుర్వింశద్భవిష్యతి.' ఇరువది నాలు గేండ్లు రాజ్యముచేయును. 'నారాయణసుత స్తస్య భవితా ద్వాదశైవతు' ఈ భూమిమిత్రునికొడుకు నారాయణుఁడు పండ్రెండేండ్లు రాజ్యము చేయును. 'సుశర్మా తత్సుత శ్చాపి భవిష్యతి దశైవతు.' ఆ నారాయణుని కొడుకు సుశర్మ యనువాఁడు పదేండ్లు రాజ్యముచేయును. ఈ కాణ్వా యనులు నల్వురును ఎనుఁబదియేండ్లు రాజ్యముచేయుదురు. తేషాం'పర్యాయకాలేతు భూమి రంధ్రాన్ గమిష్యతి.' ఈ కాణ్వాయనుల తరువాత ధాత్రి యాంధ్రులకుఁ జెందును.

అమృత:-అయినచో వాసుదేవునికొడుకు భూమిమిత్రుఁడు. వాసుదేవుఁడు ముప్పది తొమ్మిదేండ్లు రాజ్యము చేయును. భూమిమిత్రుఁ డిరువదినాలుగేండ్లు చేయును. వారు కాణ్వా యనులు. వాసుదేవుఁడు దేవభూతి సేనాపతి. అన్నియు సరిపోవుచున్నవి. ఆ వాసుదేవుఁడు మీ నాయనగా రను కొందును. ఆ భూమిమిత్రుఁడు నీవనుకొందును. మీరు కాక తప్పదు. ఇది పురాణములో వ్రాయఁబడిన విషయము. మనము కాదన్నచో పోవునదికాదు. పంచాంగముల్చింపిన చో నక్షత్రములు పోవునా? ప్రధానమైన పత్రమేపోయెను. అందులో నేమియున్నదో తెలియదు. వాసుదేవుఁడు రా జగు

టకుఁ గారణము లా పుటలోఁ జెప్పఁబడియుండును. దైవము యొక్క లక్షణము చూడుడు. సరిగా నాపుటయే పోయెను. ఆపుటకూడ దొరకెన దనుకొనుడు. అందులో నేపరిస్థితులు జరిగి వాసుదేవుఁడు రాజగునో యాపరిస్థితులు చెప్పఁబడి యుండును. వర్ణింపఁబడి యుండును. మనము రాజభక్తులము. రాజద్రోహమును చేయము. నిజానికి మనకు రాజ్యమక్కఱలేదు. మహాసేనాధిపత్యముకంటె రాజ్యము గొప్పదా? మహాసేనాధిపతి యనుకొనఁడు. దూరముగా నుండి చూచెడి నావంటివారు సేనాధిపతికంటె రాజుగొప్పవాఁడనుకొందురు. వాసు:- సేనాధిపతి యెందు కనుకొనఁడు? అమృత:— రాజు తన చేతిలో నున్నాఁడని సేనాధిపతికిఁ దెలియును. సేనాధిపతియే రాజైనచో తా నింకొకని చేతిలో నట్లుండ వలయునని భయము కావచ్చును. వాసుదేవుఁడు ఈ సంగతి తెలిసిన సేనాపతి తాను రాజైనచో వేఱొకనిని సేనాపతిచేసి వాని చేతిలో సర్వమును వదలిపెట్టఁడు. అమృత:- అవును. ఎందుకు వదలిపెట్టును? అందుకనియే రాజ్యము భద్రముగా నుండును. భూమి:— ఆ వాసుదేవునకు రాజ్య మక్కఱ లేనిచో? అమృత:- ఆ భూమిమిత్రునకుఁ గావలయునేమో! భూమి:- భూమిమిత్రుఁడు తనకు రాజ్యమును వాంఛించుట లేదు. అమృత:- భూమిమిత్రున కక్కఱలేదు. తన తండ్రి మగధసామ్రాజ్యమునకు చక్రవర్తి యగుటకూడ నతని కిష్ట ముండదా? వాసు:- తండ్రి యిష్టపడనిచో కొడుకు నిష్ట పడఁడు. అమృత:- భూమిమిత్రుఁ డామాట యనఁడేమి? అనఁడు. పుత్రుఁడైనవాఁ డనఁడు. పితృభక్తికలవాఁ డనఁడు.

ఎవఁడైన తన తండ్రి మహారాజు కావలయు ననుకొనఁడా? తన తండ్రి గొప్పవాఁడు కావలయు ననుకొనఁడా? తండ్రికి వచ్చెడి రాజ్యమును దూరముగాఁ ద్రోయునా? తండ్రికిష్టము లేనిచో సరే. ఆ రాజ్యము రాకుండుటకు కొడుకుమాత్ర మడ్డంకులు పెట్టఁడు. తండ్రిని పట్టుకొమ్మనును. వాసుదేవుఁడు సిరి రా మోకా లొడ్డునేని యొడ్డనిమ్ము. ఆ మోకాలును విఱుగఁద్రోసి సిరి యింట వచ్చి దూకుచో రాజు కుంటి రాజగును.— అనఁగా వాసుదేవుఁడు నవ్వెను. వాసుదేవుని భార్య నివ్వెఱపోయి చూచుచుండెను. భూమిమిత్రుఁడు తానింక వెళ్ళెద ననెను. అమృతవల్లి మఱికొంత సేపు కూర్చుండు మనెను. వాసుదేవుఁ డిట్లనెను. అమృతవల్లీ! సరే. భవిష్యపురాణ మిట్లున్నది. ఆ వాసుదేవుఁడను నేనే. నీవే చెప్పితివికదా? నా రాజభక్తి మితిమీఱినది. నే నట్టి యూహాలే చేయను. చేయని యూహ క్రియాదశ కెట్లు వచ్చును? మనమిప్పుడు చేయవలసిన దేమున్నది? చేయ వలసిన దున్నను, నేను చేయను. అమృత:—ఈ భవిష్యపురాణ మెవరు వ్రాసియుందురు? భూమి:— పురాణములన్నియు వ్యాసమహర్షి వ్రాసె నందురు. అమృత:— ఆయన యబద్ధ ములు వ్రాయునా? వాసు:— ఈ ప్రశ్న యెందుకు? అమృత:— అందుకుకాదు. అట్లు జరుగునని భగవంతుఁడు వ్రాసెఁగదా? అట్లు జరుగకుండ నుండునా? ఎందుకు జరుగునో, ఎట్లు జరుగునో మనకుఁ దెలియదు. మనకుఁ దెలియరాదని భగవంతుని యుద్దేశము. అందుకనియే యా పత్రమును పోఁగొట్టెను. వాసు:— ఇది తెలిసియెంత

ప్రయోజనమో, అది తెలిసియు నంతియే ప్రయోజనము. అమృత:-కాదు. అంతకంటె నధిక ప్రయోజన ముండును. ఇట్లు జరుగును, వాసుదేవుఁ డిట్లుచేయును. అని వ్రాయఁబడి యుండునుకదా? అప్పుడు వాసుదేవుఁ డట్లుజరిగినను తానట్లు చేయకుండ మానివేయవచ్చును. భూమి:-అట్లు మానివేయుటకు వీలుండనటు లేదైన జరుగునేమో. వాసు:- అంతది యేమిజరుగును? అమృత:- అగ్నిమిత్రుఁడు మొదలు భాగవతునివఱకు యజ్ఞశీలురైన శుంగవంశపు రాజులలోఁ జివరివాఁడైన ఈదేవభూతి యిట్లయ్యెను? ఎవరైన ననుకొందురా? అనుకొనిరా? పుష్యమిత్రుఁడెక్కడ? అగ్నిమిత్రుఁడెక్కడ? వసుమిత్రుఁడెక్కడ? ఈ దేవభూతి యెక్కడ? మనము చెప్పలేము. ఏది యెట్లుజరుగునో నాకుఁబట్టిన విషయ మిది కాదు. వాసుదేవుఁడు రాజగును. రాజుకాఁడు. భూమిమిత్రుఁడు తండ్రి రాజగుట కోరును. కోరఁడు. ఆ పోయిన పత్రములో శ్రీమాలినిఁ గుఱించి యేదో యుండునని నా సందేహము. ఆ కాలంజరి పొందిన నివ్వెఱనుఁబట్టి నా కా సందేహము కలిగినది. ఆపత్రమే పోయినది కదాయని నాకు చాల దిగులుగానున్నది. ఏమిచేయవలయునో తోఁచుటలేదు. మఱల నా వందిని కనుఁగొనవలయును. భూమి:- కాలంజరి యెవరు? నివ్వెఱయేమి? వాసు:- కాలంజరియని యొకస్త్రీ యాటవికురాలు భిల్లికావచ్చును. ఆమెవద్దకు శ్రీమాలియు నమృతవల్లియు సోదె నడుగుటకు పోయిరట చెల్లెలు వాసుదేవుని కుమార్తెయని చెప్పినంతనే యాకాలంజరి నివ్వెఱ పోయినది. శ్రీమాలి కేదో యాపద రానున్నట్లు సూచించిన

దట. అందుచేతనే యమృతవల్లి యీ కాలజ్ఞానమునుగూర్చి భవిష్యపురాణమునుగూర్చి వెదకి కోట మొగసాల పురాణ గ్రంథములు తిరిగివ్రాయు వందులను పట్టుకొని భవిష్యపురాణమునందలి యీ పత్రములనుఁ దీసికొనివచ్చెను. ఆమెకు సంస్కృతమురాదు. నన్ను చదివి చెప్పు మన్నది, భూమి:- నావద్దకు రావచ్చుకదా! అమృత:- నీవద్దకు వచ్చుటకు నాకు భయము. నీవు నన్ను లెక్క సేయవు. నేనన్నచో నీకు గౌరవ ములేదు. వాసు:- నేను నిన్ను లెక్క సేయుదునా? నీవన్నచో నాకు గౌరవమున్నదా ? అమృత:- లెక్క సేయక పోవచ్చును. నేనన్నచో మీకు గౌరవము లేకపోవచ్చును. కాని మీయందు నాకొక స్వాతంత్ర్య మున్నది. మీ మీఁద నాకొక యధికార మున్నది. ఈ స్వాతంత్ర్యాధి కారములు రెండును నేను మిమ్ములనుఁ గుఱించి నాలో నేను భావించి కొని యూహించి యేర్పాటు చేసికొనిన యొక భావము యొక్క బలముచేత నేనే యవలంబించుచుంటిని. మీరు వానిని కాదన్నచో మానివేయుదునుగాని అంతవఱకు నీ స్వాతంత్ర్యాధికారములను మీమీఁద నేను ప్రదర్శించుచునే యుందును. వాసు:-నేను నిరాకరించినచో నేమిచేయుదువు? అమృత:- ఏమిచేయుదును? ఆస్వాతంత్ర్యాధికారము లవ లంబించను. వాసు:- నన్నుఁ గుఱించి యింకొక రీతిగా నూహింతువా ? అమృత:- **నా** కా శక్తిలేదు. భగవంతుఁడు నా శక్తినిఁ బ్రసాదించలేదు. మిమ్ముఁగూర్చి నే నెట్టి భావ మునుఁ గల్పించుకొన్నానో యా భావమునకు వికార ముండదు. నేను బ్రతికినన్నాళ్ళు నంతే. వాసు:- ఆ భావ

మెట్టిదో నేను వినవచ్చునా? అమృత:- వినరాదు. నేను చెప్పను. చెప్పిన ప్రయోజనములేదు. మనమొక కార్యమును సంకల్పింతుము. పరమేశ్వరుఁడు దాని కనుకూలముగా లేడని మనకుఁ దెలియును. తెలిసికూడ తత్కార్యాచరణమునందు ప్రవృత్తుఁ డగువాఁడు మూర్ఖుఁడు. వాసు:- నీవు స్త్రీవి కదా! అమృత:- అనఁగా నేను మూర్ఖురాలనన్నమాట. వాసు:- నే ననలేదు. నీవే యనుకొనుచున్నావు. అమృత:- నాతో నిట్లు మాటాడుటకు నాయందు మీకుఁగల భావ మెట్టిది? —— భూమిమిత్రుఁ డచ్చటినుండి వెడలిపోయెను. వాసుదేవునిభార్య యిట్లనెను. మీ రిద్దఱు నిట్లు మాటాడుచుండఁగా పిల్లవాని కసహ్యము వేసినది. వాఁడు వెళ్ళిపోయినాఁడు. వాసు:- నే నేమన్నాను? భార్య:- పరులపిల్లలతో, పదునేనేండ్లపసిదానితో మీరిట్లు మాటాడుట న్యాయముగా లేదు. వాసు:- నా కేమియు త ప్పనిపించుటలేదు. నీ కెందు కనిపించుచున్నదో నాకు తెలియదు. భార్య:- అమృతవల్లి చెప్పినదికదా? నేను పిచ్చిబాగులదాన నని. అందుకని యనిపించుచున్నది. అమృత:- అమ్మా! నేనందు కనలేదు. ఈ భవిష్యపురాణ పత్రములు చదువఁగా నిందులో మన రాజ్య వ్యవహారములు వచ్చుననియు, నవి మీ వంశమునకు చెందియుండుననియు, నాకుఁ దెలియును. ఔనో కాదో సేనాధిపతియు నాయన పుత్రుఁడును నిర్ణయించుకొనవలసిన విషయము. ఇట్టి వ్యవహారములలో మీరు జోక్యము కలిగించుకొనరు. ఆ జోక్యము కలిగించుకోని లక్షణమునుద్దేశించి నేను మిమ్ము పిచ్చిబాగులది అంటిని——

అంత నమృతవల్లి యచటనుండి లేచెను. లేచిన యమృతవల్లి వెలికిపోవు గుమ్మమున కభిముఖముగాఁబోక భూమిమిత్రుని గదివైపునకు నడచుచుండెను. వాసుదేవుఁడు చూచుచుండెను. అతనికి భయము వేసెను. ఈమె భూమిమిత్రునితో నేమిమాటాడునో? ఇదియేదో సంధివేళ. తన నెత్తిమీఁదికి వచ్చునేమో! ఈవార్త సూక్ష్మాంశముగానైనను వెలికిఁ బ్రాకినచో తనకొంపకు చుట్టుకొనునే. అమృతవల్లిని తనయింటికి రాకుండ నాజ్ఞాపించినచో నెట్లుండును? ఓయి వాసుదేవా! నీవెంత కృతఘ్నుఁడవు. ఆమె నీకూతురు పెండ్లిచేసినది. నీకూతున కేదో యాపదవచ్చునని యింత యారాటపడుచున్నది. నీవు తిరస్కరించినను నీయఁ దామెకుఁగల భావమునకు లోపములేదట. జీవితాంతము నిన్నట్లే భావించునట. ఆభావమెట్టిదో? ఎంత మధురమైనదో. ఆమె యమృతవల్లి. ఆవల్లి పూచినచో నమృతపుష్పములే పూచును. ఆమె భావములే ఆమె పూచెడు పుష్పములు. మఱియు వాసుదేవుఁ డిట్లను కొనెను. ఆమెను వెనుకకుఁ బిలిచి నీవు భూమిమిత్రునితో మాటాడవలదు. అని చెప్పినచో నేమిలాభము. ఆమెగాని వినదు, ఆమెయే చెప్పినదికదా! నాయందు స్వాతంత్ర్యాధికారములను తా నవలంబించుచున్నదని. నామాట వినదు. కానిమ్ము. పోయి భూమిమిత్రునితో నేమి మాటాడును? అతనియందు నీరాజ్యాశను బ్రకోపింపఁజేయునా? అతనియం దాశను పెంచునా? అతఁడు నాబిడ్డ. నే నెట్లూహింతునో వాఁడు నట్లేయూహించును – అమృతవల్లి భూమిమిత్రునివద్దకుఁ బోయెను. ఈమె

పోవువఱకు భూమిమిత్రుఁడు తన శయ్యమీఁద నానుకొని కూర్చుండి యుండెను. ఆమెను చూచినంతనే మంచము మీఁదినుండి దిగి నిలుచుండెను. అమృత:-నన్ను గౌర వించుచుంటివే? భూమి:-ఇదివఱకు నాకు తెలియదు. నీవు నాకంటె చిన్నదానవు. మా శ్రీమాలి యీడుదానవు. మా చెల్లెలివలెనే నిన్ను చూచుచుంటిని. ఇప్పు డట్లుకాదు. నీవు వయస్సుచేత నాకంటె పదేండ్లు చిన్నదానవు. బుద్ధిచేత నాకంటె వందయేండ్లు పెద్దదానవు. మా శ్రీమాలియన్నట్లు నీకున్న యీప్రేమకు మేము జీవితాంతము కృతజ్ఞులమై యుండవలయును. అమృత:-జీవితాంతమో, ఈ యుగాం తమో నాకుఁ దెలియదు. ఆ పోయిన పత్రము దొరికిన తరువాతఁగాని నేను నిర్ణయించలేను. - భూమిమిత్రుఁడు తలక్రిందులై పోయెను. ఈమె పండితురాలుకాదు. పెద్ద చదువుకొన్నదిలేదు. ఈ వివేకమేమి? ఈ మాటాడుట యెట్టిది? ఇంతకు ఈమెకు నాతండ్రియుండుఁగల భావమెట్టిది? నే నూహించుటకుఁగూడ నంకుటలేదు - అప్పు డమృతవల్లి యిట్లనెను. "నీవు నీమంచముమీఁదఁ గూర్చుండుము. నే నిచటఁ గూర్చుందును. నే నెందుకు వచ్చితి ననఁగా నీతో నొకమాట చెప్పుటకు వచ్చితిని. నేను కొన్నాళ్ళనుండి యీ విషయము నాలోచించుచున్నాను. రాజారీతిగా దుర్వృ త్తిలో నున్నాఁడు. మంత్రులొకఁ డేటికి తీసినచో నొకఁడు కోటికి తీయుచున్నాఁడు. ఈ మంత్రులలో నెవ్వఁ డెప్పుడు దురూహచేయునో తెలియదు. సైన్యములోఁ గొంతభాగము వాఁడు చీలఁదీసినచో నంతర్యుద్ధము తప్పదు. ఏమంత్రి

యెట్టివాఁడో తెలియదు. మొన్ననే నాయనగారన్నారు- ఆమంత్రులు సరిగాఁ బ్రవర్తించుటలేదు. నీవు మంత్రివి కావు. ఒక సామాన్యోద్యోగివి. కాని మహాసేనాధిపతి కుమారుఁడ వగుటచేతను, మంత్రులందఱు కుత్సితులగుటచేతను నిన్నుఁ జూచినచో వారికి భయముగానున్నది. సర్వ వ్యవహారములు వారు నీతోఁ జెప్పియే చేయుచున్నారు. ఇప్పుడు నీవు నీ చిన్నయుద్యోగమును వదలిపెట్టుము. కోటలోనికిఁ బోయి మహామంత్రి యుండెడిస్థానమున నుండుము. కొలఁది దినములలో నీస్థితి మహామంత్రియొక్క స్థితి యగును. నిన్ను మహారాజు మహామంత్రిగా నియమించలేదు. రా జిచ్చుట లేఁదు. ఉన్న మహామంత్రి యసమర్థుఁడు. అందుకనియే అతఁడుకూడవచ్చి నీతో చెప్పకుండ నేదియుచేయుటలేదు. అతఁ డసమర్థుఁడు కాకపోయినను కుత్సితుఁడై దురాలోచనలు చేయుచున్నాఁడు. అందుకనియే వానికి భయము. ఓయి భూమిమిత్రా! అధికారములు రెండువిధములుగా వచ్చును. సామర్థ్యమున్నచోట నొకని కధికార మిత్తురు. సామర్థ్యము లేనిచోట నొకఁ డధికార మవలంబించును. నీయిల్లుచూడుము. మీచెల్లెలు పెండ్లివచ్చినది. మీయమ్మగారు పరమశాంతురాలు. అంతబరువు మోయలేను. నేనువచ్చి యధికారమును నాయంతట నే నవలంబించితిని. నేను నీయింటికధికారిణినైతిని. ఇట్లు నీవు ఈపటినుండి మహామంత్రిస్థానమునందు వ్యవహారములు చూచుచుండుము. నిన్ను కాదనుటకు వీలులేదు. వారందఱు మీ నాయనగారే నిన్నిట్లు చేయుమన్నా రనుకొందురు. అప్పుడు భయపడుదురు. సేనలో

చీలికలు తీయుటకుఁ బ్రయత్నించును. నీవు సహజముగా మహామంత్రివై యూరకుందువు. మీయింటిమీఁది సర్వాధికారమును నాకుఁ బ్రాపించలేదా? అట్లే నీకు రాజ్యముమీఁద సర్వాధికారముఁను వచ్చును. నిన్ను కాదనువాఁ డుండఁడు. ఒకవేళ కాదన్నచో నీవు దానికి సిద్ధపడి యుండవలయును. నీవు మహా సేనాధిపతి కుమారుఁడవు. సేనానులు, చమూపతులు, దళవాయులు, దుముదారులు, నందలు నిన్నెఱుఁగుదురు. వారినిఁ గలిసికొమ్ము. వారితో స్నేహముచేయుము. పైకి స్నేహముగాఁ గనిపించుము. స్నేహముతో నధికారమును జోడించుము. ఇతరమంత్రులు నిన్నుచూచి భయపడుదురు. సేనలు నిన్ననుసరించును. నిన్నుఁగుఱించి యొకమంత్రి రాజునకుఁ దెలియఁజేసినచో ఆ వారకాంతా రతిపరిమళోద్గార శిలావేశ్మ కుట్టిమములయందు తనయొడలు తాను తెలియని రాజు పట్టించుకోఁడు. పట్టించుకొన్నచో వీరు భయపడినట్లే రాజును భయపడవలయును. ఇది నేను రాజునందు ద్వేషముచేత చెప్పుటలేదు. మీ నాయనగారియందు నాకుఁగల ప్రేమచేత చెప్పుటలేదు. రాజ్యముయొక్క క్షేమమునుఁ గూర్చి యాలోచించి చెప్పుచున్నాను. ఇప్పు డెవఁడో యొకఁడు రాజ్యముయొక్క సర్వభారమును తనంతట తానెత్తికొని బుజాన వేసికొననిచో రాజ్యము చిద్రుప చిద్రుపలగును. ఆరాజు పరమ స్త్రీలోలుఁడు. అతని శరీర మీపాటికే పుచ్చిపోయి యుండును. తేపు దూలమువలె విఱిగిపోయినచో పుచ్చినముక్కలు కొట్టుకొని పదిమందియు తమ ప్రొయ్యిలలోఁ బెట్టికొందురు. ఈరాజ్యము చిద్రుపలు చిద్రుప లగును.

అట్టి స్థితినుండి యెవ్వఁడో యొకఁడు రక్షింప వలయును. సత్పురుషులకు నసత్పురుషులకు భేద మిట్లుండును. అసత్పురుషుఁడు చేతికందినది దక్కించుకొనును. సత్పురుషుఁ డట్లు చేయుటకు వెనుకాడును. లోక మేమనుకొనునో? తన్ను స్వార్థపరుఁ డనుకొనునేమో? తాను రాజద్రోహి యనుకొనునేమో! ఇన్ని విచారణలు సత్పురుషుఁడు చేయుచుండును. ఈ లోపుగా నసత్పురుషుఁడు దానిని కొట్టివేయును. ధనమో రాజ్యమో యెవ్వఁడో యొకఁ డనుభవించవలసినదే. వానిమీఁద నొకని కధికార మేర్పడ వలసినదే. సత్పురుషుఁడు తూష్ణీంభావము వహించి యూర కుండరాదు. ఎందుకనఁగా నధికారములును రాజ్యములును దుర్జన హస్తగతములై ప్రజావిపత్తికి హేతువగును. అట్టి విపత్తి లోకమునకును ప్రజలకును తప్పించుటకై స్వార్థపరుఁడు కాకపోయినను రాజభక్తి లోపించకున్నను, సత్పురుషుఁడు తాను గ్రహించక తప్పనిచో నా యధికారమును గ్రహించి తీరవలయును. ఆయధికారమును సత్పురుషుఁడు స్వీకరించును. లోక మతనిని స్వార్థపరుఁడనియు దురాశాపరుఁడనియు, ననునని గదా యతని భయము. ఒక గడ్డు సమయములో నీసత్పురుషుఁడు దురన్యాయము జరుగుచుండఁగా దూరముగా నిలుచుండి చూచుచున్నాఁడు. ఆ దురన్యాయము జరిగిపోయి నది. లోక మేమనును? అతఁడు సమర్థుఁడు. అతఁడు చేసి కొనినచో నీ యాపద వచ్చెడిదికాదు. అతఁడు సత్పురుషుఁ డని మన మనుకొన్నాము. అతఁడును కుత్సితుఁడే. ఈ ప్రజావిపత్తున కతఁడు హేతువు. — లోక మిట్లనును. ఇది

యపనింద కాదా? నీవుగాని మీ నాయనగారుకాని నేను మిమ్ము దుర్వ్యవసాయమునఁ బ్రవేశపెట్టుచున్నానని యను కొందు రేమో నాకుఁ దెలియదు. నేను మి మ్మీ రాజ్యము నపహరించుడని యడుగుటలేదు. చెప్పుటలేదు. మీ కీ రాజ్యము వచ్చినచో నా కేమియు లాభములేదు. నేను మీ నాయనగారినిఁ బెండ్లియాడఁబోవుటలేదు. నీకును నాకును సంబంధమే లేదు. నేను చెప్పున దేమనఁగా రాజు తానెల్లు దుర్నీతి పరుఁడై యుండెను. రాజ్యమునకు సరియైన రక్షణ లేదు. మంత్రులందఱు కుమ్మ పెట్టిన నిప్పులవలె నున్నారు. అందుచేత మీరు రాజుయొక్క నీతిరాహిత్యమువలన నీ కుమ్ములు మండి భిన్న భిన్న ప్రాంతములను తగులఁబెట్టక మున్న యీ కుమ్ముల నెచ్చటి వచ్చట నార్పివేయు డను చుంటిని. నీవు పెద్దగా నెగడి వెలిఁగించుము. కుమ్ముంవంక చూచెడివాఁ డెవఁడు? మీరు రాజ్యమునం దాశపెట్టుకొన వలదు. మీ రాజభక్తికి లోపము నీయవలదు. రాజ్యము లోన లోనఁ బుచ్చి చిద్రుపలు చిద్రుపలు కాకుండ చూడ వలసిన బాధ్యత మీ తండ్రికొడుకులయం దున్నది. రాజు కొడుకు నెలలు దాటనివాఁడు కలఁడని విన్నాను. రాణియు కొడుకుగూడ విదిశలోననే యున్నారట. ఆమె యచ్చటనే ప్రసవించినది. కొన్ని నెలలక్రింద రాజునకు పుత్రోదయోత్స వము చేసిరికదా! రాజు చనిపోవచ్చును. అట్టి రాజులు రాజయక్ష్మ పుట్టి చత్తురు. విచిత్రవీర్యుఁడు చనిపోలేదా? రాజు కొడుకు పసివాఁడు. మీ కంతటి రాజభక్తి యున్నచో

నా పసివాని పేరుమీదుగా రాజ్యము చేయుడు. ఆ పసివానికి వయసు వచ్చువఱకు మీరు రాజ్యము పాలించి చివరి కతని రాజ్య మతని కిండు. రాజ్యమునందుమాత్రము విప్లవములు కలుగకుండ రక్షించవలసిన బాధ్యత మీకున్నది. నేను చెప్పు చున్న దది. సర్వసేనలు మీ నాయనగారి చేతిలోనున్నవి. ఎవ్వఁడు నేమియు చేయులేఁడని నీ వనవచ్చును. సేనలుచేసెడి పని చివరకు ప్రజలలో నెన్నిఘోరములైనను జరుగవచ్చును. అట్టి యంతర్విప్లములనుండి రాజ్యమును రక్షించుటకు సేనాపతి పనికిరాఁడు. మంత్రి కావలయును. నీ వామంత్రివి కమ్ము. యలోప్యుద్యోగమును వదలిపెట్టుము. నీవీయుద్యోగముచేయుట మీ నాయనగారి కిష్టములేదని నాకు తెలియును. ఉద్యోగము వదలి ప్రతిదినము మంత్రి మండలమునకు పొమ్ము. అచటనే గూర్చుండుము. వారు ని న్నడుగుదురు. చెప్పుము. అడుగకుండ కూడ చెప్పుము. అధికారమును వహించుము. ఎవఁ డధికారమునువహించునో నానియం దధికారము స్థిరమగును. ఇది లోకముయొక్క లక్షణము. అధికసంఖ్యాకులు మందబుద్ధులు. అధికార మెవఁడు చేయుచుండునో వానికి సహజముగా లొంగిపోదురు. దురధికారులు ప్రతిభావంతులుకారు. వారిమాట సాగుటకు మందప్రతిభమైన లోకము హేతువు.”

ఇంతసేపు భూమిమిత్రుఁడు మంచము మీఁదఁ గూర్చుండి తలవంచికొని కన్నులు మూసికొని యామె మాటలు వినుచుండెను. ఆమె యతనికభిముఖముగా నుండెను. గదిలోనికి వచ్చు మార్గము దెసకు నామె వీపు త్రిప్పఁబడి

యుండెను. ఆమె యుపన్యాసము ప్రారంభించినంతనే వాసుదేవుఁ డాగదిలోనికి వచ్చెను. ఆమె వెనుక నిలుచుండెను. ఆయన వచ్చినసంగతి యమృతవల్లికిఁ దెలియదు. భూమిమిత్రుఁడు తండ్రిని చూడలేదు. దీపము భూమిమిత్రునకు నమృతవల్లికి నడిమి ప్రదేశమున నున్నది. వాసుదేవుని నీడ పాఱుటకుఁగూడ వీలులేదు. ఆమె యాపివేసెను. భూమిమిత్రుఁడు కన్నులు తెఱచెను. తండ్రి కనిపించెను. లేచి నిలుచుండెను. అతని కన్నులలో నమృతవల్లి వాసుదేవుని రాకను గుర్తించెను. ఆమె వాసుదేవునిఁ జూచెను. ఆమె యిట్లనెను. "నే నన్నమాటలు మీరుగూడ వింటిరికదా? ఇది నా నిశ్చయము. ఇది రాజ్యమునకు క్షేమము. భూమిమిత్రుఁ డట్లు చేయవలయును. భూమిమిత్రునకు నేను చెల్లెలి వంటిదానను కాను. అతఁడే యొప్పికొన్నాఁడు. నేను తల్లి వంటి దానను. ఇది నా యాజ్ఞగా భూమిమిత్రుఁడు పాలించవలయును. ఇది మీ యిద్దఱకు శ్రేయము. మగధరాజ్యమునకు శ్రేయము. ఇందులో రాజు ద్రోహములేదు"— ఆమె వెడలిపోయెను. తండ్రి కొడుకు లట్లే నిలుచుండిరి.

## 3

అమృతవల్లి వాసుదేవుని యింట సర్వదా నివాసము చేయుచుండెను. తల్లిదండ్రు లెందుకని యడుగరు. ఆమె యచ్చట నేబంధుత్వ రేఖాబలముచేత నున్నదో యామెకే తెలియదు; వాసుదేవునకుఁ దెలియదు. భూమిమిత్రునకుఁ దెలియదు. ఒక్క వాసుదేవుని భార్యకే తెలియును. శ్రీమాలియు నమృతవల్లియు నిద్దఱును తన కడుపునఁబుట్టిన బిడ్డలు. శ్రీమాలికంటె నమృతవల్లియే తన కెక్కువ ప్రియమైనబిడ్డ. తన చేతి కక్కఱకువచ్చుచున్న బిడ్డ. శ్రీమాలి తన్ను వదలి పోయెను గాని యమృతవల్లి వదలిపోదు. ఆమెకుఁగూడఁ బెండ్లిచేసి పంపనక్కఱలేదా? ఆమెను పంపినచో తనకుఁ బ్రాణములు నిలువవు. అంతగాఁ బెండ్లిచేయవలసి వచ్చినచో నెవరికో యిచ్చి వాని నిల్లరికముంచుకొనును. ఆమెయు నామె భర్తయు తన ఇంటిలోననే యుందురు. అమృతవల్లికి నాయింట సర్వాధికార మేర్పడినది. ఆ యింటనేకాదు. సర్వ సైన్యముమీఁద నామె కధికార మేర్పడిన దనవచ్చును. ఆ యింటికి సేనానులు వత్తురు. దుముదారులు వత్తురు. చమూపతులు వత్తురు. మఱియు నెందఱో యధికారులు వత్తురు. అందఱు నమృతవల్లియొక్క దయకొఱకుఁ బ్రతీక్షించెడివారే.

కాలంజరి భర్తను వెదకుటకు వెళ్ళినవారు పదునేను దినములలో సఫల ప్రయత్నులై వచ్చిరి. ఆ కాలంజరి భర్త

పేరు రామడుగు. అతఁడొక చెట్టుక్రింద సొమ్మసిలి పడిపోయి యుండెను. ఈ యన్వేషణకు వెళ్ళినవారిలో నొకఁ డతని దగ్గఱకుఁబోయి వానినిఁ బరీక్షించి వానికి శైత్యోపచారములు చేసి అచటికి కొంత దూరముననున్న చెఱువులోని నీళ్ళు తెచ్చి వాని మొగమునఁ జల్లి వాని నోటిలో కొన్ని నీళ్ళుపోసి కొంతసేపటికి నతఁడు తేరుకొనగాఁ దనవద్ద నున్న తినుబండారము వానికిచ్చి వానిని నీ దేయూరని యడిగెను. వాఁడు గిరివ్రజపురమనెను. "నీ వృత్తియేమి" "నేను కాలజ్ఞానము చెప్పుచు బిచ్చమెత్తికొందును." "నీభార్య పేరేమి." "నీ కెందుకు? నీ వెవఁడవో దొంగవు. నా భార్యను దొంగిలించినవారిలో నీవుకూడ నొకఁడవా? నీ పేరు నాకుఁజెప్పుము. నిన్నుఁగుఱించి స్థానికునకుఁ దెలియఁజేసెదను. (స్థానికుఁడనఁగా నగరాధికారి) "ఓయీ! నేను రాజ సైనికుఁడను. అమృతవల్లీదేవి నిన్ను వెదకుటకు మమ్ముఁ బంపించినది. మేము చాలమందిమి బయలుదేరితిమి. నే నిచ్చటికి వచ్చితిని. నేను మీకు మిత్రుఁడనుకాని శత్రుఁడనుకాను." "ఆ యమృతవల్లి యెవరో నాకుఁ దెలియదు. ఆమెకు నాకు సంబంధములేదు. ఆమె నా భార్యను పట్టించి దొంగిలించి యుండును. నన్ను సంహరించుటకు నన్ను వెదకించుచున్నది. ఆమె యెవరయ్యా ఆమె యెవరు?" "ఆమె మహాసేనాధిపతి వాసుదేవుని యొక్క దగ్గఱిచుట్టము. అధికారమంతయు నామెదే." "అట్లు చెప్పుము. సేనాధిపతియా? ఈ సేనాధిపతులు కర్కోటకులు. వాసుదేవుఁడు మఱియుఁ గర్కోటకుఁడు. అతనినిఁ గుఱించి నాకుఁ దెలియును. నేను రాను పో"

"నీవు రానిచో నిన్ను బంధించి తీసికొనిపోదాము."

"నాకు తెలుసునయ్యా బాబూ నాకు తెలుసు. నే నీ వ్యూహములో తగుల్కొన్నానేమి? నా కీ సంబంధమేమి? నా కీ యాపద యెందుకువచ్చినది? అయ్యయ్యో! వాసు దేవుని పేరు నాకు తెలియుటకూడ తప్పయ్యెనా? నేను దెలిసికొనవలయునని తెలిసికొంటినా? బిచ్చమెత్తుకొను చుంటిని. దానికి పాటలు నేర్చుకొంటిని. పాటలు పాడు వానికి బిచ్చమెక్కువ వేయుదురు. ఆపాటలు నాకర్మము జాలక యీపాటలైనవి. అది నాతప్పు. ఇట్లు జరుగునని నే నెవ్వరితోడను చెప్పలేదయ్యా! ఇప్పుడా పాటలే పాడుట లేదయ్యా. ఒకసారి నాకు శాస్తి జరిగినది. "ఓరిమూర్ఖుఁడా! అమృతవల్లి దేవిగారు చెప్పనేచెప్పిరి. నీకు భార్యావియో గముచేత మతిచెడిపోయి యుండునని. నీకు మతిచెడిపోయి నది. ఆమె నిన్నేమియు చేయలేదు. ఆమె దయావంతు రాలు. ఆమె నీభార్యను దొంగిలించె నందువా? దొంగి లించినచో మాకుఁ దెలియకుండ నెట్లు దొంగిలించును? దాఁచె నందువా? దాఁచినచో మాకుఁ దెలియకుండ నెట్లు దాఁచును? చెఱసాలలో పెట్టెనందువా? మాకుఁ దెలియ కుండ నదికూడ సాధ్యముకాదు. నేను చెప్పుచున్నాను, వినుము. ఆ యమృతవల్లీదేవి నీ భార్య నెఱుఁగనే యెఱుఁ గను. ఆమె కెట్లుతెలిసెనో నీభార్యనెవరో యెత్తికొనిపోయి రని తెలిసెను. భార్యావియోగ దుఃఖముచేత నీవిట్లయి యుందువని యామె గ్రహించెను. నీభార్యయన్నచో నామె కెంతయో యాదరము. నిన్ను వెదకించుచున్నట్లే నీ భార్యను

కూడ వెదకించుచున్నదిరా మూర్ఖుఁడా! నీకు భయములేదు. నావెంట రమ్ము." నేనురాను. "ఓయీ! ఇది రాజాజ్ఞ. సేనాపతియాజ్ఞ. రాననుటకు వీలులేదు. మేము తీసికొని వెళ్ళెదము. ఒక్కమాట చెప్పెదను వినుము. భయము లేనిచోటికి బలవంతముగా పోవుట యెందుకు?" "నాకేమియు నాపద జరుగదని నీవు మాటయిచ్చెదవా?" "నిస్సందేహముగా నిత్తును." "నీ విచ్చెదవు. అక్కడకు తీసికొనిపోయిన తరువాత వారు నన్ను బాధించినచో నీవేమి చేయఁగలవు? మీరు మంచివారే కావచ్చును." "నీకేమియు భయము లేదు. నామాట నమ్ముము. ఓయీ! మేము రాజభటులము. నిన్ను బెదరించి బలవంతముగాకూడ తీసికొని పోవచ్చును. నిన్ను మంచిమాటలుచెప్పి తీసికొని పోవలసిన యవసరమేమి? దోషియైనవానిని రాజభటులు లాలించరు." "నిజమే. పద. వత్తును." అతఁడు రామడుగును తీసికొని పోయెను. అమృతవల్లి రామడుగునుఁ జూచెను. అతనికొక ప్రత్యేకమైనచోటు విడిదిగా నేర్పాటుఁజేసెను. అతనితోఁ బలుసార్లు ప్రసంగించెను. అతనికి జయద్రథుని కథయే తెలి యదు. ఒకసారి కాలంజరి తనకువచ్చిన స్వప్నమునుఁగూర్చి భర్తతోఁ జెప్పెను. అతఁడు దానిని నిరాదరించెను. అందులో నున్న రహస్యమంతయు నమృతవల్లి వానికిఁ జెప్పెను, వాఁడు క్రమముగా నగ్ధముఁ జేసికొనెను. సృష్టిలో నిటువంటి వారుందురాయనెను. అమృతవల్లి యిట్లనెను. "ఓయీ! నీకోస మెందుకు వెదకించితి ననఁగా నీతో నాకుఁ జాల పని యున్నది. నీభార్యకు నీమీఁదఁ జెప్పరానంత ప్రేమ.

ఆసంగతి నాకుఁ దెలియును. కాని యామె జీవలక్షణమెట్టిదో అభౌమములైన విషయములకు తేలికగా నెక్కును. ఆదోషము ఆమె యాత్మలోనున్నది. ఆమె మనస్సు రెండులక్షణములు కలది. ఒకలక్షణము జీవితమునందలి ధర్మము, పాతివ్రత్యము మంచితనము, పరోపకారము, ఔదార్యము. రెండవలక్షణ మేమనఁగా దయ్యములయందు విశ్వాసము. దేవతలయందు ననురాగము; బయటనుండి యొక దుష్టమైనశక్తి యభౌమ మైనది తనమీఁదకు వచ్చినచో తాను దానిని త్రోసికొనలేదు; ఆమెయందింకొక దుర్గుణ మున్నది; ఆదుర్గుణము మూలముగా నామె యా జయభద్రునకు వశమైనది; ఆదుర్గుణ మేమనఁగా తాను పారలౌకికమైన యొకదానియందు నమ్మకముకలిగి యుండవచ్చును; ఆనమ్మకము సర్వవ్యక్తులకు తమకు సంబంధించినదే యైయుండవలయును; ఏవ్యక్తి యావిశ్వాసమును తనకుఁ దానే యుంచుకొనక పరుల కావిశ్వాసమును వ్యాపింపఁ జేయుటకుఁగాని తనవలె విశ్వసించని పరులయందు పగతీర్చు కొనుటకుఁగాని ప్రయత్నించెడి స్వభావముకలదో యావ్యక్తికి లోకమునం దాపదయున్నది; ఆధ్యాత్మిక జీవనము వైయక్తికమైనది; భిన్నజీవులయొక్క సంస్కారములు భిన్నములుగా నుండును; ఒకజీవి నమ్మినవిషయము మఱియొకజీవి నమ్మనక్కఱలేదు; శతవిధాల నమ్మఁడు; ఇతరుని నమ్మించవలయుననిగాని, ఇతరులు నమ్మలేదని కోపము తెచ్చుకొనుటగాని యేవ్యక్తిచేయునో యావ్యక్తి యాపద రెండువిధములుగా రావచ్చును: భౌమముగా రావచ్చును; అభౌమముగా రావచ్చును; వాఁ డితరుల కాపదచేయును; ఇత

రుల కాపదచేసెడువానికి నాపదరాదని నమ్మకమేమి? మఱియు నాంతరముగా రావచ్చును; వానిమనస్సు విచిత్రమైన యూహాలుకలదియై యుండును; వాఁడు తనశత్రువునకు నపకారముచేయ వాంఛించును; శత్రువున కపకారముచేయ వాంఛించెడివ్యక్తి తనమనస్సులో నెన్నివిధములుగా వాని కపకారమును భావించును; చెప్పుటకు వీలులేదు; ఒక దయ్యమో, ఒక పిశాచమో, తనకు స్వాధీనమై తన చెప్పు చేఁతలలోనుండవలయుననియు తన విరోధిమీఁద నాదయ్యము ను ప్రయోగించి వానికిఁ దెలియకుండ వాని కాపద సమ కూర్చవలయుననియుఁగూడ భావించును; ఈరీతిగా వాని మనస్సు పిశాచములకు స్థావరమగును; అట్టివాని మనస్సు నందు పిశాచములు సులభముగాఁ బ్రవేశించును. నీ భార్య యొక్క స్థితి యిట్లైనది. కాని యామె యాత్మ ద్రవ్యము మంచిది. నీయందు భక్తురాలు, నీ వన్నచో నామెకుఁ బంచ ప్రాణము. ఆమెను పట్టిన పిశాచమునకు నీసంగతి తెలియును. నీవు దగ్గఱ నున్నచో నా పిశాచముయొక్క యాటలు సాగవు. అంతగా సాగవు. అందుచేత నీనుండి యామెను వాఁడు తొలఁగించెను. నీవు నీభార్య యెచ్చట నున్నదో తెలిసికొని మఱల నామెనుఁ గలసికొన్నచో నా పిశాచము యొక్క శక్తి సగానికి సగము తగ్గిపోవును. అదియొక మాట చెప్పెను. నీ వింకొక మాట చెప్పుదువు." రామడుగు:- అది యొక మాట చెప్పఁగానే నింకొక మాట యేమి చెప్పఁగలను? నేను పిశాచమున కెదురుమాటాడఁగలనా? అమృత:- వాని కంటె పిశాచ మింకొక వ్యక్తి యున్నది. వానికి సమాధాన

మేమి చెప్పవలయునో యావ్యక్తి నీకు చెప్పుచుండును. నీవు నీభార్యతో నామాటలు చెప్పుచుండుము. రాముడుగు:- ఆ వ్యక్తి యెవరు? అమృత:- ఓరి మూర్ఖుడా? ఆ పిశాచ మెవరో నీకు తెలియును గనుక ఈ వ్యక్తి యెవరో నాకు తెలియుట? నీకుఁ గావలసినది నీ భార్య ఆమె మరల నీవద్దకు రావలయును. ఆ పిశాచ మామెను వదలి పోవలయును. ఇదియేగదా నీకు కావలసినది. రాముడుగు:—— చిత్తము. చిత్తము. అమృత:- అయినచో నేను చెప్పినట్లు వినుము. రాముడుగు:- విందును. ఏమి చేయవలయునో చెప్పుము. అమృత:- నీవిప్పు డిచ్చటనే యుండుము. నీ భార్యను వెద కించు చున్నాను. ఆమె యెచ్చటనున్నదో తెలిసినతరువాత నిన్నామెవద్దకుఁ బంపుదును. అంతవఱకు నీవేమియు చేయ నక్కఱలేదు. నీవిచటనే యుండుము. నీకు తిండి సరిగా జరుగును. రాముడుగు:- చిత్తము. అమృత:- కాని నీవు బిచ్చమెత్తుకొనుచున్న పాటలు నాకు వినిపించ వలయును. రాముడుగు:- ఆ పనిమాత్రము నన్నడుగకుడు. ఇంక నే నా పాటలు పాడనని యొట్టు వేసికొంటిని. ప్రతిజ్ఞ పట్టితిని. నే నా పాటలు పాడినచో పరలోకమునకు చెడినట్లే, ఆత్మహత్య చేసికొన్నట్లే. అమృత: అంత యొట్టు నెందుకు వేసికొంటివి? రాముడుగు:- ఈ పాటలు మూలముగానే నా భార్య నాకుఁ గాకుండఁ బోయెను. అమృత:- ఓరి పిచ్చి వాఁడా! నీ భార్య నీకుఁ గాకుండఁ బోయినది పాటలవలన కాదు. నే నిందాక చెప్పిన నీ భార్యయందలి సూక్ష్మమైన ప్రకృతి రహస్యమువలన. నీభార్య మరల దొరుకునంటినిగదా.

ఆమెను నీకప్పఁజెప్పు బాధ్యత నాదియంటినికదా ! నీ భార్య నీకు దొరకినచో నా పాటలు పాడినచో నీకేమి నష్టము? రామడుగు:- ఆమె నాకు దొరకినచో నాకేమియు నష్టము లేదు. అమృత:- నీవు వేసికొనిన ఒట్లను వదలిపెట్టి యా పాటలు పాడుదువా? రామడుగు:- పాడుదును. అమృత:- అయినచో నేను నీ భార్యను నీకు చూపింతునంటినికదా! ఆ పాటలు పాడుము. రామడుగు:- అమ్మా! నేను బిచ్చగాఁడనే. మీరు రాజస్త్రీలు. మాకును కొంత తెలివి యుండునుగదా. నా భార్యను నా కన్నులకు చూపించుడు. ఆమె యేస్థితిలోనున్ననైనను సరే ఆమె నా కంటికి కనిపించిన తరువాత ఆమెను నా కంటికిఁ గనిపింపఁజేసి అప్పుడు పాడుమనుట న్యాయముగాని ఇప్పుడుపాడుమనుట న్యాయము కాదు; అమృత: నిజమేనోయి, కాని——

అమృతవల్లి కాలంజరి యెచ్చటనున్నదో తెలిసికొనుటకు లక్షప్రయత్నములు చేసెను. ఆమెయొక్క నిశితమైన బుద్ధి కాలంజరి నిస్సందేహముగా విదిశానగరమున నుండునని నిర్ణయించినది. విదిశానగరము గాలింపించినది. ఇప్పుడు విదిశానగరము రాజు నివసించు స్థలమగుటచేత నామహానగరములోనికి రాకపోకలు మిక్కిలి దుర్లభముగా నుండెను. దుర్నీతిపరుఁడైన రాజున కుండునంత ప్రాణభయము మఱెవ్వరికుండును? అందులో దేవభూతి పరమాప్తుంకుఁగూడ స్త్రీ విషయమున ద్రోహముచేయుటకు వెనుకాడుటలేదు. తన ప్రాణదాతయైన వానిభార్యయైననుసరే నామెయందు నేచెడిపెయైన దాసియో రాజునకు మరులుగొల్పినచో నతఁడు వెనుఁ

దీయుటలేదు. విదిశానగరమంతయు నట్టుడికిన ట్లుడికిపోవు చున్నది. వచ్చినవార్తలిట్లువచ్చినవి. మంచిలేదు. చెడ్డ లేదు. బ్రాహ్మణుఁడనిలేదు - క్షత్రియుఁడనిలేదు. శూద్రుఁ డనిలేదు - సత్పురుషుఁడనిలేదు. అధికారియనిలేదు. సోమ యాజియనిలేదు. వానిభార్య సౌందర్యవతియని యే కొం కికి మనసుగల చేటియో సేవకుఁడో చెప్పినచో నామెను బలవంతముగాఁ బిలిపించుటయే. అవసరమైనచో నాభర్తను సంహరించుటయే. వాని యాస్తినంతయు నపహరించుటయే. ఇట్లున్నది రాజుస్థితి. విదిశాపుర ప్రజలందఱు ప్రాణములు చేతులలోఁబూని బ్రతుకుచున్నారు. ప్రతివానికిని రాజు మీఁద నాకంతముగ నున్నది. రాజు తొలుతనే తనసైన్య మును నాల్గుభాగములు చేసెను. ఒకభాగమును తనక్రిందనే యుంచుకొనెను. ఆభాగమంతయు విదిశానగరముననేయున్నది. రాజుమాట కెదురాడుటకు వీలులేదు. నగరము నగర మంతయు సైనికాధికారులచేతఁ బరిపాలింపఁ బడుచున్నది. ఎవ్వఁడును నోరెత్తుటకు వీలులేదు. రా జొకయుద్యోగిని రమ్మని వార్తనంపించును. రాజునకు వేఱేపనిలేదు. ఎందు కని పిలిపించును. ఒకనికి వార్తవచ్చెననఁగా వానిభార్యయో వాని చెల్లెలో వాని కూతురో రాజునకు వాంఛనీయురాలైన దని యర్థము. ఆమెను పొందుటకు నీ పురుషుఁ డడ్డంకి గాఁ గలఁడు. ఇతనిని వేఱే పనిమీఁద దూరదేశముఁ బంపిం చును. ఇది మొదటిమెట్టు. సర్వసామాన్యమైన వ్యవహారము. ఇది రాజాజ్ఞ. కాదనుటయెట్లు? ఒకవేళ నెవఁడైన సకుటుంబ ముగఁ బోదునన్నచో వాఁడు ఱేపుప్రొద్దుననే తిరిగివచ్చును

కాదా? పంపింపఁబడు నప్పటియాజ్ఞాపరిధి యంతయేకదా? మఱియు రాజునకు నాపురుషునకు సంబంధించిన యేస్త్రీ మీఁద కోర్కి గలదో తెలియదు. ఇంటిలో పదిమందిస్త్రీలు కలరు. యువతులు కలరు. ఎవఁడైనను తెప్పప్రొద్దున తిరిగి వచ్చెడుదానికి తనయింటిలోని పదిమందిని పొరుగూరికి వెంటఁ దీసికొని పోవునా? తెప్పప్రొద్దున వాఁడు తిరిగిరావచ్చునని ఈనాఁటియాజ్ఞ; అతఁ డచ్చటనుండఁగా నచటినుండి మఱి యొకచోటికి పోవలయునని వేఱొకయాజ్ఞ యచ్చటికివచ్చును; వాఁడింటి కెప్పుడు తిరిగివచ్చునో యెవ్వరికిఁ దెలియదు; విదిశానగర మొక విచిత్రమైన దేశముగా మాఱెను; ఆమహా నగరములోఁ బురుషు లున్నట్లులేరు; అందఱును స్త్రీలే; పురుషులున్నారు: వారందఱును సైనికులు; ఏవీథి వెంటఁ బోయినను నాయసపరిఘములవలె నిట్టనిటారుగా యొరనుండి తీసిన ఖడ్గములు భుజములందుంచుకొని నిలుచున్న సైనికు లును, వన్నె వన్నెల చీరలుకట్టి కేశపాశములయందు పలు రకములైన పూవులు పెట్టికొని యొయ్యారముగ నడచుచుఁ బోవుచున్న యువతులే; పొద్దుమునింకవలయు, విదిశానగ రముయొక్క శోభచూడవలయును; ఆ మహానగరమున పెద్ద దేవాలయములు పది కలవు; ప్రతిదినము నా దేవా లయములలో నొక నాటకమో, నొక పాటకచేరియో, యొక భరతశాస్త్ర ప్రదర్శనమో జరుగుచుచేయుండును; యువతు లందఱు సాలంకృతలై రమ్యవేష ధారిణులై యేదో దేవా లయమునకు పోవుచునే యుందురు; ఒకనాఁడు ఘృతాచి మధుర కృష్ణస్వామి దేవాలయములో నాట్యముచేయును;

ఘృతాచియనఁగా నిజముగా స్వర్గమునుండి దిగివచ్చినదే యనవలయును; ఆమె మహారాజుగారిముందు నాట్యము చేసినదట; మహారాజుగారు తన మెడలోనున్న ముత్యాల హారములను స్వహస్తములతో నామె మెడయందు నలంకరించిరట; ఆమె యంత గొప్ప నాట్యకర్త్రి; ఇంకొక దేవాలయములోఁ గంసవధ నాట్య మాడఁబడుచున్నది; దేవకీదేవి వేషమువేసెడు సుకుమారియన్న వారాంగనయొక్క యందముముందు మూఁడులోకములు పట్టవట; అట్టి యందకత్తె గర్భమునందు శ్రీకృష్ణుఁడేల యుదయించఁడు; ఆమెను చూడని జన్మ మెందులకు? ఈ కంసవధ చాల పురాణమైన నాటకము. నాలుగైదువందల యేండ్లనుండి భారతదేశమున నాడఁబడుచున్నదట. ఇట్లొకదానినిమించి యొకచోటి వినోదము స్త్రీల హృదయము నాకర్షించి తాండవించుచుండెను. గృహములలో నెవరో వృద్ధులుమాత్రమే యుండుచుండిరి. పసిపిల్లలను చంకవేసికొని అన్నము వండిపెట్టి తాముపచ్చుట యాలస్యమైనచో భర్తలను వడ్డించుకొని తినవలసినదిగాఁ జెప్పి స్త్రీలందఱు బహు వినోదస్థానములకుఁ బోవుచున్నారు. ఒక్కొకప్పుడు దూరము పోదురు. ఒక్కొకప్పుడు దగ్గఱయే కావచ్చును. మహానగరమునందు సర్వశకటములు నడచుచున్నవి. ఏ బండివాఁడైనను స్త్రీలడిగినచో తాను వెళ్ళుదమన్న చోటికి నూరకయే యెక్కించుకొని పోవలయును. ఆ రథచోదకు లందఱకు రాజుగారే నెల జీతము లిచ్చుచున్నారు. ఆ రాజుయొక్క యౌదార్యము పొగడని నోరు లేదు. ఇట్టి స్త్రీలును, అట్టి సైనికులుకాక మూఁడవ తెగవారు

నగరములో నడచుచున్నారా లేదా యన్నట్లున్నారు. వారు తృతీయా ప్రకృతులు. రాజునకు నర్మసఖులు. వృద్ధ దాసీ జనము. వారు వీథులవెంటఁ బోవుచునే యుందురు. అందరితోఁ గలిసి మాటాడుచునే యుందురు. తమ వికారచేష్టల చేత సౌందర్యవతులను నవ్వించుచునే యుందురు. తృతీయా ప్రకృతులు స్త్రీలవలె నటించుచు, నూత్న యౌవన దశాస్థితలైన బాలికలకు నెంతయైన మనోవికారమునుఁ గలిగింతురు. వారియందు సరిగా మేల్కొనని కామవాంఛలను విచిత్రముగా మేల్కొల్పుచుందురు. వారు రాజుయొక్క సుగుణములను సౌందర్యమును, వాని యౌదార్యమును, వాని యితర స్త్రీలతోడి శృంగార రసబంధమైన హావభావములను సన్నఁగా చెప్పనట్లుగా, తమకు తెలిసిన విషయమును చెప్పుట తమ ధర్మమైనట్లుగా, దానికి వేఱే ప్రయోజనము లేనట్లుగా, తమకు రాజాంతఃపురమునందుఁగల చనవును భాసింపఁ జేయుటకే మాత్ర మన్నట్లుగా నుపన్యసింతురు. ఇంతమంది యువతులు పలుచోట్లకు వినోద దర్శనముకొఱకుఁ బోవుచునే యుందురు. ఒక్కొక్క దేవాలయముప్రక్క నొక్కొక్క పెద్ద యుద్యానవన ముండును. అది యా దేవునికొఱ కుద్దేశింపఁ బడినది. ఆ యుద్యానవనములో నడుమ నడుమ పెద్ద పెద్ద చెట్లు, దిగుడుబావులు, బావులలోనుండి పూల మొక్కలకు నీరు ప్రవహింపచేయుట కేర్పడిన రాతి కట్టడపు సన్నని తూములు బహువిధములైన పుష్పవల్లులు నికుంజములు, చంద్రకాంత శిలావితర్దికలు, అది దేవోద్యానము కాదు. తత్పురీ వారకాంతా విహారార్థ మేర్పడిన రమణీయ

ప్రదేశములుగాఁ గనిపించు కొన్ని కొన్ని యుద్యాన వనము లలో కొన్ని వితర్దికలకు కొన్ని నికుంజములకు కొన్ని వృక్ష ములకు సంబంధించిన కథ లున్నవి. ప్రసిద్ధులైన నాయికా నాయకుల కథ లెన్నో కలవు. శృంగారరసము వారిని సంబం ధించి మాత్రమే పూర్వము ప్రవర్తించెనా యన్నంత రమ ణీయ కథాసంవిధాన మధురములైన నాయికా నాయకుల కథ లచట చెప్పికొందురు. ఒక వితర్దికమీఁద రాజకుమారుఁ డైన యొకపురుషుఁడు తత్కాలమునందలి పరమసుందరియైన యా భోగిని వారిద్దఱు కూర్చుండి తాంబూలసేవనము చేయు చుండిరట. తత్కాలమున నెవఁడో గంధర్వుఁడు వియన్మార్గ మునఁ బోవుచు నామె నాహరించెనట. ఆ రాజకుమారుఁడా వితర్దికమీఁదనే పండుకొని ప్రాయోపవేశముచేసి ప్రాణములు వదలెనట. ఇదియొక వితర్దికాకథ. ఇట్లే యొక నికుంజమునుఁ గూర్చి మఱియొక కథ. ఒక వృక్షచ్ఛాయనుగూర్చి వేఱొక కథ. అందందు నేఁటి రాజైన దేవభూతినిగుఱించియే కథలు కలవు. ఒక వృక్షముకలదు. ఆ వృక్షచ్ఛాయ దేవభూతి యొక్క భార్యలలో నొక్కర్తుక పగటి రెండుజాముల వేళ బోదె నానుకొని నిలుచుండఁగా రాజు వెనుకనుండి వచ్చి చెట్టు బోదమాటుగా నిలుచుండి తనపైనున్న సన్నని పట్టు జరీ సేలువతో నామె వక్షస్థలముమీఁద చుట్టుగావేసి రెండు కొంగులు లాగి వెనుకకు బిగించి కట్టెనట. ఇట్టి చమత్కార ములు దేవభూతినిఁగుఱించి పది దేవాలయముల ప్రక్కనున్న పది యుద్యానవనములలో నొకచోటి మల్లీనికుంజము, నొక

చోటి సప్తపర్ణము, మఱియొకచోటి చంద్రకాంత వితర్దిక, పలు కథల కాశ్రయములుగా నున్నవి.

ఇట్టి మహానగరమున సర్వవేళల గాటమైన రాజసైని కుల తీక్ష్ణమైనదృష్టి ప్రసరించుచోట నమృతవల్లి తన చారు లను ప్రయోగించలేకపోయెను. తొలుతఁ గొందఱు సైనికు లనుఁ బంపించెను. ఆ సైనికులకు విదిశానగర ప్రవేశము సాధ్యము కాదయ్యెను. తొలుతనే యా సైన్యముతప్ప తక్కిన సైన్యము విదిశానగరమునందు రా నక్కఱలేదని రాజు గట్టిగా నాజ్ఞాపించెను. ఆరీతిగా నమృతవల్లియొక్క ప్రయ త్నము వ్యర్థమయ్యెను. ఆమె కొన్నిజాడలు తీసెను. గిరి వ్రజ పురమునందుఁగల కొంద అధికారుల భార్యలు విదిశా నగరమునకు వెళ్ళివచ్చినవారు కలరు. కొందఱి కూతుండ్రు కలరు. కొందఱి కోడండ్రు కలరు. ఎవరెవరు వెళ్ళిరో యమృతవల్లి కనుఁగొనెను. వారివలన విదిశానగర రహస్య ములు తెలిసికొనవలయును. వారివలనఁ దెలిసికొనుట మిక్కిలి కష్టమని యమృతవల్లికిఁ దెలియును. నా రాయూరు వెళ్ళివచ్చిరని యందఱికిఁ దెలియును. వెళ్ళివచ్చుటనఁగా నర్థమేమో నందఱికిఁ దెలియును. కాని వారివలన నచ్చటి మాట యొక్కటియైనను చెప్పించుటకంటెఁ గష్టతరమైన విషయములేదు. ఊరకే యచటి వినోదములు, కొందఱు వారకాంతలయొక్క నాట్యకౌశలము నచ్చటి యుద్యానముల లోని రమ్యప్రదేశములయొక్క కథలు చెప్పించవచ్చును. వారే చెప్పుదురు. కాని రాజుయొక్క ప్రవృత్తికాని శృంగార రససంబంధములైన మాటలుకాని వచ్చినచో వారి

వాక్కులు బంధింపఁబడును. వారికన్ను లెఱ్ఱవడును. వా మొగములు జేవురించును. అడిగెడివారికికూడ భయమే. ఆమెకును రాజునకుఁగల సంబంధమెట్టిదో. ఆమె విదిశా నగరమునకు నెట్టివార్తఁ బంపించునో. అది తమ నెత్తికి వచ్చి చుట్టుకొనునేమో! రాజుతోడి వ్యవహారమనఁగా నిప్పుతోడి చెలగాటము. వారిని వాసుదేవుని యింటికిఁ బిలిపించి యిచట వర్తమానములను కనుఁగొనుట సాధ్యముకాదు. వారియిండ్లకుఁ బోయినచో వారు మెత్తపడక పోవచ్చును. అందుచేత నమృతవల్లి యొకపన్నుగడ పన్నెను. ఒకమంత్రి కూతు రున్నది. ఆమెపేరు వినయంధర. ఆమె నమృతవల్లి యెఱుఁగును. ఆమె కొంత తా నంతదాన నింతదాననని చెప్పికొనెడు స్వభావముకలది. కొంత స్వతంత్రురాలు. రహస్య గోపనశక్తి యామెనద్ద తక్కువ. అమృతవల్లి యామె నేఱిఁనది. ఆమెను వాసుదేవుని యింటికి, తానే పోయి స్నేహముతో మాటాడినట్లు నటించి తీసికొనివచ్చెను. ఆమెతో నెన్నియో యబద్ధములు మాటాడినది. ఆమె కెంతయో విశ్వాసము కలుగునట్లు ప్రవర్తించినది. రా జింత మంది స్త్రీలతో వ్యవహరించుచున్నాఁడు కదా, తన్నుఁ గూర్చి రాజున కెవ్వరును చెప్పలేదా! నే నందకత్తెనుకానా? అని యమృతవల్లి వినయంధరతో ననఁగా వినయంధర పులకితశరీరయై, తనకు రాజునకుఁగల సంబంధము రహస్యముగా నమృతవల్లితోఁ జెప్పెను. అమృతవల్లియొక్క వాంఛ రాజునకు తానుపోయి తెలియఁజేయుదునని వాగ్దానము చేసెను. అమృతవల్లి చేతిలోఁ జేయివేయించికొనెను.. ఎన్నాళ్ళకు

పోదువని యడిగెను. ఆమె నాలుగైదు దినములలో పోదు ననెను. లోని కెవ్వరినిఁ బోనీయరుగదా యనఁగా వినయంధర యొక రహస్యమును చెప్పెను. మొదటిసారి వెళ్ళు నపుడు కొందఱు పరిచారికలు లోనికిఁ దీసికొని పోవుదురు. వారికి కొన్ని గుర్తు లుండును. ఆ గుర్తులు నగరద్వార రక్షకులైన సైనికులకుఁ జూపించినచో సుఖప్రవేశము కలుగు ననియు నారీతిగా తీసికొని పోఁబడిన స్త్రీలలోఁ గొందఱికి రాజునకు వారియం దధికమైన యిష్టము గలిగినచో సులభ ప్రవేశము కలుగుటకు నొకచిహ్నము రాజాజ్ఞచేత నీయఁబడు ననియుఁ దా నట్టిస్త్రీలలోనొక్కర్తుకననియు నట్టిచిహ్నము తన వద్దఁగలదనియు దాని సాహాయ్యముతో తాను విదిశానగరము నందుఁ బ్రవేశింపఁగలననియు జెప్పెను. అమృతవల్లి యిట్ల నెను. "ఓసి వినయంధరా! నీకు మఱల రాజుగారిమీఁదఁ బ్రేమయున్నచో నేను చెప్పలేనుగాని, యా చిహ్నము నాచేతికిచ్చినచో నేను దానిని చూపించి సులభముగా సర్వ రాజ సంచార ప్రదేశములయందుఁ బ్రవేశార్హతను తెచ్చి కొందును. ఈ సాయము నాకు చేసిపెట్టుము. నీవుపోయి రాజునకు నాపేరు చెప్పెదవు. ఆయన సరేయనును. న న్నెవరో దాసీజనము వెంటఁ దీసికొనిపోవుదురు. అర్ధరాత్రము నందు రాజుయొక్క శయ్యాగారమునందుఁ బ్రవేశపెట్టుదురు. మఱునాఁటి ప్రొద్దుట నన్ను తిరిగి పంపింతురు. ఇదియేమి శృంగారమే. ఇదియేమి భోగము. ఇది శృంగార రసము కాదు. ఇదియొక పశుత్వము. నేనురాజు నిష్టఁకోరుటలేదు. నేనెవ్వరో రాజునకు తెలియరాదు. నన్ను రాజు పలుసార్లు

చూడవలయును. నేను నా హేలావిశేషముచేత నాయా కార ప్రసారములచేత, నా యొయ్యారములచేత, నా లజ్జాభి నయముచేత, మస్త్రాప్రవారాంచల పరిధూననములచేత వాని గుండియను గుత్తగొనవలయును. వాఁడు నాకోసము పరి తపించవలయును. నాకోసము దూత్యములు పంపవలయును. నేను తొలుత నతనిని వాంఛించనట్లు కనిపించవయును. నేను సులభురాలను కాదని వానికిఁ దెలియఁజేయవలయును. ధనా దులచేత నన్నుఁ బొందలేఁడని వాఁడనుకొనవలయును. న న్నే కాంతముగాఁ గలిసికొనుటకు వాఁడు కొన్ని ప్రయత్నములు చేయవలయును. ఒక మధురప్రయత్నము ఫలించినట్లుభాసింప చేయవలయును. అట్లైనచో రాజును వాంఛింతును. లేనిచో నాకు రాజుమీఁద కోర్కెయే లేదు.” అనఁగా వినయంధర “ఓ యమ్మ యమృతవల్లీ! నిజముగా స్త్రీయనఁగా స్త్రీవి నీవు. ఈ తక్కిన వారందఱు స్త్రీ పశువులు. నాచేతిలోనున్న చిహ్నము నాకీయఁబడునప్పుడు దీనిని పరుల కీయరాదనియు, నిచ్చినచో, నిచ్చినట్లు తెలిసినచో రాజదండనము కలుగు ననియు చెప్పఁబడినది. కాని నేను నీకిచ్చితినని వారికెట్లు తెలియును?” అనఁగా నమృతవల్లి తెలియవచ్చును. ఎవరెవ రికి నీ చిహ్నము లీయఁబడినవో వారి నామధేయములు వారు వ్రాసికొందురు. నేను నీచేతిలోని చిహ్నమును తీసికొని పోయి చూపింతును. వారు నీపేరేమి యని యడుగుదురు. నేను వినయంధరయని చెప్పుదును. నాకు చెప్పకతప్పదు. ఆపద నీకు రావచ్చును. నీ కిష్టమైనచో నిమ్ము.” అనఁగా వినయంధర తూష్ణీంభావమును వహించెను.

అమృతవల్లి యిట్లనెను. నిజాని కిందులో వచ్చిన భయము తొందరలో లేదు. ఏలయనఁగా సైనికులకును స్థానికులకును వీధి రక్షకులకును నేనమృతవల్లినో వినయంధరనో యేమి తెలియును? వచ్చిన యిబ్బంది యెప్పుడు వచ్చుననఁగా - నేనూహించి చెప్పుచున్నానుసుమీ, రాజాంతఃపురము దగ్గఱ వచ్చును. అచ్చట నెవ్వతెయో పెద్ద దాసి యుండును. నే నౌదునో కానో దానికి తెలియును. ఈ సర్వాధికారము దానిదికదా. అది చండప్రచండురాలై యుండును. దాని పేరేమి?'' వినయంధర:-అమృతవల్లీ! అది చండప్రచండురా లగునో కాదో కాని నీవుమాత్రము చండప్రచండురాలవు. నీ కీ రహస్య మెట్లు తెలిసినది? దాని పేరు చాముండి. అది యావులించినచో ప్రేవులు లెక్కపెట్టును. అమృత:— దానినిఁ గుఱించి నీ కింకేమైన తెలియునా? దాని దస లేయూరో? దాని కెంతమంది కూతుండ్రో? ఈ యుద్యోగములో నెన్నాళ్ళనుంచి యున్నది? తత్పూర్వ మెవ రుండెడివారో? అనఁగా వినయంధర యిట్లనెను. దానిది తొలుత గిరివ్రజపురమే. అది పూర్వ మిచ్చటనే రాజాంతఃపురమునకు రక్షకురాలిగా నుండెడిదట. దాని కూతుండ్రిద్దఱు. వారిద్ద ఱకుఁ బెండ్లి చేసెను. రెండవకూతురు మంచి యందకత్తియ యట. దాని పేరు నీలలోచన. దాని నొక దుర్గాధిపతికిచ్చి దేవభూతి మహారాజు తండ్రియైన భాగవతమహారాజు పెండ్లి చేసెను. దానిని పూర్వపురాజు తన కూతురువలె చూచు కొనెడి వాఁడట. తక్కిన సంగతులు మనకు తెలియవు. ఈ చాముండికి దేవభూతిమహారా జనఁగా నింత యభిమానమని

చెప్పుటకు వీలులేదు. ఆ దేవభూతిమహారాజు బదులు తానే చచ్చుటకు సిద్ధపడును. దానికి పుట్టినప్పటినుండియు నంతఃపుర రక్షయే వృత్తి. ఇందులోని మెలకువలు దానికి తెలిసినన్ని మఱియొక ప్రాణికి తెలియవు. దానికి మనుష్యులన్నచో నెంత గుర్తో చెప్పలేము. ఇరువదియైదేండ్లక్రింద నామెయొక పురుషునో స్త్రీనో చూచె ననుకొనుము. మఱల నీపాతికయేండ్లా వ్యక్తి యీయామెకుఁ గనిపించలేదు. అప్పుడు కనిపించెను. అది వెంటనే గుర్తుపట్టును. నీ వా వ్యక్తివికదా! నీపేరిదికదా, నీవా పనిమీఁద నపుడు గిరివ్రజపురమునకు వచ్చితివికదా! ఇన్నియు నడుగును. అన్నియును దానికి జ్ఞాపకము. నీవు దానిని తప్పించుకొని పోలేవు. అందుచేత నా చేతిలోని చిహ్నము నీ కిచ్చినను బెద్ద లాభములేదు. అమృత:- నాచేతిలోనిచిహ్నమామె కెందుకుఁ జూపింతును? నీ చిహ్నము పురప్రవేశమునకు మాత్రమే వినియోగింతును. అప్పుడు నీకు వచ్చెడు నాపదయులేదు. వలసినచో నీగుర్తు నీకే తిరిగి పంపింతును. విన:-కాని అమృతవల్లీ! నిన్నందఱెఱుఁగుదురుకదా! అమృత:- నన్నందఱెఱిఁగినది గిరివ్రజపురములో. విదిశానగరములోకాదు. విదిశలో లక్షమంది స్త్రీలలో నేనొకర్తుకను. పైగా నాయూరిపేరు విదిశ. దానికి దిశలులేవు. ఈదిశలో నిదియున్నదని యెట్లు తెలియును. వినయం:- అమృతవల్లీ! మన యిద్దఱికి పూర్వమింత పరిచయములేదు. నీవింత తెలివికలదానవని నే ననుకొనలేదు. నీవును శ్రీమాలియు నెక్కువగా విదురుఁడు తాతవద్ద నుండెడివారు. నేను జయద్రథుఁడు తాతవద్ద

A Somu Reddy

నెక్కువగా నుండెడిదానను. అమృత:- నేను పొరపాటు చేసితిని. నేనుకూడ జయద్రథుఁడు తాతవద్దనే యెక్కువగా నుండవలసినది. అప్పు డిట్టి విద్యలు మిక్కిలి సులభమయ్యె డివి. కాని జయద్రథునివలన నేనుపొందినంత లాభము మీ రెవ్వరును బొందియుండరు. ఆయన నాకొక బ్రహ్మాండ మైన రహస్యమును చెప్పెను. నేను దాని నాచరించితిని. వినయం:-ఆ రహస్యమేమి? అమృత:-అందఱకును చెప్పెడిది కాదు. దానినిఁగూర్చి పురుషులకుమాత్రమే చెప్పవలయును. వారికిఁగూడ చెప్పెడిదికాదు. అదియొక ప్రయోగము. వారిమీఁద చేయవలయును. వినయం:- ప్రయోగ మను చున్నావు. వారి కాపద కలుగునా? అమృత:-సీసీ! వారు నిరవధి కానంద మనుభవింతురు. స్వర్గసుఖమువంటి సుఖ మనుభవింతురు. వినయ:-అంత సుఖమును రాజున కీయవలయు ననియా నీ యుద్దేశ్యము? ఓసి యమృతవల్లీ! జయద్రథుఁడు తాత నా కా రహస్యమును చెప్పినాఁడుకాదు; నీవు నవ్వి ననుసరే సిగ్గువిడిచి చెప్పుచున్నాను. ఆరాజునకు నేనంతటి సుఖసంధాయకురాలిని కాకపోయితినని విచారించుచున్నాను. ఆ మహారాజు జారుఁడని దుశ్శీలుఁడని సంసారములు పాడు చేయుచున్నాఁడని యతనికి కుటుంబ మర్యాదలు కాపాడుట యనుధర్మము తెలియదని పలుమంది పలువిధములుగా నాడు చున్నారు. ఓసి సఖి! స్త్రీనై జన్మించిన తరువాత నారాజు నెఱుఁగక పోయినచో నాస్త్రీజన్మ యొక స్త్రీజన్మయా? ఆ రాజునందొక్కటియే దుర్గుణ మున్నది. ఇంతమంది తన్ను వలచుచుండఁగా నతఁడు వీరి నందఱి వట్టిశరీరగతి కామము

చేత కోరుచున్నాఁడుతప్ప వారి వలపులకు తగిన హృదయము నందలి రసభావమును వారి కిచ్చుటలేదు. ఇది నిస్సందేహ ముగా నారాజుచేయుచున్న పాపము. దాని కేమిఫల మనుభ వించునో నాకు తెలియదు. అమృత:-చెప్పుమందువా? అట్టి జీవి బహుజన్మలయందు తాను ప్రేమించుచున్న భార్యా వియోగమును పొందుచుండును. బహు జన్మలకు వాని కదియే వ్రాత. వినయం:-ఓసి యమృతవల్లీ! మనరాజునుఁగూర్చి యెంతమాటయన్నావు. నీవునిజముగా మన రాజును ప్రేమించు చున్నావా? అమృత:-ప్రేమ మూర్ఖులైన స్త్రీలకు నుండును. వివేకవతులైన స్త్రీలకు నుండును. మూర్ఖురాం డ్రా వివేచనము లేకుండ ప్రేమింతురు. సీతాదేవి శ్రీరామచంద్రుని ప్రేమిం చెను. అతనికిఁ దనయందుకంటె ధర్మమునం దధికమైన యిష్టము కలదని సీతకుఁ దెలియును. తెలిసికూడ రాముని ప్రేమించెను. మఱియొక స్త్రీ యైనచో. నీకు నాయందుకంటె ధర్మమునం దధికమైన ప్రేమ యని మూతి ముడుచుకొని కూర్చుండును. ఈమె మూతి ముడుచుకొనుటవలన వానికి ధర్మమునందలి ప్రేమ తగ్గదు. ఈమెమాత్రము తా నతని యందు ననుభవించు సుఖమునందు భంగింపఁబడును. నాకు రాజునందుఁ ప్రేమ యున్నచో దాని విషయము వేఱు. అట్టి జీవుఁడు పొందెడి జన్మ పరంపరలలోని దుఃఖములయొక్క స్వరూపము విచారించుటయన్న వివేకము వేఱు. అందుచేత సీతకు రామచంద్రునియందలి ప్రేమ తక్కువా? వినయం:- సరేకాని నీవు వెళ్ళి చాముండి నెట్లు వశపఱచుకొందువు? నీవు చాముండిని మోసము చేయగలుగుదువేని నీ వీ రాజ్య

మును తలక్రిందులు చేసినట్లే, నీవు చేయరానిపనియే లేదు. అమృత:- పోయి ప్రయత్నము చేయుదును. కాని నీ వచ్చట నెన్నాళ్లుంటివి ? ఎన్నాళ్ళక్రింద నుంటివి ? వినయుం:- పది దినము లుంటిని. నెలనాళ్ళక్రింద నుంటిని. అమృత:-ఒక్క విషయము నడిగెదను. చెప్పఁగలవా ? వినయ:- నాకుఁ దెలిసినచోఁ జెప్పఁగలను. అమృత:- ఆ విదిశానగరములోఁగాని యంతఃపురములోఁగాని యెచ్చటనైన నొక పోదె చెప్పు నాటవికస్త్రీ యున్నదని వింటివా ? వినయం:- వినలేను. అమృత:- నీవు పది దినము లంతఃపురములో నుంటివికదా ? అచట నన్నిచోట్లకు నందఱునుఁ బోవచ్చునా ? కొన్ని చోట్లకుఁ గొందఱిని రానీయరా ? అట్లు రానీయని స్థలము లున్నచో నట్టి చోటుల కెవ్వ రెవ్వరు బోదురు. ఈ సంగతి నీ కేమైనఁ దెలియునా ? వినయ:- నాకివన్నియుఁ దెలియవు కాని రాజగృహము లున్నచోట నంతఃపురమని చెప్పఁబడు మహాప్రదేశమున నాలు గుద్యానవనములు కలవు. వాని శోభముందు మహానగరముకల యుద్యానవనముల శోభ దిగదిగదుడుపు ఈ నాలు గుద్యాన వనములలో నీ పూవుచెట్టు కలదు, ఈ పూవుచెట్టు లేదనిలేదు. ఆ తీగప్రాకిన లక్షణమే చాల విచిత్రముగా నుండును. ఆ నాలుగు పూఁదోఁటలు నాలుగు విధము లైనవి. ఒక పూఁదోఁటలోఁ దీగలు దశావతారములుగా ప్రాకింపఁబడినవి. మఱియొకతోఁటలో శివలీలలుగా ప్రాకింపఁబడినవి. ఒక తోఁటలో రామకృష్ణుల కథావైభవము లన్నియు తీగలుగా ప్రాకింపఁబడినవి. వెదుళ్ళతో బొమ్మలుగా నికుంజములుగా చిత్ర చిత్రములుగా

బుట్టలు కట్టి వానిమీఁద నీతీగలను బ్రాకింపఁజేసిరి. ఒక బుట్ట పురుషాకృతిగా నల్లిరనుకొనుము. దానిమీఁద బ్రాకించి రనుకొనుము. ఆ పురుషాకృతియొక్క శిరస్థానమైన ప్రదేశము నందు కన్నులుండెడిచోట రెండు పూలుండును. ఆ పూవుల నచట నెట్లు పూయించిరో యా నేర్పరులైన తోఁటమాలకే తెలియవలయును. అవి కృత్రిమములైన వేమోనని నేను పరిశీలించి చూచితిని. అవి కృత్రిమములుకావు. అమృత:- నాల్గవతోఁటలో నేలీలలు వర్ణింపఁబడినవి. వినయం:- బుద్ధ భగవానుని కథలన్నియు నిరూపింపఁబడినవి. అమృత:-ఇది యేమి యలంకారమే. అన్నియు వదలిపెట్టిన సన్యాసికదా బుద్ధుఁడు. అతనికి లీల లేమికలవు? ఒకచోట తపస్సుచేసెను. నిర్వాణమును కనుగొనెను. ఇంటికి వచ్చెను. బుజ్జులు గొరిగించెను. కావి గుడ్డలు కట్టించెను. ఒక యుద్యానవనము వాని కథలతో నెట్లు తీఁగలు బ్రాకింపఁబడెను. అచట పూవు లెందుకు? వినయం:- ఏమోనమ్మా! అందులో బుద్ధ కథ లున్నవని చెప్పిరి. ఆ యుద్యానవనమును తక్కిన మూఁడింటి వలె పెద్దది కాదు. చాల చిన్నది. అది యుద్యానవన మనుటకే వీలులేదు. బయటనుండి రెండు పెద్ద చెట్లు కనిపించినవి. ఒకనాఁడు లోనికి పోద మనుకొంటిని. అచట నిద్దఱు క్రూరముఖులైన యాటవికస్త్రీలు కత్తులుచేఁబూని నిలుచుండిరి. వారు నన్ను లోనికిఁ బోనీయలేదు. ఇది యుద్యానవనము కాదు. పొమ్మనిరి. లోపల నెవ రున్నారని యడిగితిని. వారు సమాధానము చెప్పలేదు. ఇవతలకువచ్చి నలుగు రైదుగురి నడిగితిని. వారందఱు నచ్చోటికి నెవ్వరికినిఁ బ్రవేశార్హత

లేదనిరి. పూర్వ ముండెడిదనియు నప్పటికి పది దినముల నుండి యెవ్వరిని బోనిచ్చుట లేదనిరి. ఎపుడో యర్ధరాత్ర మునవో అపరాత్రమునవో మహారాజును చాముండియు నిద్దఱే లోనికిం బోదురనియు చెప్పిరి. నాకు తెలిసినంతవఱకు నా యంతఃపుర మనఁబడు ప్రదేశములో లోనికిం బోవుటకు వీలులే దనిపించుకొన్న దా ప్రదేశ మొక్కటియే. అమృత:- అంతకు పది దినముల క్రింద నిట్టి మార్పు జరుగుటకు హేతు వేమి? అదివఱకు రానిచ్చుచుండెడివారుకదా? వినయం:- నే నడుగలేదు. అమృత:- ఔను. నీకు రాజుమీఁది ప్రేమ నిన్ను మించి యుండె నాయెను. ఇంకొక యూహ నీ కెట్లు వచ్చును? వినయం:- ప్రేమించినచో నిట్లే ప్రేమించ వల యును. అమృత:- ఱేపు నీ తండ్రి నీకు సంబంధము కుదిర్చి పెండ్లి చేసినచో రాజుమీఁద నీకుఁగల ఈ ప్రేమ యేమగును? వినయం:—నీకుఁగూడ వివాహము కాలేదుకదా? నీవు రాజును ప్రేమించునావుకదా! నీవు విదిశానగరమునకుఁ బోదునంటికదా! తరువాత మీ నాయన నీకుఁ బెండ్లి సంబంధము మాటాడి పెండ్లి చేసినచో నేమి చేయుదువు? అమృత:- నేను విదిశానగరమునుండి తిరిగిరాను. రాజునకు నాకును సంయోగమే కలిగినచో రాజు నన్ను వదలి పెట్టఁడు. నే నతనిని వదలిపెట్టను. — వినయంధర యాశ్చర్యపోయి చిహ్నము నామె చేతికిచ్చి వెడలిపోయెను.

శ్రీమాలికి కుమార్తె. ఆమె పురుష వేషంటనే వేసి కొనెను. తల్లి కూతునుఁ దీసికొని పచ్చుటకు నెన్నియో సార్లు చెప్పెను. కాని వాసుదేవునకు భూమిమిత్రునకుఁ

దీక్షయే గలుగలేదు. నిజముగాఁ దీసికొని రావలసినచో నమృతవల్లి తీసికొని రావలయును. ఆమెయే తీసికొనివచ్చు నని తండ్రిగొడుకు లిద్దఱు నూరకుండిరి. గృహమునందలి సర్వాధిపత్య మామెదే యైనపుడు నేది జరుగవలసినను నితరులు చెప్పకుండఁగనే యమృతవల్లి చేయుచున్నపుడు వారు చెప్పవలసిన యవసరమేమి? ఆమెను తీసికొనివచ్చుటసాధ్యము కానిచో నామె తీసికొనిరాదు. సాధ్యమైనచో తీసికొని వచ్చును. కొంత గొప్పసంసారములో దాసదాసీజనము సమృద్ధిగానున్న యింటిలో కూతునుఁ దీసికొనివచ్చి పురుడు పోయుటకు పెద్దప్రయత్నమేమున్నది? కాని తీసికొనిరాలేదు. ఎందుకు తీసికొనిరాలేదని యమృతవల్లి నెవ్వరు నడుగలేదు. శ్రీమాలి కూతునకుఁ దొమ్మిదవనెల వచ్చినది. ఆమెను తీసికొని రావలయునని తల్లి పట్టుబట్టెను. వాసుదేవుఁడు నతనిభార్య భూమిమిత్రుఁడు మువ్వురును కూర్చుండి దోసమంతయు నమృతవల్లిదిగా నొక సాయంకాలమునఁ దీర్మానము చేసిరి. అమృతవల్లి యిట్లనెను. “శ్రీమాలిని నేను పురిటికే తీసికొనివత్తు ననుకొంటిని. ఆమెభర్త తాను పంపించనన్నాఁడు. నే నెందుకని యడిగితిని. ఆయన తన భార్యను వదలిపెట్టి యొక్కనిముసమైన నుండఁడట. గిరివ్రజ పురమునకుఁ బంపించుట కాయన కిష్టములేదట. గిరివ్రజ పురమునుఁగూర్చి యాయన వందవార్తలు విన్నాఁడట. తా నెచ్చటనుండునో నతనిభార్య యచటనే యుండవలయునట. అట్లైనచో నతనినికూడ రమ్మంటిని. అతని కచట నెన్నియోఁ పను లున్నవట. వచ్చుటకు వీలులేదు. తరువాత వత్తు

మన్నాఁడు. నే నెంతయో బలవంతము చేసితిని. ఈ రెం డేండ్లలో నతని నెన్నిసార్లు రమ్మంటినో లెక్కలేదు. శ్రీమాలి గర్భవతియైయుండఁగా నన్నిబేసినెలల్లో తీసికొనివచ్చుటకు వార్తలు బంపితిని. కూతురు పుట్టినతరువాతకూడ బేసి నెలలలో ప్రియత్నమే చేసితిని. ఇందులో కొన్ని నెలలు ప్రయాణమున కర్హములు కాకపోయెను. దారిలో వంతెనలు నిర్మింపఁబడని మూఁడు వాగులుకలవు. ఆ మూఁడు వాగులు తరణయోగ్యములుకావు. అప్పటికిని నావలను పంపించితిని. ఆయన తనభార్యను వదలి నిమేషమైననుండలేని వాఁడైనచో మనమేమి చేయఁగలుగుదుము? అప్పటికిని పెదతల్లియు నేనునుగలిసి వారియూరికిఁబోయి శ్రీమాలిని కూతును చూచిరావలయునని యనుకొంటిని. మేములేనిచో మీరిచట నేమగుదురు? "భూమి:-నీవులేనిచో మామాట యట్లుంచుము. ఈ గిరివ్రజ రాజధాని యేమగును? నీవు లేనిచో నాకేమిచేయవలయునో తెలియదు. నన్ను మహామంత్రిస్థానమునందు కూర్చుండఁబెట్టితివి. నాకు మహామంత్రిత్వము సిద్ధించినది. విదిశానగరమునుండి మహారాజుకడనుండి వచ్చెడివార్తలుకూడ నన్నే మహామంత్రిగాఁ బేర్కొనుచున్నవి. ఇట్టిస్థితిలో నేది యెప్పు డ్లెట్లుసేయవలయునో నాకే తెలియకున్నది. అమృత:- అది యట్లుంచి యిపుడు క్రొత్త సంబంధము వచ్చినది. మొన్న శ్రీమాలికొఱకు వార్తఁ బెట్టితిని. శ్రీమాలియుఁ శ్రీవత్సుఁడును వారి యూరిలో లేరట. నాకు విదిశా నగరమునకుఁ బోయిరట. విదిశానగర మూరకే పెరిగి

పోవు చున్నది. జనము ఇబ్బడిముబ్బడి యగుచున్నారు. జనము నివసించుటకు స్థలములేదు. గృహములు లేవు. అందఱికిని పానీయము సమృద్ధిగా దొరకుటలేదు. నగర మంతయు మిక్కిలి యిఱుకటముగా నున్నది. శ్రీవత్సలాంఛనుఁడు పురనిర్మాణ వాస్తుశాస్త్రమునందు మహాపండితుఁడు. ఆయ నను రమ్మని మహారాజు వారి యూరికి వార్త పెట్టెనట. శ్రీవత్సున కితరములైన పనులుకలవు. కాని మహారాజు వార్త నంపఁగా నేమిచేయును? తక్కిన పనులన్నియు సంక్షేపించి భార్యతోఁ గూతుతో విదిశానగరమునకుఁ బోయెనట. భూమి:- శ్రీమాలి పెండ్లి యైనపుడు మహా రాజుగారు తండ్రిగారిపేర నొక లేఖ వ్రాసిరి. అమృత:- ఆ లేఖ యున్నదా?

భూమిమిత్రుఁడు తన గదిలోనికిఁ బోయి యా లేఖను తెచ్చి యిచ్చెను. లేఖ యిట్లున్నది:- "మహాసేనాధిపతి వాసుదేవునకు - నేను వివాహమునకు వత్తమని యెంత ప్రయత్నముచేసినను నాకు సాధ్యమగుటలేదు. ఇచట రాజకార్యములకు తీరికలేకుండనున్నది-అమృతవల్లి యిట్లనెను.

రాజ్యకార్యములనఁగా నేమియో తెలియునా? భూమి మిత్రుని పెదవులమీఁద సన్నని చిరున వ్వుదయించెను. వాసు దేవుఁడు నవ్వలేదు— మఱలజాబు. మీ కుమార్తెయైన శ్రీమాలిని నేను చిన్నప్పు డెప్పుడో చూచితిని. ఆమె ముద్దైనబిడ్డ. పెరిగి పెద్దదై యుండవచ్చును. మీరుచేసెడి సంబంధముకూడ నా కిష్టమైనదే. మీ యల్లునితండ్రి మాకు

వచ్చినబంటు. ఆయన పురనిర్మాణ వాస్తుశాస్త్రజ్ఞానసంపన్నుడు. గిరివ్రజపురములోని దక్షిణభాగమున నొకటి రెండు పేటలు వానిచేతనే నిర్మింపఁబడినవి. ఆ ప్రాంతభాగము యొక్క నిర్మాణకౌశలము పలుమంది ప్రశంసించిరి. విశాలములైన వీథులు సమృద్ధిగా జలము ప్రవహించుటకు నిర్మింపఁబడిన ప్రణాళికలు రాత్రులందు వీథులు వెలిఁగింపఁబడుటకు నిర్మింపఁబడిన దీపస్తంభములు, సర్వగృహములకు వాయువు సమృద్ధిగా వచ్చుటకు చేసినయేర్పాట్లు మిగులఁ బ్రశంసార్హములు. నా కా వాస్తుశాస్త్రము తెలియదు. కాని యాయనవచ్చి నాతోఁగొన్నివిషయములు చెప్పినపుడు ఇందులోఁ గూడ నింతశాస్త్రమున్నదా యనుకొంటిని. వాయువు లేకాలమున నేమార్గమున వచ్చునో ఉత్తరపుగాలు లెపుడు వచ్చునో దక్షిణపుగాలు లెపుడువచ్చునో, ప్రాగ్వాయువు లెప్పుడువచ్చునో, అన్నివీథులకు నన్నివాయువులు లభించుట యెట్లో యెచ్చటిగృహమునకు గవాక్షమెచ్చటఁ బెట్టవలయునో మఱియుఁ దీవ్రమైన వాయువులు వచ్చినపుడు గృహకుడ్యములు దెబ్బతినకుండ నెట్లు రక్షింపవలయునో వర్షము లేదెసనుండి వచ్చునో, వచ్చిన వర్షములచేత జల్లులు గృహముల యందలి ప్రధాన భాగములను అనివసనయోగ్యములుగా నుండకుండుటకు గవాక్షములమీఁద, ద్వారబంధములమీఁద నేర్పాటుచేసిన కప్పులు ఏకోణముల యందు నిర్మింపవలయునో ఎంతవాలుగా నుండవలయునో వాని నన్నిఁటిని నాకుఁజెప్పెను. నిజానికి గిరివ్రజములో నాయన నిర్మించిన దక్షిణదిశయందలిపేట పరమరమణీయ

మైన ప్రదేశమని చెప్పక తప్పదు. ఒకానొక స్థలమునందు బావి త్రవ్వినచో నాపేటకు పేటకంతకు జలసమృద్ధి కలుగు నని నిర్ణయించి యచ్చట బావులు త్రవ్వించెను. బావులలో నుండి నీరు తోడించుటకు యంత్రములు నిర్మించెను. జలము యొక్క నిలువచేయుట యెత్తైనప్రదేశములయం దేర్పాటు చేసి, యచ్చోటినుండి సర్వస్థలములకు సులభప్రసారము జరుగునట్లు చేయించెను. గృహములన్నియు నొకచోటనే గుంపుగా లేకుండ చెదరు చెదరుగా కట్టుటయు కొన్నిగృహ ముల తరువాత విడిస్థలములు కొన్నింటినుంచుటయు, అచట నుద్యానములను నిర్మించుటయు మొదలైన విద్యలో యా యన గొప్ప పండితుఁడు. ఆయన కుమారునకుఁగూడ నీ విద్య బాగుగా తెలియు ననుకొందును. వారు మనరాజ్యము నకు నచ్చినబంట్లు. గొప్ప రాజభక్తులు. మీకుమా ర్తెను జామాతను నేను తరువాత చూతును. వారి నెప్పుడో విదిశానగరమునకు నేనే రప్పింతును. మీబిడ్డ యనఁగా నాకును ప్రియమైన వ్యక్తియేకదా! నేనును వారికేఁ గానుక లీయవలసిన బాధ్యతకలవాఁడనే. విదిశానగరముమ వృద్ధి చేయవలయు ననుకొనుచుంటిమి. ఎప్పుడో మీ యల్లునిఁ బిలిపింతుము. ఆ సమయమునందు కానుకలనుఁగూడ నిప్పిం తుము.''——

లేఖమై పోయినది. అమృతవల్లి మొగములో నాలో చన తీవ్రముగా నావరించినది. భూమిమిత్రుఁ డిట్లనెను. “ఏమి యాలోచించుచున్నావు.” అమృత:-ఈ యుత్తరము నిజముగా ప్రేమపూరితమైనవునా? దీని వెనుక నేదైనరహస్య

మున్నదా? వాసు:-ఇది యిప్పుడు వ్రాసిన యుత్తరముకాదు. రెండేండ్లక్రిందటి యుత్తరము. వేఱొక యుద్దేశ్యము పెట్టికొని వ్రాసినచో నాయుద్దేశ్య మీపాటికి ద్యోతిమానము కావలసియున్నది. మఱియు మహారాజు నావిషయములో మరూహాతోఁ బ్రవర్తించునా? ఇందులో మరూహాకు స్థానమే లేదు. అమృత:-భూమిమిత్రా! మగధరాజ్యములో దుర్గము లెన్నికలవు? భూమి:-అన్నియును వందదుర్గములు కలవు. అమృత:-ఈ మగధరాజ్యము కామరూపమువఱకు వ్యాపించియున్నది. మగధములపైన ప్రసుమ్న దేశములు కలవు. వానిపైన సుమ్నదేశములుకలవు. వానిపైన దశార్ణములుకలవు. మగధమునకు నాగ్నేయమునం దును నందు వంగములుకలవు. సుమ్నప్రసుమ్న దశార్ణములకు ప్రాగ్దిశయందు వంగదేశము కలదు - దశార్ణములకు పశ్చిమము నందు కిరాతములుకలవు. సుమ్న ప్రసుమ్న దేశములకు పశ్చిమమున విదేహములు కలవు. అన్ని వైపుల నా యూ దేశములలోని యెల్లలు మగధములకే చెందియున్నవి. మగధములకు దశార్ణములకు చాల దూర మున్నది. దశార్ణములకు విదిశ రాజధాని. అనాదినుండియు మగధ రాజులు విదిశానగరమునందు గ్రీష్మర్తువులందు పోయి నివసించుట యాచారముగా నున్నది. అమృత:— నీవు చెప్పిన వంద కోటలు మగధమునందే కలవా? దశార్ణముల వఱకుఁ గలిగిన దేశములో నున్నవా? భూమి:- దశార్ణములలో నాల్గు దుర్గములకంటె నెక్కువలేవు. సుమ్న ప్రసుమ్న దేశములలో పది దుర్గములే కలవు. కాని యచట

ప్రాక్పశ్చిమములయందు మఱియొక పది దుర్గములు కలవు. తక్కిన వన్నియు మగధములందే కలవు. అమృత:-ప్రసుమ్న ములకు మగధములకు నడుమ నెన్ని దుర్గములు కలవు. భూమి:- ఆఱు దుర్గములు కలవు. అమృత:-సుమ్న ప్రసుమ్న ముల మధ్య నెన్ని? భూమి:- అవియు నాఱు. అమృత:- దశార్ణ సుమ్న మధ్యమున నెన్ని? భూమి:- అవి నాల్గే దుర్గములు, ఎందుచేతననఁగా కొంతమేర వంగదేశము త్రోసికొని వచ్చినది. దాని యుత్తరపు సరిహద్దు పొడుగు తక్కువమైనది. అమృత:- మగధ ప్రసుమ్న దేశముల నడుమ నున్న దుర్గములకు నధిపతులెవరు? వారి లక్షణములెట్టివి? వా రనాదినుండియు దుర్గాధిపతులా? వాసుదేవుని తండ్రి చేతఁగాని వాసుదేవునిచేతఁగాని దుర్గాధిపత్యమును గడించిన వారా? అట్లే సుమ్న దేశములనడుమ, దశార్ణ సుమ్న దేశ ముల నడుమగల దుర్గాధిపతులనుఁ గూర్చిన సర్వవార్తలును మనము తెలిసికొనవలయును. వాసు:— మన కెందుకు? అమృత:- ఎందుకా? రాజు స్త్రీలోలుఁడై యున్నాఁడు. పరరాజులు వాని నాక్రమించుటకు ప్రయత్నము చేయ వచ్చును. అంగములు దశార్ణములమీఁదికి దండెత్తును. విదిశ నాక్రమించుకొనును. విదిశలోనున్న జనములో నాల్గు వంతులు స్త్రీలు. ఒక వంతు పురుషులు. ఆ విదిశానగరము ముట్టడికి తట్టుకొనలేదు. రాజు నెప్పు డాక్రమించునో గెలిచిన వాఁడు సర్వ రాజ్యము తనకు స్వాధీనమైన దనుకొనును. విదిశ కామోపహ యున్నది. పరుఁడైన రాజు దశార్ణముల నాక్రమించినచో సుమ్న దశార్ణ మధ్యస్థ దుర్గములుగాని,

సుమ్న ప్రసుమ్నముల నడుమనున్న దుర్గములుగాని మన యధీనములం దుండి దృఢములుగాఁ జేయఁబడినచో నెత్తి వచ్చెడి వాని ప్రతిభ దశార్ణములతో నాగిపోవును. మగధ ములు పరాధీనములు కావు. మనకుఁ జేతనైనచో దశార్ణ ములే పరాధీనములు కాకుండఁ జూడవలయును. దానికి మనకు శక్తిలేదు. రాజు సైన్యమును నాల్గు భాగములుచేసి యొక భాగము తనక్రింద నుంచుకొని తక్కిన మూఁడు భాగ ముల కచట ప్రసక్తి లేకుండ చేసెను. అందుచేత మనము కట్టుదిట్టముల చేసినచోఁ దక్కినచోట్ల తక్కినసైన్యములతోఁ జేసికొనవలయును. భూమి:- ఆ దుర్గాధిపతులందఱి చరిత్ర లన్నియుఁ బరిశీలించుమని నీవు నాతో మున్నె చెప్పితివి. నీవు మఱచిపోయితివి. నేను పరిశీలించి యట్టెపెట్టితిని. సుమ్న ప్రసుమ్న దేశముల మధ్యనున్న దుర్గము లన్నియు నాదినుండియు వంశపరంపరగా వచ్చుచున్న దుర్గాధిపతుల క్రింద నున్నవి. వారు మహారాజభక్తులు తలలు తెగినను శుంగవంశమున కెదురు తిరుగరు. వారివలన మగధరాజ్య మునకు భంగములేదు. అమృత:- ఓయీ! రాజభక్తి గాఢ మైన మానవులయొక్క హృదయాంతరమునందలి భావమైనను దానినిఁగూడ చెఱఫుటకు హేతువు లుండును. ఆ హేతువులను మన మహారాజు కలిపించలేనివాఁడు కాఁడు. ఆ యా దుర్గము లకు రాయబారులనుఁ బంపించి యచటి వార్తలు కనుఁగొన వలయును. వారు పూర్వము రాజభక్తులే. ఇప్పు డగునో కాదో, ఒక్క గిరివ్రజ పురమునందు చూడుము. పూర్వ మెందఱో రాజభక్తులు. ఇప్పుడెందఱో చెప్పలేను. ఈ

సంగతి నీవు చేయలేవు. నేనే చేయఁగలుగుదును. నే నిది వఱకే యీ ప్రయత్నము చేసితిని. సుమ్న ప్రసుమ్న దేశముల నడుమనున్న దుర్గాధిపతులను కట్టుదిట్టము చేయవలయును. వారు గాఢమైన రాజభక్తి కలవారుగా నుండవలయును. రాజభక్తియనఁగా వాసుదేవునియందలి భక్తికాదు. దృఢమైన రాజ్యమునందలి భక్తి. భూమిమిత్రా! చాముండి యని రాజుయొక్క యంతఃపుర రక్షకురాలు వృద్ధస్త్రీ. దానిని నీ వెఱుఁగుదువా? భూమి:- నే నెఱుఁగను. వాసు:- నే నెఱుఁగుదును. అమృత:- దాని కిద్దఱు కూతుండ్రు. రెండవ కూతురు పేరు నీలలోచన. ఆమె నొక దుర్గాధిపతికిచ్చి భాగవతమహారాజు వివాహము చేసెను. ఆ దుర్గాధిపతి యెవరు? ఆ దుర్గ మెచ్చట నున్నది? వాసు:- ఆ దుర్గము మగధములకు దక్షిణదిశయం దున్నది. అతఁడు మహావీరుఁడు. వాని పేరు కాలకంఠుఁడు. అతనివద్ద గొప్ప సేనకలదు. అతని దుర్గమునకు ప్రాగ్దిశయందు వంగములు, దక్షిణమునం దుత్తర కోసలములు, పశ్చిమమునందు త్రిపురములు కలవు. అచట మగధములు, కోసదేరి యుండును. అది మగధరాజ్యమునకు కోణప్రదేశము. ఆ కోణప్రదేశముయొక్క సర్వరక్షయు నీ కాలకంఠుని చేతిలో నున్నది. అమృత:- అతని వద్ద నెంత సేనయుండును? వాసు:- పదివేల సేనయుండును. అంత సేనగల మఱియొక దుర్గాధిపతి లేనేలేడు. అతఁడు పరమ రాజభక్తుఁడు. అమృత:- అయినచో మంచిదే. కాని యతఁ డామూలనుండి యేమి ప్రయోజనము? అతఁడు సుమ్న ప్రసుమ్నలమధ్యనున్న సర్వదుర్గాధిపత్యము వహించ

వలయును. వాసు:- అయినచో దక్షిణమున నదుపు పోవును. కాలకంఠుఁడు తన పితృపైతామహమైన దేశ మును వదలిపెట్టి వచ్చెడువాఁడు కాఁడు. అమృత:— మహారాజు రమ్మని వార్త పంపినను రాఁడా? వాసు:- మహారాజు వార్త పంపినచో నెవఁడైనను పోవును. అమృత:-అచట నతనియొక్క దుర్గమేకలదా? వేఱే దుర్గములు లేవా? తదధిపతులు లేరా? భూమి:-ఎందుకు లేరు? ఆ కోణదేశములో మఱి మూఁడుదుర్గము లున్నవి. ఒక్కొక్క దుర్గాధిపతివద్ద రెండువేల రెండువేల సైన్యము లున్నవి. వారికిని కాలకంఠునకును సరిపోదు. కాని కాలకంఠుఁడు పరాక్రమ వంతుఁడు. నధికబలము కలవాఁ డగుటచేతను, వారి ముగ్గురునుఁ గలసినను కాలకంఠు నేమియు చేయలేక పోవుటవలనను, వా రూరకుందురు. అమృత:_ ఆ ముగ్గురు దుర్గాధిపతులు నేవర్ణస్థులు? వాసు:-బ్రాహ్మణులు. అమృత:- కాలకంఠుఁడు శూద్రుఁడై యుండవలయును? ఒకదాసి దాని కూతునుఁ బెండ్లాడినచో నీచకులుఁడై యుండవలయును. వాసు:- అవును. అమృత:- ఆదుర్గము తద్వంశమునందు నెప్పటినుండి యున్నదో? వాసు:-నవనందులు రాజ్యము చేసినపుడు వారి యధీనమునందే యున్నది. అమృత:- అతఁడు బౌద్ధుఁడై యుండుననుకొందును. వాసు:- నీకెట్లు తెలియును? అమృత:-మనదేశము మొదటినుండియు వేద మతము ప్రబలముగా నున్న దేశము. నడుమ నడుమ ఇతర మతములువచ్చి దేశమునందు వ్యాపించుచుండెను. ఈక్రొత్త మతములను స్వీకరించెడివారు చిత్రముగా నుందురు. బ్రాహ్మ

ణులలో నూటికిద్దఱో ముగ్గురో నూతన మతములను స్వీకరింతురు. వర్ణములు పోనుపోను క్రొత్తమతములను స్వీకరించెడివారిసంఖ్య వృద్ధియగును. అందుచేత నీ వంశస్థులైన శూద్రులలో నీ నూతన మతస్వీకార మధికముగా నుండును. వాసు:-కాలకంఠుఁడు వట్టిబౌద్ధుఁడేకాఁడు తీవ్రమైన బౌద్ధమతముగలవాఁడు. ఆప్రాంతమంతయు నెన్నియో విహారములు తక్కిన మూఁడు దుర్గములకు బ్రాహ్మణు లధిపతులగుటచేత వారీబౌద్ధమును తట్టుకొనలేకుండ నున్నారు. అమృత:-అట్లైనచోఁ గాలకంఠుని గిరివ్రజమునకు పిలిపించుట మంచిది. వాసు:- ఏసాకుపెట్టి? అమృత:-ఇది యట్లుంచి నాకొక యనుమానము కలదు. ఇప్పుడు శ్రీమాలియు శ్రీవత్సుఁడును, విదిశానగరమునం దున్నారు. శ్రీమాలినిఁ గూర్చి నాకేదో భయముగానున్నది. ఎవ్వరినో యొకనిని వెంటనే విదిశానగరమునకుఁ బంపవలయును. ఆమెనుఁ గూర్చి తెలిసికొని రావలయును. వాసు:-అంత భయమొందులకు? అమృత:- నాకీభయము రెండేండ్లుగా నున్నది. ఇది వఱకే చెప్పితిని. కాలంజరియన్న సోదెకత్తె ఈసందేహమును భయమును నాకుఁ గలిగించినది. ఆ కాలంజరి భర్తను తీసికొనివచ్చి కోటలో నుంచితిని. వానిచేత నొకపాట పాడించవలయునని నా ప్రయత్నము. నేను వానికి వానిభార్యను చూపించవలయును. వాఁ డాపాట పాడవలయును. ఆపాటలోనున్న యర్థముకల పత్రము భవిష్యపురాణములో నెగిరిపోయినది. ఆభాగము వ్రాయసకాఁడైన వందియొక్క దూరపుచుట్టమోవాఁడో కంఠతః జదువఁగలవాఁ

డున్నాఁడని వానివలనఁ దెలిసికొందమని వానికోసము నాలుగు సార్లు వార్తపెట్టితిని. మూఁడుసార్లు వాఁడు గొరకలేదు. నాల్గవసారి వాఁడు చనిపోయెనన్నవార్తయే వచ్చెను. ఈ కాలంజరి భర్తమీఁద నాకెంతకోపము వచ్చినదో చెప్పలేను. వానిని చంపించవలయునని చాలసార్లనుకొంటిని. వానిని చంపి యేమిప్రయోజనము? వాఁడు బ్రతికియుండినకదా, ఎప్పుడో యొకప్పుడు వానిచేతఁ బాడించి విననచ్చును. ఆ విదిశానగరిప్పులోని వార్తలు వచ్చుటయే కష్టమగుచుండెను. రాజాజ్ఞలేకుండ విదిశానగరముఁ బ్రవేశించుటకే యసాధ్యముగా నున్నది. ఆ విదిశానగరములో నొకఁడే రహస్యమున్నది. ఆరహస్యముయొక్క స్వరూపము తెలిసికొనుటకు నేను పదునెనిమిది నెలలనుండి ప్రయత్నించుచుంటిని. నే నాడుదానినైపోతిని. నాకు రహస్యచారులులేరు. నన్ను నమ్మి పనిచేసెడివ్యక్తులులేరు. నేనన్నచో నందఱు గౌరవింతురు. నేనొక రాణినికాను. రాజాధికారము నాయందు లేదు. మహాసేనాధిపతి చెప్పెనందును. సేనాధిపతి తాను నోటితో చెప్పఁడాయెను. నాయాజ్ఞలకు బలములేకుండ నున్నది. చిన్నచిన్న పనులు చేయించుచుంటినిగాని, మహాకార్యము సాధించుట నా చేతనగుటలేదు. నేను మీయింటి కమ్ముడుపోయితిని. నేను మీకు దాసినైతిని. వాసు:- అమృతవల్లీ! అట్లు మాటాడెదవేమి? నీవు నన్నీపని చేయుమని యెప్పుడడిగితివి? నేనెప్పుడు కాదంటిని? అన్నిపనులు నీయంతట నీవే చేసికొని పోవుచుంటివి. నేనూరకుంటిని. నీ వీయింటిలో దాసివా? అమృత:- మఱి నే నీయింటిలో

నెవరను? వాసు:-నీ వీయింటికి రాణివి. అమృత:-ఈయింటికి రాజెవరు?—వాసుదేవుఁడు మాటాడలేదు. భూమిమిత్రుఁడు మాటాడలేదు. అమృత:-తెలిసినదా? ఇది నాస్థితి. కానిమ్ము ఒక్కటి చెప్పెదను. కాలకంఠుఁడు మగధరాజ్య దక్షిణ కోణ ప్రదేశమునుండి వచ్చివేయును. ఆకోణదేశమంతయు తక్కిన ముగ్గురు దుర్గాధిపతుల నధీనము చేయఁబడవలయును. సుమ్న ప్రసుమ్న మధ్యదుర్గములు మన యధీనములో నుండ వయును. ఈపని కొలఁది దినములలో జరుగవలయును. ఇది చాల యవసరము. అట్లు చేయుటకు నాకు సామర్థ్య మున్నచో ననఁగా నామాట పాలింపఁబడినచో ననఁగా నా యీ యాజ్ఞలు మహా సేనాధిపతి తాను ప్రత్యక్షముగాఁ బాలించినచో నపుడు నేను రాణిని. రాజెవరైనచో నాకేమి? నేఁడు వాసుదేవుఁడు కావచ్చును. రేపు భూమిమిత్రుఁడు కావచ్చును. నాకు వేఱు పనియున్నది శ్రీమాలినిఁగుఱించి కనుగొనవలయును.—అని యమృతవల్లి వెడలిపోయెను. తండ్రి కొడుకు లిద్దఱు నొకరి మొగము లొకరు చూచుకొనుచుఁ గూర్చుండిరి. కొంతసేపటికి భూమిమిత్రుఁడు తండ్రితో నిట్లనెను. "నే నిపుడు మహామంత్రిని. అమృతవల్లి వ్రాసిన ప్రతి కాగితము నా ముద్రతో వెళ్ళును. తమరి ముద్రకూడ దానిమీఁద నుండవలయును. అని భూమిమిత్రుఁడు వెడలిపోయెను. వాసుదేవుఁ డొక్కఁడు కూర్చుండెను. అతని మనస్సులో నొక్కటియే ప్రశ్న. అమృతవల్లి రాణి యైనచో రాజెవరు? అమృతవల్లి యుద్దేశ్యమేమి? ఆమె భూమిమిత్రునిఁ బ్రేమించుచున్నదా? భూమిమిత్రునకుఁ

దానింతవఱకు వివాహము చేయలేదు. ఎందుచేత? అమృత వల్లి మున్నెన్నోసార్లు తానిట్టి స్ఫురణలకు స్థానమిచ్చు వాక్యము లన్నది. అన్ని వాక్యములలో నామె తన్ను ప్రేమించుచున్నట్లుగా నర్థములే వచ్చును. తాను నలుఁబది యేడేండ్ల వయస్సుకలవాఁడు. తనయీడు కూతుకకలవాఁడు. ఏకపత్నీవ్రతుఁడు. శివపూజా ధురంధరుఁడు. అమృతవల్లి తన్నుఁ బ్రేమించునా? తనయందు వాంఛ పెట్టుకొనునా? అది సాధ్యమైన విషయము కాదు. తనయొక్క యాధ్యాత్మిక చింతన చేతనైనను. తనయొక్క యవ్యసనితా లక్షణముచేత నైనను, తన కుటుంబ పరిస్థితులచేతనైననుఁ దా నమృతవల్లిని స్వీకరించుట సంభవించదు. ఆమె పలుసారిట్లనుటచేత దాని లోని యర్థము భూమిమిత్రునకుఁగూడ స్ఫురించి యుండ వచ్చును. స్ఫురించియు నతఁడు పైకనుటలేదు. అతని తండ్రి యీ వయస్సులో మఱియొక స్త్రీని పెండ్లియాడుట యనునది వాఁ డిష్టపడునా? ఏస్త్రీ తన తండ్రిని వాంఛించుచున్నదో ఆ స్త్రీనిఁగూర్చి గౌరవముగా ప్రవర్తించుట యుండునా? అమృతవల్లి రాజుయొక్క ఈ దుశ్శీలతను పురస్కరించుకొని రాజ్యము తా నపహరింపవలయు ననుకొనుచున్నది. తనకు రాజ్య మక్కఱలేదు. ఎవరికోసము? భూమిమిత్రునికోసమా? భూమిమిత్రుఁడు మంచిబిడ్డ. వాఁడు తన మాటను మీఱి పోఁడు. తానే యతనికి దైవము. భూమిమిత్రునకుఁ గూడ నీ రాజ్యాశ కలిగినది. వీరిద్దఱు కలిసి తనకు రాజ్యము సంపా దించి పెట్టవలయునని యూహించుచున్నారా? తాను రాజ ద్రోహము చేయునా? తనకు రాజ్యము కావలయునా? తన

కక్కఱలేదు. తన కొడుకునకుఁ గావలయును. ఆ కుమారుని కొఱకు తాను రాజు కావలయును. ఇదియేమి వ్యూహముగా నున్నది. ఈ యమృతవల్లి కింతటి యూహాశక్తి యెక్కడిది? ఆమె కింత రాజనీతి యెక్కడిది? ఆమెకుఁ దనమీఁద నిట్టి వలపేమి? ప్రయోజనము మాలిన యీ కోర్కెను తా నెందుకు కొనసాగించుకొనుచున్నది? — అనుకొనుచుండఁగా నొక సైనికుఁడు తన వద్దకు వచ్చి యొక పత్రమునుఁ జూపించెను. దానిమీఁద నిట్లు వ్రాయఁబడి యున్నది. "మగధ రాజాధిరాజ చక్రవర్తి శ్రీ దేవభూతిమహారాజ పదసన్నిధానమునకు - సేవకుఁడు వాసుదేవుఁడు వ్రాసికొను విన్నపము. నా కుమార్తెయు, నా యల్లుఁడును విదిశానగరమునందున్నారు. పెండ్లిచేసి బిడ్డ నత్తింటికి పంపించితిని. ఇంతవఱకు నేను చూడలేదు. ఆమె యచ్చటనే గర్భవతియైనది. పురుడు పోసికొన్నది. కూతురు కలిగినది. ఆ పసిపిల్ల కెనిమిది నెలలు వెళ్ళుచున్నవి. శ్రీమాలితల్లి కూతును చూడకుండ నింక నుండలేదు, శ్రీమాలి పుట్టిన దినము నెలదినములలో వచ్చుచున్నది. అల్లునిఁ గూతుని మనుమరాలిని గిరివ్రజపురమునకుఁ దీసికొనిరావలయును. ప్రభువులను గ్రహించి వారిచ్చటికి వచ్చుటకు ననుమతి దయ సేయవలయును. వేగరులైన దూతలనుఁ బంపించుచున్నాను. వెంటనే యందలగుఱ్ఱపు శకటములనుఁగూడ నేర్పాటు చేయుచున్నాను. ఐదాఱు దినములలో నాబిడ్డలను పంపించుటకు ప్రభువులకుఁ గరుణయుండవలయును - సేవకుఁడు" — వాసుదేవుఁడు లేఖను చదివెను. వెంటనే తాను తనయంగు

లీయక ముద్రవేసెను. సేవకుఁడు వెడలిపోయెను. మఱల వాసుదేవుఁ డాలోచన ప్రారంభించెను. ఈయుత్తరములో విడ్డూరమేమియులేదు. ప్రియమైన కార్యము నమృతవల్లి చేసెను. తన మనస్సున కిందులో నేదో తొందఱయున్నట్లు కనిపించుచున్నది. నిజానికేమియు తొందఱలేదు. పసిపిల్లకు తొమ్మిదవనెల దాటినచోఁ దీసికొనిరారాదు. మఱల రెండునెల లాలస్యమగును. — ఆసేవకుఁడు మఱల వచ్చెను. వాసుదేవుఁ డతనివంకఁ జూచెను. వాఁ డా పత్రమును మఱల నందిచ్చెను. దానిక్రింద నిట్లు వ్రాయఁబడియున్నది. "నిశితమతి యన్నదాసిని బంపుచున్నాను. ఆమె నా కుమార్తెవెంటఁ దోడుగా రాఁగలదు."— వాసుదేవుఁడు దాని క్రింద మఱల ముద్రవేసెను. సేవకుఁడు వెళ్లెను. — నిశిత మతి యెవరు? అట్టిపేరుగల దాసి తనయింటలేదు. అంతలో నమృతవల్లి వచ్చెను. వాసుదేవుఁ డడిగెను—నిశితమతి యెవరని — అమృతవల్లి నవ్వెను. వాసుదేవున కర్థముకాలేదు. నీవేనా యనెను. అమృతవల్లి "నేనుకాను. నే నిచ్చట నుండి ప్రస్తుతము పోవుటకు వీలులేదు. నిశితమతి యన్న దానిని నేను క్రొత్తగా కనుగొన్నాను. ఇన్నాళ్ళు నాకు తెలియలేదు. ఆమెను పంపించవచ్చునా? పంపించరాదా యనియే నాయూహగా నుండెను. ఇప్పుడు నిర్ణయించితిని. పంపించుచున్నాను. అదియట్లుంచి ఈరెండు పత్రములమీఁదఁ దమరు ముద్ర లుంచవలయును. రాజాజ్ఞగా వెంటనే పాలించవలయునని మీచేతితో వ్రాయవలయును — వాసుదేవుఁ డొక పత్రమునుఁ దీసికొని చదివెను. — "మగధ దక్షిణ

కోణస్థ గంధపురిదుర్గాధిపతి కాలకంఠునకు. ఇది మహా రాజాజ్ఞ. మాకు వారు మీకు వెంటనే వ్రాయవలసినదని ఈయాజ్ఞ పంపించిరి. ఇది యవశ్యాచరణీయము. పది దినములలో మీరును మీ భార్యయైన నీలలోచనయు గిరి వ్రజపురములో నుండవలయును. మహారాజు విదిశానగర మున నుండుటవలన గిరివ్రజపురమునఁ గొన్నియవసరములైన కార్యములు మిగిలిపోయినవి. మంత్రులు రాజభక్తియందు పూర్వమువలెలేరు. మాకునచ్చినబంటు గిరివ్రజమునలేఁడు. ఒక్క వాసుదేవుఁ డున్నాఁడు. ఆయనకు సైన్యవ్యవహార ములతోడనే సరిపోవుచున్నది. మీరువచ్చి గిరివ్రజపురము నందుండి వాసుదేవుఁడు చెప్పినట్లుగాఁజేసి వాసుదేవుఁడును మీరునుఁగలిసి గిరివ్రజ రాజధానిరక్షణ యవశ్యముగాఁజేయ వలయును. ఇంకొక యాలోచన లేకుండ వెంటనే రావల యును. నీలలోచనయొక్కతల్లి కూతునుఁ జూడవలయునని వాంఛించుచున్నది. ఆమె యిప్పుడు మావద్దనుండి వచ్చు టకు వీలులేదు. ఆమె గంధపురమునకు బయలుదేఱుదు ననుచున్నది. మే మాపితిమి. మీరు సకళత్రముగా గిరి వ్రజపురమునకు వచ్చినచో నామె గిరివ్రజమునకు వచ్చి కూతునుచూచి రాఁగలదు."–వాసుదేవుఁ డీపత్రమును చది వెను. తనముద్ర వేయవలయును. ఇది రాజాజ్ఞకాదు. అమృతవల్లి యిట్లెందుకు చేయుచున్నదో తెలియదు. ఆమెను ప్రశ్నించినచో నామెకుఁ గోపమువచ్చును. నేను రాణిని కాదుకదాయని యధిక్షేపించును. వాసుదేవుఁడు తక్కిన పత్రములను తీసెను. "మగధదేశ దక్షిణకోణస్థములైన

తక్కిన మూఁడుదుర్గముల యధిపతులకు నవియాజ్ఞలు. వాసుదేవుఁడే స్వయముగా వ్రాసినట్లున్నవి. వారు మువ్వురును తద్దేశ రక్షణయందు జాగరూకులై యుండవలయును. వారిలో నొకఁడు గంధపుర దుర్గాధిపత్యము వహించవలయును. అచటనున్న కొందఱు సేనానులకు వేఱేయాజ్ఞలున్నవి. వారా మువ్వురు దుర్గాధిపతులు చెప్పినట్లు నడువవలయును. ఆయాజ్ఞలు పాలింపఁబడినచో గంధపురి సైన్యము నాల్లు భాగములుగా నై యొక్కభాగమే గంధపురియందుండును. తక్కిన మూఁడు భాగములు మిగిలిన మూఁడు దుర్గములకు పోవును. ఇచటనున్న సర్వసైన్యములు గంధపురమునకుఁ బోవును. సేనాపతులలోఁ బలుమార్పులు కలవు. ఒకచోటివాఁ డొకచోట నుండఁడు. క్రొత్తగా వందమంది చమూపతులు తద్దళాధిపతులుగాఁ బంపింపఁబడు చున్నారు. అచ్చటి దళాధిపతులు గిరివ్రజమునకు వచ్చుచున్నారు. సుమన్నప్రసుమన్నదేశముల నడిమి దుర్గముల యందు కూడ నిన్నిమార్పులు చేయఁబడినవి. ప్రతిదుర్గము నందుఁ గొంత సైన్య ముండును. అందులో సగముసైన్యము తత్ప్రాంతీయమైనదే యుండును. తక్కిన సైన్యము పంపింపఁబడును. ఈ యాజ్ఞల ప్రకారము సర్వ దుర్గముల యందు మున్నున్న సైన్యము లేవియు నుండుటకు వీలులేదు. గిరివ్రజమునుండి సైన్యము లచ్చటికిఁ బోవుచున్నవి. వాసుదేవునకు పరమభక్తులైన సేనానులు, దళవాయులు, దుముదారులు తత్తద్దుర్గములకుఁ బంపింపఁబడుచుండిరి. అచ్చటివా రంద ఱిచ్చటికి వచ్చుచుండిరి. క్రొత్తగా నచ్చటికిఁ

బంపింపఁబను సేనాపులు దుర్గాధిపతులను మించి యధికార మును వెలయించుటకు నేర్పాట్లు చేయఁబడినట్లు దుర్గాధి పతులకు వ్రాయఁబడిన లేఖలలో విస్పష్ట మగుచున్నది. వాసుదేవుఁడు;- ఇదియంతయు నేమి? అమృత:- రాణిచేసెడు పని. వాసు:- ఎందుకు? అమృత:- ఆమాట యడుగుట కొక్కనికే యధికార మున్నది. అతఁడు రాజు కావలయును. వాసు:- వీనిమీఁద ముద్రలను వేయుమందువా? అమృత:- వట్టి ముద్రలు వేయుటయే కాదు. వెంటనే ఈ సర్వములైన కార్యములు సమాచరింపఁబడవలయును. మఱియుఁ గ్రొత్త సైన్యములు గిరివ్రజమునకు వచ్చును. ఆ సైన్యములమీఁద మీరు సంపూర్ణమైన యధికారమును సంపాదించి వారి విశ్వాసమును గడించవలయును. వాసు:— రాణియొక్క యాజ్ఞాప్రకారము చేయుదును. నేను పెద్దవాఁడనై పోయి నాను. నీకును భూమిమిత్రునకు నేది యిష్టమో అది చేయు దును. అమృత:-ఏఁబది యేండ్ల లోపుగానే వృద్ధులగుదురా యేమి? వందయేండ్లు దాటినఁగాని వృద్ధులు కారు. కలికాలము మఱియుఁ గొన్నివేలయేండ్లు దాటినచో నేఁబది యేండ్లకుఁ బురుషులు వృద్ధులు కావచ్చును. ఇప్పటికి రెండువేలయేండ్లేకదా గడచినది. రెండువేల రెండువందల యిరువదియేండ్లు గడచినది. వాసు:- ఈ లెక్క నీ కెట్లు తెలియును? అమృత:- కాలంజరి భర్త యున్నాఁడు. వాని పేరు రామడుగు. వాసు:- అదియేమి పేరు? అమృత:-చాల చక్కని పేరు. పాళీభాష యగుటచేత మీకు విపరీతముగా నున్నది. సంస్కృతములో చెప్పినచో రామ పాదము.

వానికి కాలజ్ఞానపు పాటలన్నియు వచ్చును. వాని పాటలలో నున్నది. ఇంక మూఁడువేల యేండ్లకు భారతదేశము చిత్ర చిత్రములైన మార్పులు పొందునట. ఇప్పటి మన స్థితిని వారు నమ్మరట. వారప్పు డట్లుందురని వాఁడు పాడినపాటం లోని విషయములు నేను నమ్మలేదు. ఇతర దేశములలో నితర కాలములో నింకొక్క పద్ధతిగా జను లుందురు. ఆచారము లుండును. అన్నచో సామాన్య బుద్ధి యంగీకరించదు. సామాన్యబుద్ధి యనఁగా నాలోచనలేనిబుద్ధి. మూఢమైనబుద్ధి

వాసు:- సరే—అమృతవల్లి వెడలిపోయెను. వెళ్ళిన యమృతవల్లికి తీరిక యెచ్చట? ఆమె తనలో తాని ట్లనుకొన నారంభించెను. ఏమియు తోచక ఒక కంచియనుఁదెచ్చి నెత్తిన వేసికొన్నట్లున్నది. ఏదో జరుగునని ప్రతీక్షించుచు దాని యొక్క నిశ్చయములేక నది యట్లు జరిగినచో నిట్లు జరుగవలయునన్న యొక పదకమెత్తి యా పదకమునకు దోహదము చేయుచుండుట, అది యట్లు జరుగకపోయినచో నెత్తిన యీ పదకముయొక్క రూపాదులు స్పష్టపడి ఇది దోషహేతువుగా భాసించవచ్చును. తా నెవ్వరినిఁ ప్రేమించున్నదో వారిని గోతిలోనికి దించుచున్నది. తా నీపదక మెందుకెత్తినది? ఇందుకా? తాను వాసుదేవునిఁ ప్రేమించుచున్నది. ఆప్రేమఫలించదు. ఉభయథా దాని ఫలమునకు వ్యతిరేకముగానే యున్నది. అతఁడు తన్ను పెండ్లియాడఁడు. దాని కతని భార్యయు నతని కొడుకును నడ్డంకులు. ఆ రెం డడ్డంకులను తొలఁగించవచ్చును. వారినుండి యంగీకారమునే పడయవచ్చును. ఒకవేళ వాసుదేవునిఁగూడ నంగీకరింపఁ

జేయవచ్చును. అయ్యయ్యో! తానే వివాహము చేసికొనుటకు యోగ్యురాలుకాదే. ఆ జయద్రథుఁడు తానెప్పుడేదో మాట యనుటయుఁ దన ప్రకృతిలోనున్న యొక వికార లక్షణముచేత దాని నాదరించుటయు నైదాజేండ్లు విషము తినుటయు నిల్లు తినుటవలన తన దేహము విషమయ మగుటయు తాను రాజులు శత్రురాజులమీఁద ప్రయోగించెడి యొకయాయుధముగా మాత్రమే యయి మిగిలిపోవుటయుఁ దన ప్రేమంతయు, తనస్త్రీత్వమంతయు, తనకోరికలన్నియు, నిల్లు విషమయము లగుటయు నామె భావించి ఈ రీతిగా తన వాంఛా నైష్ఫల్యము తాను ప్రేమించినవానిని ధారుణీపతిగాఁ జేయుటతో తన కోరికను సరిపుచ్చుకొనవలయునన్న జీవాశ తనచేత నిల్లుచేయించుచున్నదని యామెకుఁ దోచెను. నిజమే. ఈ నిశితమతి తన యింటిలో నిన్నాళ్ళుగాఁ బని చేయుచున్నది. ఆమె నిన్నాళ్లు తానేల గుర్తుపట్టలేదు? దాని వివేకము నెందుకు గ్రహించలేదు? అది తన తెలివిని వందసార్లు తనముందు వెలయించెను. తానే గ్రహించలేక పోయెను. వట్టి పనికత్తె యనియు నిండ్లలో పనిపాటలు చేసి బ్రతికెడిదనియు దానియందు తాను నిరాదరముచూపించెను. అది ఈనాఁటి ప్రొద్దున తన తెలివి నదుపులో పెట్టుకొనలేక పోయినది కాబోలు. తన వివేకము నాకు నేమైననుసరే తెలిపించుకొన నెంచినది కాబోలు. బయటపడిన నాతోనన్నది. "నీవు మహాసేనాధిపతిని ప్రేమించుచున్నావు. అది సాధ్యమయ్యెడి పనికాదు" అన్నది. నా కాశ్చర్యము వేసినది. ఇంత హఠాత్తుగా నట్టిమాట నాతో ననుటకు నిది యెట్లు

సాహసించినదని, నేను దానిని శిక్షింత మనుకొంటిని. నన్ను నేను నిగ్రహించుకొంటిని. దానిని పదిప్రశ్నలు వేసితిని. అది సమాధానములు చెప్పినది. నీకింత తెలివి యెట్లువచ్చిన దని యడిగితిని. అది వార్తలుతీయుటలోఁ దనకు సహజముగా ప్రజ్ఞయున్నదని చెప్పెను. దానిని విదిశానగరము నకుఁ బంపించితిని. అది మఱి రెండు విషయములుచెప్పెను. సులభములుగానే యున్నవి. నాకెందుకు తోచలేదో తెలియదు. ఈమాత్రమైన సులభసాధ్యమైన కార్యమునకు రామదుగును పదునెనిమిదినెలలు వృథాగా పోషించితిని. ఓయీ! కాలంజరి నీకు కనిపించినచో నీ వా పాట పాడెద నందువు. నీవాపాట పాడినచో నీకుఁ గాలంజరిని కనిపింప చేయుదును. మఱల నీభార్య నీకు దక్కును. అన్నచో వాఁడు పూర్వమెప్పుడో పాడి వినిపించెడివాఁడు. వినిపించక యేమిచేయును? ఎంత సులభమైనయూహ? అది యెట్లు తోచలేదు? నా కాశ్చర్యముగా నున్నది. మఱియు కాల కంఠునిఁ దీసికొనివచ్చి గిరివ్రజపురములో నేమిచేయవలయును? అతఁడు కొంత సైన్యముతో వచ్చును. వచ్చిన తరువాత నిజమైన రాజాజ్ఞచేత రాలేదని వానికిఁ దెలియవచ్చును. వానితోడి వ్యవహారమెట్లు? ఈప్రశ్న కెంతసులభముగా నిశిత మతి సమాధానము చెప్పినది. అతని నిచ్చట యుంచుట యెందులకు? అతనిని భార్యతోకూడ విదిశాపురమే పంపించుము. రాజాజ్ఞలేకుండ నతఁ డచ్చటికి చేరినవెనుక, వాని కచ్చటనే తెలియును. నిన్నేమిచేయును? అంతదూరము వెళ్ళినవాఁడు తిరిగిరాఁడు. ఆ నీలలోచన అంతటి యంద

కర్తయైనచో రాజే తిరిగి రానీయఁడు. ఆనీలలోచనతల్లికి రాజునకు తేలికగా చెడిపోవును. చాముండియే నీకు సహాయము చేయును. ఇంత తెలివికల నిశితమతిని నే నిన్నాళ్లు గుర్తుపట్టలేక పోయితిని. శ్రీవత్సలాంఛనుఁ డేమయ్యెనో? శ్రీమాలి యెట్లున్నదో? నిశితమతియొక్క సందేహములు విన్నచో నాకు భయముగానే యున్నది. దానియూహ కాదనుటకు వీలులేదు. శ్రీమాలిమీఁద రాజున కట్టి దురూహ యుండుటకు వీలులేదు. ఆమె మహాసేనాధిపతి కూతురు. సహజముగా శ్రీమాలిని రాజు చిన్నతనములో నెఱిఁగియుండును. ఆమె పెండ్లినాఁడు వ్రాసిన యుత్తరము కూడ నాచనవును ఆముద్దునే వెల్లడించుచున్నది. అనఁగా నిశితమతి చిన్నప్పుడుముద్దే. పెద్దదైన తరువాత వలపు అన్నది. పైగా రాజు శ్రీమాలియొక్క సౌందర్యమును విని యుండును. తాను పెండ్లికెందుకు రాలేదనఁగాఁ బెండ్లికి వచ్చినచో శ్రీమాలినిఁజూచును. తనకోర్కి యప్పుడే వెల్లడించినచోఁ దరువాత నామెను పొందుట సాధ్యము కాదు. దూరపు చూపుతో నాయుత్తరమునువ్రాసినాఁడనెను. ఎట్లైనను నిశితమతిమాత్రము నిస్సందేహముగా విదిశానగరములోని సర్వరహస్యములనుఁ దెలిసికొని రాఁగలిగిన గడుసరి. అది చెప్పినదికదా "అమ్మా! నీవంటి యాశ్రయము నాకు దొరకవలయునని నే నెన్నాళ్ళ నుండియో యెదురు చూచుచున్నాను. పలు రాజకుటుంబములయందు నేను పనిచేసినాను. ఆస్త్రీలందఱు వట్టిస్త్రీలు. వారికిఁ గావలసిన నలంకారములు, విహారములు, శృంగారలీలలు

మేలైన వసనములు, వినోదములకు పోవుటలు, మాత్సర్యములు వారిలో వారి కీర్ష్యలు, తెగతినుటలు, నిదురపోవుటలు, మాత్రమేకాని యాలోచనలుకాని, నీతిమార్గములుకాని, మహాకార్యములు సాధించవలయునన్న పట్టుదలలుకాని యేమియునులేవు. నిన్ను నాలుగేండ్లనుండి చూచుచున్నాను. నీ స్వభావమును గుర్తుపట్టినాను. రెండేండ్లనుండి నీకదలికల ననుసరించుచున్నాను. నీకు పలుసార్లు నేను సాయపడుదాననని సూచించినాను. నీవు నన్ను గ్రహించలేదు. నీహృదయములోని పరమరహస్యము నీముఖమున నొక్కసారి చెప్పివేయుదను. అప్పుడైన నీకుఁ దెలియునేమోయని యీ ప్రయత్నము చేసితిని. శ్రీమాలియు నీవును కాలంజరి వద్దకు సోదెకు పోయిననాఁటినుండి నీవుచేసిన సర్వప్రయత్నము నాకుఁ దెలియును. నీవు నాకేదియో చెప్పవచ్చుచుంటివి. ఏమియుఁ జెప్పనక్కఱలేదు. ఇంకను నీవడిగినచో నేనే చెప్పెదను. నీవు నన్ను విదిశానగరమునకుఁ బంపించుచుంటివి. అచ్చటికథ రెండువిధములుగా నుండవచ్చును. అట్లో యిట్లో. శ్రీమాలిని రాజు పొందియుండును. ఆమె భర్తకు నది తెలియకపోవచ్చును. శ్రీమాలి తన రహస్యమును చెప్పదు. ఇది సామాన్యముగా జరుగువిషయము. నీతో నీయింటికిరాఁగా శ్రీమాలిని నేను చాలసార్లు చూచితిని. ఆమె ముఖలక్షణములు, ఆమె నడకే, ఆమె మాటాడుతీరు నామె మహాపతివ్రతయగునని నే ననుకొంటిని. ఆమె రాజునకు సాధ్యపడదు. ఆయూరినుండి ఆమెయు ఆమె భర్తయుఁ బోవుటకు వీలుండదు. రాజు పోనీయఁడు. నా

రిరువురు నచట కష్టములు పడుచునుందురు. రెండవ విష యము నిజమైనచో రాజు శ్రీమాలిని గిరివ్రజపురమునకుఁ బంపఁడు. ఏదో యడ్డంకి చెప్పును. సేనాపతిని, సేనాపతి భార్యను విదిశానగరమునకు రమ్మనును. పుట్టినదినము పండుగు యచ్చటనే చేయవచ్చుననును. తానుకూడ మాతు ననును. సేనాపతి కాదనునా? కాదనుటకు వీలున్నదా? అయినను నేనుపోయి వత్తునుకదా యన్నది.

ఆ మఱునాఁడు రామడుగునద్దకు నమృతవల్లి వెళ్లెను. ఇట్లనెను. ఓయీ! నీ కాలంజరి భద్రముగానున్నది. ఒక రాజపురుషుని యధీనములో నున్నది. మాకు వార్త వచ్చి నది. ఆమె నీకోసము తపస్సు చేయుచున్నది. ఆ రాజ పురుషునకు గొప్ప రాజకీయ వ్యవహారము పట్టినది. ఆ వ్యవ హారములో నీ వా పాడెడు పాటలలోని యొండు రెండు విష యములు తెలిసికొనవలసిన యవసర మేర్పడినది. అవి తెలిసినగాని యాయన యెట్లు ప్రవర్తించవలయునో యాతనికిఁ దెలియదు. నీ వాపాట పాడి యాయనకు వినిపింపవలయును. అప్పుడు నీభార్య నీకు నొసంగఁబడును. నేను చాల ప్రయ త్నము చేసితిని. నీకు వాగ్దానము చేసితినిగదా? నీభార్యను నీకు సమకూర్చియే యాపాట నాయనకు వినిపింపవలయునను కొంటిని. ఆయన పట్టుపట్టెను. ముందు తాను వినవలయు నట. ఆయన పట్టుదల మఱియు పెరిగినది. ఏలయనఁగా నీకుఁ దెలియునో తెలియదో నీవు పాడెడి పాటలు కొన్ని పురాణ ములలో నున్న విషయములే ఎవఁడో పాటలుగా కట్టిన విష యములు. మత్స్యపురాణము, వాయుపురాణము, భవిష్య

పురాణము, ఈ పేర్లు వింటివా? రామ:- విన్నానమ్మా విన్నాను. వానిలోని విషయములే ఈ పాటలలోని విష యము లని నాకొక బ్రాహ్మణుఁడు చెప్పెను. నీవు చెప్పు చున్న రాజపురుషుఁడు పోయి యా పురాణములను చూచు కొనరాదా? నన్ను బాధించుట యెందులకు? అమృత:- నిజమే. నిన్ను వదలిపెట్టవలయునని యనుకొన్నాను. కాని యా గ్రంథములు సామాన్యముగా దొరకవు. ఏ పండితుల యిండ్లలోననో యుండును. ఆ పండితు లెవ్వరో తెలియదు. రాజాస్థానములలో నుండును. మన యాస్థానములో నున్న గ్రంథములోఁ గొన్ని విషయములు కలిగిన పత్రములు దొరకలేదు. ఆ పత్రములలోని విషయములే ప్రధానముగా నాయనకుఁ గావలసివచ్చినవి. నీవు పాడి వినిపించుము. నీభార్య నాయన నీ కప్పగించును. రామ:- వెంటనే యప్ప గించునా? అమృత:- వెంటనే యప్పగించుట కామె యీ యూరిలో నున్నదా? ఆమె వచ్చుటకు పది దినములు పట్టును. రామ:- అట్లైనచో వినిపించి యేమి లాభము? అమృత:- నీ వెప్పుడు వినిపింతువో అప్పటి కెప్పటియుపుడు పది దినములకుఁగాని నీభార్య నీకు రాదుకదా! ఆ పది దిన ముల యాలస్యము నీ కెప్పుడును తప్పదు. నీవు వినిపించని యాలస్యము నీవే చేసికొన్న ట్లగును. రామ:-సరే. చెప్పి వినిపింతును. అమృతవల్లి వెడలిపోయెను. ఆమె యామాటలు నాఁడు వాసుదేవునితో భూమిమిత్రునితో నీసంగతి చెప్పెను. ఆపాట లతఁడు వినిపించును. వాసుదేవుఁడు రాజగుట పురా ణము నుండి సంస్కృత భాషలో మీరు చదువుకొన్నదే

కదా! ఆ నసుమ నొక కాగితము పోయినది. అందులోని సంగతులు రామదుగు పాడును. మీరు విననచ్చును. మీ కభ్యంతరము లేనిచో నేను వానినిఁదీసికొనివచ్చి మీముందు పాడింతు ననెను. వాసుదేవుఁడు:—దానికిప్పుడు వచ్చిన తొందరయేమి? అమృత:- ఆచ్చట నామెస్థితి యెట్లున్నదో యీ పాటనుఁబట్టి తెలియునేమో! వాసు:- ఐదారు దినములలో నీవు పంపించిన దాసి వచ్చునుకదా! అమృత:- ఇతఁడు పాడెడు పాటయు, నామె వచ్చి చెప్పెడి మాటయు రెండునుఁ గలిసినచో మనము దానియం దెక్కువ విశ్వాసముంచవచ్చునుకదా? వాసు:- అమృతవల్లీ! నీ మాటలు నీ చేఁతలు నా కాశ్చర్యములుగా నున్నవి. మహారాజునకు లేఖను వ్రాసితిని. ఆయన పిల్లలను ముప్పురనుఁ బంపించును. ఆమె పుట్టినదినము పండుగుఁ జేసికొందుము. మఱల వారు విదిశానగరమునకుఁ బోదురు. ఆ పాటలలో నేమియుండును? అమృత:- ఏమియు లేవిచో భవిష్యపురాణములో వాసుదేవుఁడు రాజగునని ఎందుకు వ్రాయఁబడి యున్నది? వాసు:- అవి యెవరు వ్రాసిరో! అచ్చముగా భగవంతుఁడైనవాఁడు వ్రాసినట్లే యిప్పటికి నీపురాణము లున్నవని యెట్లు చెప్పఁగలము. అమృత:- ఆ పురాణముయొక్క ప్రతి వ్రాసికొను నొకానొక బ్రాహ్మణుఁడో మఱెవ్వరో భవిష్యత్తులో దేవభూతియను రాజు పుట్టును. ఆయనకు వాసుదేవుఁడను సేనాపతి యుండును. ఆ సేనాపతికి రాజ్యమిప్పింతమని యట్లు వ్రాసెనందురా? అతఁడు వ్రాసినచో మీకు రాజ్యము వచ్చునా? పుష్యమిత్రాదుల కట్లే రాజ్యములు వచ్చెనా?

అతఁడు వ్రాసినంత మాత్రముచేత పూర్వము నందునకు చంద్రగుప్తునకు పుష్యమిత్రునకు రాజ్యములు వచ్చినవో మీకుమాత్ర మెందుకురాదు?— వాసుదేవుఁడు నిరుత్తరుఁ డయ్యెను. భూమిమిత్రుఁ డిట్లనెను. రేపో ఎల్లుండియో నిశితమతి వచ్చుననఁగా నప్పుడు వీనివలన పాట విందము. ఈ లోపుగనే యూరకయే మనస్సును వ్యాకులపెట్టుకొనుట యెందులకు? అమృత:-మనము వేగములైన శకటములమీఁద వార్త నంపించితిమి. ఆఱుదినముల ప్రయాణము వారు మూఁడు దినములలోఁ జేయుదురు. వారీపాటికి విదిశానగరమునుఁ జేరియుందురు. నేఁ డాదివారము. రేపచ్చట బయలుదేరినచో గురువారమునాఁటి కిచ్చటికి రావచ్చును. మనము బుధవారమునాఁడు వాని పాట విందమా? వాసు:- అంత తొందర యెందులకు? వారు బయలుదేరి వచ్చుచున్నచో ముందు వార్తాహరునిఁ బంపింతురు. అప్పుడు వినవచ్చును. లేదా వారు వచ్చినతరువాతనే వారును మనమునుఁ గలిసి వినవచ్చును. అమృత:- కలిసి విన్నచో ఫలితమేమి? ముందు వినవలయును. అది నిజమో కాదో తరువాత తెలియ వలయును. వాసు:- ఆనిశితమతి అంత తెలివికలదా? అమృత:- నేనామెతో గంధపురినుండి కాలకంఠునిపిలిపించుటఁ జెప్పితిని. ఆ కాలకంఠుని గిరివ్రజపురమున నుంచుట శ్రేయము కాదోమో యంటిని. ఆమె యేమన్నదో తెలియునా? వాసు:- ఏమన్నది? అమృత:- ఇట్లన్నది. వానిని గిరివ్రజమున నుండనీయవద్దు. సూటిగా విదిశానగరమునకుఁ బంపివేయుడు. రాజు తన్ను రమ్మని యాజ్ఞాపింపలేదని వాని

కచ్చటనే తెలియును. అచటనుండి మిమ్మేమి చేయును? ఎంత తెలివిగలదో చూడుడు. వాసు:- అతఁడు కోపముతో తిరిగి మనమీఁదికి వచ్చినచో. అమృత:- రాఁడు. రాజు రానీయఁ డన్నది. వాసు:- ఎందుచేత, అమృత:- అతని భార్య నీలలోచన మహాసౌందర్యవతి కనుక, వాసు:-కాని భాగవతమహారా జామెకుఁ బెండ్లిచేసెను. ఆమెను తన కూతురుగాఁ జూచుకొను చుండెను. దేవభూతిమహారాజున కామె తోఁబుట్టువు వంటిది. అమృత:- ఊర్వశి యర్జునుని కోరెను. వారిద్దఱివరుస యెటువంటిది?

తరువాత పది దినములు గడచెను. గంధపురినుండి కాలకంఠుఁడు నీలలోచనా సమేతుఁడై వచ్చుచుండెను. మార్గమధ్యముననే వానికి వార్త యందింపఁబడెను. గిరి వ్రజములో నాగనక్కఱలేదు. సూటిగా విదిశానగరమునకే రమ్మని రాజుగారివార్త వచ్చినదని యతఁడు తెలిసికొని గిరి వ్రజములో రెండుదినములుండి తనగౌరవమును వినయమును భక్తియు వాసుదేవునకు తెలియఁజేసి తనసేనతో తన భార్యతో విదిశానగరమునకు బయలుదేఱి పోయెను. సుమ్న ప్రసుమ్న దేశముల నడిమిదుర్గములయందును మగధ దక్షిణ దిశా కోణదేశ దుర్గములయొక్కయు నాధిపత్యములు నడు పులు, రక్షణములు పాలనములు సర్వమును వాసుదేవున ననుకూలముగానున్నవను వార్తలు వచ్చెను. విదిశానగ రమునుండి వార్తవచ్చుట యాలస్యమైనకొలఁది యమృతవల్లి తాను వేఱువిధముగా తనసీతిని ఆచరణలో పెట్టుచుండెను. ఒకవేళ వాసుదేవుఁడు రాజ్యమును తాను స్వీకరించుటకు

నాయత్తపడినచో గిరివ్రజపురమునందు జనమెదురుతిరుగుదు రేమో! గిరివ్రజపురముమీఁద సర్వాధికారము వాసుదేవు నకులేదు. మంత్రులకున్నది. ఆ మంత్రులలో నందఱి కంటె నధికుఁడుగా భూమిమిత్రుఁడు చేయఁబడెను. కాని భూమిమిత్రుఁడు కఱ్ఱవాఁడు. అందరును వానియాజ్ఞనంగీక రింపక పోవచ్చును. గిరివ్రజపురముయొక్క పాలన సంపూర్ణ ముగా నాగరకుని చేతిలోనున్నదని. పట్టణాధికారి నాగ రకుఁడు. సర్వనగరపాలనము వానిచేతిలోనున్నది. అన్ని వీథులమీఁద నతఁడధికారి. వాని యనుజ్ఞచేతనే సర్వగృహ ములు నిర్మింపఁబడవలయును. గిరివ్రజపురము నాల్గుపేటలు నాల్గుభాగములు. ఒక్కొక్కభాగమునకు నొక్కొక్కఁ డధి కారి. వానిపేరు స్థానకుఁడు. ఒకొక్కవీథి కొక్కొక్క యధికారి. వానిపేరు గోపుఁడు. వీరందఱు నాగరకుని క్రింద నుందురు. నాగరకుని యాజ్ఞలకే లోఁబడియుందురు. గోపుఁడు తనవీథియందున్న సర్వజనుల యాదాయము వర్ణము గోత్రము, వృత్తి, ఆస్తి మొదలైనవాని లెక్కలు తనవద్ద నుంచుకొనును. స్థానికుఁడును, నాగరకుఁడును, మహానగ రములోని పాషండులెవరు, బాటసారులెవరు, తపస్వులెవరు, శ్రోత్రియులెవరు, శిల్పులెవరు, వీరులెవరు మొదలైన సర్వ వృత్తాంతములనుఁ దెలిసియుందురు. ఈ మహానగరమున వారికిఁ దెలియని విషయ ముండకూడదు. ప్రతిచిన్న విష యము నాగరకునకు తెలియఁజేయఁబడవలయును. ఊరిలోని జనులందఱు వాని యధీనమున నుందురు. అమృతవల్లి నాగరకునిఁ బిలిపించెను. వానితో మాటాడెను. స్థానికు

లనుఁ బిలిపించెను. గోపులనుఁ బిలిపించెను. గోపులు కొన్నివందలమంది, నలుగురు స్థానికులు. ఒక నాగరకుఁడు. వీరందఱకు నొకనాఁడు వాసుదేవుని యింటిలో విందేర్పరుపఁబడెను. ఎందుకు? ఆనాఁడు పండుగయేమి? అమృతవల్లి యొక్క జన్మదినమట. అమృతవల్లి జన్మదినమును వాసుదేవుఁడు చేయుట యెందుకు? అమృతవల్లి యాయింటిలో బిడ్డగాఁ బెరుగుచున్నదట. వాసుదేవుఁ డెంతమంచివాఁడు! తనకడుపునఁ బుట్టిన బిడ్డకాఁడామెను. తనకు వేఱేకూతు రుండఁగా నెవ్వని కూతునో ముఖ్యప్రేమగాఁ బెంచి యామె జన్మదినమింత బ్రహ్మాండముగాఁ జేయునా? ఆ యుత్సవము నాఁడు వాసుదేవుఁడును, భూమిమిత్రుఁడును, మహానగరము నంతయు వశముఁ జేసికొన్నారనిపించెను. గోపులకు కొన్ని వందలమందికి బహుమానము లీయఁబడెను. నూత్నవస్త్రము లీయఁబడెను. భూమిమిత్రుఁడు తానుపోయి భోజనసమయమునందు వారికి బలవంతముచేసి వడ్డించెను. ప్రధాన మంత్రివలన నింతగౌరవము పొందిన యాగోపులలోఁ బ్రతి వాఁడునుఁ దన వీధియంతయు భూమిమిత్రుని దనుకొనెను. స్థానికులును, నాగరకుఁడును వాసుదేవునకుఁ దాసానుదాసులైరి. వారు తమరాజు నెప్పుడుచూచిరి. మహామంత్రి తమరిని పిలిచి యెప్పుడు గౌరవించెను. మహాసేనాపతి యొక్కఁ డిట్టివాఁడుండెనా? రాజనఁగా నిట్లుండవలయును. వారందఱును వెళ్ళిపోవుచుండఁగా నమృతవల్లి స్థానికుల నలువురను పిలిచి మహానగరములోని పాషండులు బౌద్ధధూర్తులు వదలిపెట్టఁబడిన సైనికులు మొదలైవారి నామములు తనకుఁ

దెలియఁజేయవలయుననియు, వారందఱిని తాను చెప్పిన దినమున కోటలోనికిఁ బిలిపించి అట్టెపెట్టవలయుననియు బోధించెను. స్థానికులు చిత్తము చిత్త మనిరి. ఆమె యెంత చెప్పిన వాసుదేవుఁడే యంతగా నుండెను కదా! ఒక రాజ్యములో సర్వాధికారము ముప్పురియందు నిష్టమై యుండును. మొదటివాఁడు మహారాజు. రెండవవాఁడు మహామంత్రి; మూఁడవవాఁ మహాసేనాపతి, ఆ మహారాజును పదుమూఁడు, పదునాలుగేండ్లనుండి వారెఱుఁగరు. తొల్లిఁటి మహామంత్రి కన్నుపోయినచో గాజుకన్ను పెట్టించుకొనఁగా నున్నట్లుండినవాఁడు. ఇప్పుడు మహామంత్రివచ్చెను. మహాసేనాధిపతియు మహామంత్రియు తండ్రి కొడుకులు. తమ భక్తి యంతయుఁ జూపించుటకు నింతకంటె నుత్తమ స్థాన మెచ్చట లభించును? ఆ రాజునుఁగూర్చి వేవిధములుగ నాడుకొనుచున్నారు. ఇంతకు వీ రా రాజునందు భక్తులేకదా. ఆగోపులలో పలుమంది రాజునకు వ్యతిరేకులు. ఏలయనఁగా తా మేయే వీధులమీఁద నధికారులో ఆయా వీధులలోనున్న మర్యాదగల కొన్ని కొన్ని గృహములలో రాజు చేసిన యత్యాచారములు, ధూర్తత్వములు, వారికిఁ దెలియును. ఆ మర్యాదగల కుటుంబములు, పాపము, నోరుమూసికొని బ్రతుకుచున్నవి. కొన్ని కొన్ని సంసారములలో నాపత్తులే జరిగినవి. ఒక యింటి కూతురు రాజుచేత బలాత్కరింపఁబడినది. ఆమె నెలనాళ్ళకు తిరిగి వచ్చినది. ఆమె భర్త యామెను స్వీకరించనన్నాఁడు. ఆ పిల్లను తల్లిదండ్రు లేమి చేయవలయును? కడుపులో పెట్టుకొని బ్రతుకవలయునా?

నిత్యము దుఃఖించుచుండవలయునా? అల్లున కెట్లు సమాధానము చెప్పికొనవలయును? ఓయీ! ఇది రాజకీయమైన యాపద; మాశక్తికి దాటినది. దైవికముగా నొకటి సంభవించును. అచట మనము సమర్థులముకాము. వాని కొదిగి యుండవలయును. అన్నటువంటి వేదాంతవాక్యములు పౌరుషము సాగుచున్నచోట నక్కఱకు వచ్చునా? మఱియొక చోట నింకొక వీధిలో నొక బాలిక పుట్టినింటికి తిరిగివచ్చెను. ఆ మఱునాఁడు నూతిలోఁబడి చనిపోయెను. ఈ సంగతి యెవరితో చెప్పవలయును? ఇంకొక పేటలో నింకొక ఘోరము జరిగినది. అతనిభార్యను తానే విదశానగరమునకుఁ బంపక తప్పలేదు. భార్య తిరిగివచ్చెను. అతనికిద్దఱు పిల్లలున్నారు. అతఁడు పిల్లలను చంపి భార్యను చంపి తన్నుతాఁ గత్తిపెట్టి పొడిచికొని చచ్చినాఁడు. ఇట్టివి పేట పేటకు వీధి వీధికి నున్నవి. ఇట్టి వార్తలవలన సంఘటనలవలన మనసు విఱిగినవారు, రాజునం దనిష్టము పెంచికొన్నవారు, గోష్ఠులలో నెక్కువమంది కలరు. స్థానికులకుఁగూడఁ గొంత రాజునందు ద్వేషముకలదు. నాగరకుఁడు మహాధికారి వానికీ గోడు తెలియదు. అతఁడు తన కొలువులోఁ గూర్చుండును. ఈ వార్తలు వచ్చును. ఎట్లు వచ్చును? స్థానికులు చెప్ప వలయును. వారు బెదరుతో చెప్పుదురు. అతఁడు విశ్వసించఁడు. ఈ పరిస్థితి యంతయు నమృతవల్లికిఁ దెలిసెను. ఒక్క నాగరకుఁడే వ్యతిరేకి యైనచోఁ గావచ్చును. వానినిఁ దొలఁగించి నచో మహానగర మంతయు వాసుదేవుని వశమగును. నాగరకుని తొలఁగించుట యెట్లు? వాని దానగరమే. అతఁటిచ్చటి

వాఁడే. అతని వంశము గొప్పది. అతని వంశము నంద రాజులనుండి యీ యుద్యోగము చేయుచున్నది. అమృతవల్లి వార్తలు తీసెను. కోటలోని యధికారగపత్రములను త్రవ్వించెను. నందుఁడు కలియుగము మొదలైనతరువాత పదునేను వందల యేండ్లకు రాజ్యమునకు వచ్చెను. అతఁడు సర్వక్షత్రియ వంశములను నిర్మూలనము చేసెను. తత్పూర్వము నాగరక పదవి క్షత్రియులది. వారు బాహ్మ్రణులు నందుఁడు తద్వంశీయులను తొలఁగించి తనకు బంధువైన యొకనిని నాగరకపదవియందు నుంచెను. ఈ యేడువందల యేండ్ల నుండియు వీరు నాగరకులుగా' నున్నారు. పుష్యమిత్రుని కాలమున తమ నాగరకపదవిని తమ కిప్పించవలయునని పుష్యమిత్రునకు విన్నపములు చేయఁబడెను. వారు క్షత్రియులు, వీరు శూద్రులు. పుష్యమిత్రునకు వారన్నను, వీరన్నను సమానము. అదియుగాక నాగరకపదవి యుత్తము శూద్రుని చేతిలోననే యుండవలయునని పుష్యమిత్రుని యూహగాఁ గనిపించుచున్నది. ఆ పురాణపత్రములలోఁ గొన్ని యక్షరములు కనిపించుటయేలేదు. అవి కొన్ని భూర్జపత్రములమీఁద నున్నవి. కొన్ని తాటియాకులమీఁద నున్నవి. వీని నెవరును తిరిగి వ్రాయించినవారు లేరు. తాటియాకులు చాలచోట్ల చెదలు తిన్నవి. భూర్జపత్రములు మిక్కిలి భాగము పొడి పొడి యైపోయినవి. ఇప్పుడుకూడ నా క్షత్రియవంశమువా రుండవలయును. మూఁడువందల యేండ్లక్రింద నీ పదవి తమకు రావలయునని వేడినవారు, నాల్గువందల యేండ్లు గడచిన తరువాత యడిగినవారు,

మూఁడువందల యేండ్లు మఱల గడచినచో నహుగరా? ఈ నాగరకునిఁ బంపించుట యెట్లు? వీనికి సౌందర్యవతియైన భార్యగాని, కూతురుగాని, కోడలుగాని యున్నారా? ఇతని భార్య గొప్ప యందక త్తెయట, రాజునకు తెలియుట యెట్లు? జయద్రథునితో సరిపోయినదా? ఈ మహానగరమునందు రాజునకు నట్టి వార్తలు పంపించువారు మఱి యెవ్వరు నుండిరా? నాగరకుఁడు మహాధికారి. అతనినిఁగూర్చి చెప్పినచో తమ నెత్తికి వచ్చునేమోయని నాగు భయపడి యూరకుందురు. వారెవ్వరు? వారిని తెలిసికొనుట యెట్లు? అయ్యో! నిశితమతి యున్నచో నెంత బాగుగా నుండెడిది. గొప్ప కులములో పుట్టుట యొక నష్టము. సామాన్యులకు తెలిసెడు విషయములు వారికిఁ దెలియుటకు వీలులేదు. అందుచేత నధికారులకు నిజముగాఁ బ్రజ లేమి యనుకొనుచుందురో ఎప్పుడును తెలియదు. తెలియనిచో ప్రజోపయోగముజరుగదు. అట్లు తెలియకుండ రాజ్యముచేసెడి రాజు రాజేకాఁడు. అందుచేతనే రాజులు చారులను పెట్టికొనవలయును. చారులు వివేకహీనులైనచో వా రుండియు నుండకుండియు నొక్కటియే. గోపులలో కొందఱి కీ రహస్యము తెలిసియుండును. ఆ గోపులలో నొక్కఁడు తనతో మిక్కిలి నమ్మకముగా మాటాడినాఁడు. వానినుండి తెలిసికొని నాగరకుని విదిశానగరమునకుఁ బంపవలయును. రెండుమూ న్నాళ్ళలో బంపవలయును. ఆ క్షత్రియ వంశములో సమర్థుఁడైనవాఁడు దొరకవలయును.

అప్పటికి పదునేను దినములైనది. విదిశానగరము నకు వెళ్ళిన వార్తాహరుఁడు తిరిగిరాలేదు. నిశితమతి రాలేదు. నిశితమతివద్దనుండి వార్తకూడలేదు. అమృతవల్లికి నాందోళన బలిసెను ఈమె యాందోళనము వాసుదేవుని భార్యకుఁ గూడ నంటుకొనెను. భూమిమిత్రునియందు వ్యాపించెను. చివరకు నేమైననేమి? రాముడుగునుఁ బిలిపించి వానిచేత నాపాట వినవలయునని నిశ్చయించిరి. వాసుదేవుఁడు మఱల నింకొక వార్తాహరునిఁ బంపింతమనెను. అమృతవల్లి ప్రయోజన మేమియుండుననెను. వాఁడుకూడ రాకయే పోవచ్చుననెను. రాముడుగుయొక్క పాట విన్నంత మాత్రమున నష్టములేదనెను. రాముడుగు వచ్చెను. అతఁడు వచ్చుచునే వాసుదేవుని పాదములపైఁబడి దొరా! నన్ను రక్షించుము. నాభార్యను తమరు దాచినారట. ఆపాట మీకు వినిపింతును. నాభార్యను నా కిప్పింపుడు. ఆమె యే యూరిలో నున్నది? ఆమె యెన్నాళ్ళకు వచ్చును? ఈసంగతి నాకు తొలుతనే చెప్పినచో నేను వచ్చినప్పుడే వినిపించెడివాఁడను. నేనువచ్చి యేడాదిపైన నాలునెలలైనది. ఉత్త పుణ్యానికి మీ యుప్పుతినుచు కూర్చుంటిని - వాసుదేవుఁడు నివ్వెఱపోయెను. అమృతవల్లి యిట్లనెను. ఓయీ! నీవు పాట వినిపించుము. నీభార్యను ప్రభువు వదలిపెట్టనన్నాఁడా! ఇప్పుడే నీభార్యను వెంటనే పంపవలయునని యాజ్ఞాపత్రము వ్రాసి పంపించఁగలరు. రాముడుగు:-అయినచో వ్రాయించి పెట్టుముతల్లీ! నేను దానిని కనులతోఁజూచి యెక్కువ సుఖముగా నాపాటలు వినిపింతును. కాని యాపాటలు వట్టి

నోటితో పాడుమందువా! దానికి శ్రుతిపోసెడు వాఁడొకఁడు కావలయును. గుమ్మెలు వాయించెడివాఁడు కావలయును. నేను పాడుచుండఁగా జనములుమూగి వినెడివారు. నాగొంతుక యెంతయో వినసొంపుగా నుండెడిది. నేనుపాడి రెండేండ్లయినది. ఆపాటలు నాకిపుడు జ్ఞాపకమున్నవోలేవో. అమృత:-మాకు నీపాటలు వినుటకుకాదు. అందులోనున్న విషయము తెలిసికొనుటకు. అనఁగా రాముఁడు "ఎక్కడనుండి మొదలుపెట్టి పాడుమందురు"అనెను. భూమిమిత్రుఁడు "వాసుదేవుఁడు సేనాపతికదా! ఆ సేనాపతి రాజయ్యెను. ఎందుకు రాజయ్యెను? ఆ కారణమేమి? ఆ భాగము మాకుఁ గావలయును." రామ:-అయ్యా! మీరు నిజముగానెవరు? నాభార్యను నాకిచ్చుటకోసమేనా యీ పన్నాగమంతయు లేదా నన్ను వధించుటకా? బాబూ! ఆ భాగము విన్నచో మీరు రాజపురుషులైనచో నన్ను వధింతురు. అమృత:-ఓయీ! వీరే వాసుదేవులు. వీరే మహాసేనాధిపతులు. ఆయన వీరి కుమారులు. ఓరీ! రాజు కాఁబోవు వాసుదేవుఁడు నిన్నువధించునా? నీపాట యెందుకు విననెంచును? రాజగుటయెట్లో ఆమార్గము నీపాటలో నుపదేశింపఁబడియుండునుకదా! దానిని తెలిసికొని తానట్లు ప్రవర్తించుటకు నిన్ను కోరుచున్నాఁడు. రామ:- నిజమే తల్లీ! నిజమే. వాసుదేవునకు రాజ్యము రాకతప్పదు. పాటపాడుట యెందులకు? ఆపాటలోనున్న విషయములు మనవిచేయుదును. వాసు:-అట్లే కానిమ్ము. రామ:-సరిగా నందులోనున్నట్లే చెప్పుచున్నాను. ఆరాజు దేవభూతి బాల్యమునుండియు

కామతత్పరుఁడై రాజ్యభారమును బ్రాహ్మణ శ్రేష్ఠులైన మంత్రులయందుంచి పాటలీపుత్రమును వదలిపెట్టి విదిశానగరమునందు సుఖమును పొందుచుండెను. విదిశాపురస్త్రీలతో ననాన్యాయముగా విహరించుట కారంభించెను. అతఁడు దుష్టకార్య నిరతుఁడై పెద్దపులివలె నుండెను. స్త్రీలచేత గౌరవింపఁబడుచుండెను. ఆతనిని శుంగవంశముయొక్క కీర్తినాశకుని ప్రజ లనుమోదించలేదు. అతఁడు జూదగాండ్రతో కితవులతో సమావరింపఁబడి నర్తకులచేత సేవింపఁబడుచు నిత్యము సురామాంసఖాదియై మదించినవాఁడై వారస్త్రీలోలుఁడై యుండెను. అతఁ డొకసారి తన్ను పరివేష్టించిన దుర్జనులచేత తనమంత్రియైన వాసుదేవుని కూఁతును పద్మినీలక్షణాన్వితయని మహారూపవతి యని వినెను. అతఁడు కాలచోదితుఁడై యామెభర్తను వ్యాజముచేత విదిశాపురమునకుఁ బిలిపించెను. ఆమెభర్తను రహస్యముగా తన్ను సేవించుచున్న చారులచేతఁ జంపించెను. ఆమెతో నామెకుఁ దెలియకుండ సంగమించెను. ఆమె తన భర్తయే యనుకొనెను. తరువాత నామెకుఁ దెలిసెను. ఆమె ప్రాణములను వదలెను. ఆవార్త వాసుదేవునకుఁ దెలిసెను. అతఁడు శోకసంతప్తమానసుఁడై యొక విషకన్యను ప్రయోగించి రాజునుసంహరించెను. ఆరాజు సర్వాలంకార భూషితయైన యా విషకన్యతో సంగమించి మరణించెను. ఆదుర్జనుఁడైన రాజుయొక్క మరణవార్తవిని సర్వజనులును సంతోషించిరి. ఈ శుంగరాజులు పదిమంది. వారు వసుంధరను మూఁడువందల యేండ్లు

పాలింతురు. తరువాత నీ మగధరాజ్యము కాణ్వాయనులైన వాసుదేవాదులకుఁ బోవును.

రామడుగిది చెప్పుచున్నంతసేపు తండ్రికొడుకులకుఁ బ్రాణములులేవు. వాసుదేవునిభార్య విఱుచుకొని పడిపోయెను. రామడు గచ్చటనున్నచో వానిని వాసుదేవుఁడో భూమిమిత్రుడో ఖడ్గముతో వధింతురేమోయని యమృతవల్లికి భయమువేసెను. వారట్టి యొడలు తెలియని స్థితిలోనుండఁగానే యమృతవల్లి రామడుగును సైగలుచేసి నెమ్మది నెమ్మదిగా వెనుక వెనుకఁగా జాఱిపోవునట్లు చేసెను. ఎవ్వరును మాటాడుటలేదు. అప్పుడొక యెవ్వఁడో దూరప్రయాణముచేసి వచ్చినట్లు లోనికి వచ్చెను. వానిని చూచుటతోడనే తండ్రి కొడుకులకు స్మృతి కలిగెను. భూమిమిత్రుఁడు వానిని నీ వెవ్వఁడవని యడిగెను. వాఁ డిట్లనెను. అయ్యా! మాది యిచ్చటికి చాలదూరము. మాది వందిపల్లె. మాయూరిలో మేమందఱము వందులమే. మాయిండ్లలో పురాణము లన్నియు వ్రాయఁబడి యుండును. తమకోటలోనున్న కంఠాభరణమన్న పేరుగల వంది మాకు దూరపుచుట్టము. మాకు కొన్నాళ్ళక్రింద నొకవార్తఁబంపెను. భవిష్యపురాణము లోని యనువంశ చరిత్రమును వ్రాసి పంపించవలయునని. మహాసేనాధిపతి శ్రీవాసుదేవులకు దానియొక్క యవసరము వచ్చినదని వ్రాసెను. మాయూరిలో భవిష్యపురాణ ప్రతులులేవు. ఈకథ సర్వపురాణములయం దొక్కవిధముగానే యుండును. భాగవతములో, మత్స్యపురాణములో, వాయుపురాణములో, భవిష్యపురాణములోనున్న ఈరాజ

కథలన్నియు నొక్కటియే పద్ధతి. మాయింటిలో భాగవతముయొక్క శుద్ధప్రతికలదు. రెండువేల యేండ్లనుండి మాపూర్వులు భాగవతమును స్వచ్ఛముగా రక్షించుకొంచు వచ్చుచున్నారు. అందులోనికథ వ్రాసి నేను తీసికొనివచ్చితిని. ప్రభువులదయ సంపాదించుటకై యింత శ్రమపడితిని. భూమిమిత్రుఁడు నీవు దానిని చదివితివా? అనఁగా నతఁడు "స్వామీ! నాకు సంస్కృతమురాదు. నాతండ్రి నాకు చదువుచెప్పఁ బ్రయత్నించెను. నాకది యంటలేదు. మా యింటిలో నన్ను వ్యర్థునిగాఁజూతురు. ఇదివ్రాసి తమకుఁ బంపించుట మా పెద్దల కిష్టములేదు. కంఠాభరణము పంపించినవార్తను మావారు నిరాకరించిరి. ఇట్టివార్తలు నిట్టికథలు తెలియఁజేయనీయరా దనిరి. నాకు దానితత్త్వము తెలియలేదు. వారు చదివిన పత్రములు నేనుగుర్తుపెట్టి కొని వానిని దొంగిలించి తీసికొని వచ్చితిని. నేను వ్యర్థుఁడను. తమరు నన్ను పోషింపనలయును. — భూమిమిత్రుఁ డాకాగితములనుఁ దీసికొనెను. ఆ భాగమునుఁ దీసెను. చదివెను. ప్రత్యక్షరము రామకుగు చెప్పినట్లే యుండెను. తండ్రిచేతి కిచ్చెను. తండ్రి చదివెను. అతని మన స్సెంతసేపటికి "గూఢంహత్వా నిజైశ్చారైః సాధ్వ్యాః తస్యాః ప్రియంపతిం, తద్రూపధృత్ నిశి ప్రాప్య తస్యాఃవాస గృహం నృపః. హఠాత్తాం ధర్షయామాస బ్రాహ్మణీం వరవర్ణినీం. సాఽపిజ్ఞాత్వాఽస్య దుర్వృత్తిం ప్రాణాం స్త్యాజ తత్క్షణాత్." ఈ రెండు శ్లోకములమీఁదనే తిరుగుచుండెను. ఇదియేమి ఘోరము? భాగవతములో నిట్లు వ్రాసియున్నదా?

అన్ని పురాణములలో నీ కథ యిట్లేయున్నదా ? దీనిని పాటలుకట్టి కాలజ్ఞానమన్న పేర బిచ్చగాండ్రు పాడుచుందురా? ఇది నిజమేనా? కానిచోఁ దాను పంపించిన వార్తాహరుఁడేల తిరిగిరాఁడు. ఆ నిశితమతి అంత తెలివికలది, యేలరాలేదు ? రా జామెనుకూడ చంపించెనా ? ఈమాట వాసుదేవుని నోటివెంట బయటికి వచ్చెను. అమృతవల్లి నిశితమతినా ? అని యడిగెను. వాసుదేవున కప్పుడు తెలిసెను. 'తన నోటి వెంట నామాట వెలికివచ్చినసంగతి. అతఁడు మాటాడలేదు. తల యూపలేదు. అందఱు నట్లే కూర్చుండిరి. వచ్చినవందిని అమృతవల్లి వెడలిపొమ్మని చెప్పెను. మఱునాఁటి ప్రొద్దునఁ దన యింటికి రమ్మనెను. తన యిల్లు చూపించెను. అతఁడా రాత్రి భోజన మెచ్చట చేయుమందు రనెను. ఆమె కోటలో నున్న సత్రమునందు సర్వజనులకు భోజనము పెట్టుదురు. అమృతవల్లీ దేవి పంపించినదని చెప్పుమనెను. వాఁడు వెడలి పోయెను. అమృతవల్లి మఱల వచ్చి కూర్చుండెను. వాసుదేవుఁడు భార్య నోదార్చెను. "ఓసి పిచ్చిదానా ? వాఁడు చెప్పిన మాటలు నమ్మెదువా ? యనఁగా నామె ఈ వంది తెచ్చిన పత్రములో నేమియున్న దనెను. వాసుదేవుఁ డిట్లనెను. వాఁడు చెప్పినదానికి నీ భాగవతములో నున్న మాటలకు నేమి సంబంధము ? వానిని సంహరించవలయును. వాఁడెచ్చట నున్నాఁడు? అమృత:— అతఁడు తమచేతిని దాటిపోలేదు. నాయింట నుండును. తమ రెప్పుడు వానినిఁ దీసికొని రమ్మన్నచో నప్పుడే తెత్తును. అప్పటికి వాసుదేవునికిఁ దెలిసెను. తనకోప మపాత్రన్యస్తము. అనుచితము.

ఈ సర్వ వ్యవహారమునకుఁ బైనఁ గూర్చుండి యమృతవల్లి దేవతవలె, దైవమువలె, విధివలె, కర్మవలె, పాలించుచున్నది. వాసుదేవుఁడు భార్యను లాలించి బుజ్జగించి యోదార్చి పంపివేసెను. భూమిమిత్రుఁ డిప్పుడేమి చేయువలయుననెను. ప్రొద్దు క్రుంకుచుండెను. తారకలు తొంగిచూడ నారంభించెను. గాలి బిగించెను. ఏవో సన్నని పురుగులు తిరుగుచు వస్త్రాచ్ఛాదితముకాని శరీర భాగములయందు సన్నని సూదులు పెట్టి పొడిచినట్లు కుట్టుచుండెను. వింజామరలు పూని వీచు సేవకులు పరిహరింపఁబడిన యా సమయమున వారి కా బాధ తప్పలేదు. దీపములు వెలిగింపఁబడి ఆపురువు లెక్కువయ్యెను. వారి మువ్వురిలో నెవ్వరును లేవరు. అప్పుడు దౌవారికుఁడువచ్చి "ప్రభూ! ద్వారమునందొక యువతి యున్నది. చీకిరిబాకిరి తల. లోనికి త్రోసికొని పోయిన చెక్కిళ్ళు. గుంటలుపడిన కన్నులు. పరమ వృద్ధురాలుగాఁ గనిపించుచున్నది. కాని నడివయసులో నున్నది. ఆమె యమృతవల్లీదేవిగారి యింటికిఁ బోయినదట, దేవిగారిచ్చట నున్నారని తెలిసి యిచ్చటికి వచ్చినది. వెంటనే యామె దర్శనము కావలయు ననుచున్నది. అమృతవల్లీ దేవిగారి తల్లి యామె నన్నముతిని పొమ్మన్నదట. ఆమె తినకుండనే వచ్చినదట" అనఁగా నమృతవల్లి వెంటనే లోనికిఁ దీసికొని రమ్మనెను. ఆస్త్రీ లోనికి వచ్చెను. అమృతవల్లి యామెవంకఁ జూచుచుండెను. భూమిమిత్రుఁ డామెవంక నసహ్యించుకొనుచు చూచుచు 'నీ వెవ్వరవు?' అని గద్దించెను. ఆ స్త్రీ "ప్రభూ! నేనా! పూర్వము నా పేరింకొకడు.

నాకొక పేరీమె పెట్టినది. ఈమె పెట్టిన పేరు సెప్పుమందువా! నా స్వంత పేరు చెప్పుమందువా?" అనఁగా వాసుదేవుఁడు వ్రాలి కూర్చున్నవాఁడు నిటారుగాఁ గూర్చుండి 'నీపేరు నిశితమతియా?' యనెను. ఆమె యవు ననెను. గుర్తు పట్టని యమృతవల్లికి వెంటనే గుర్తువచ్చెను. భూమిమిత్రుని యాథార్థ్యమంతయు నణఁగిపోయెను. నిశితమతి యిట్లారంభించెను. 'ప్రభూ! కొంప మునిఁగిపోయెను. నే నిచ్చటకు వచ్చుటయే కష్టమయ్యెను. నేను రాక్షసస్త్రీని. నేను తాటకను. నేను పూతనను అందుచేత రాఁగలిగితిని. ఎంత మంది కన్నులలో కారముకొట్టితిని? ఎన్నియబద్ధములు చెప్పితిని? ఎన్ని మాఱువేసములు వేసితిని? చివరకు తప్పించికొని వచ్చితిని. ఆవార్త మీతో నేమని చెప్పుదును? వాసు:- మాకుఁ దెలియును. సైనముగా చెప్పఁగల వనుకొందును, చెప్పుము. వాసుదేవుని కంఠస్వరములో నమృతవల్లికినొక్క విషయము తెలిసెను. 'వాసుదేవుఁడు రాజు కాఁబోవుచున్నాఁడు.'

"ప్రభూ! వెళ్ళుచునే నా కనుమానము కలిగినది. నేను వారితో వెళ్ళకూడదని. ఆయుత్తరములో నా పేరుండుట నా గొంతుమీఁదికి తెచ్చినది. లేనిచో నేనింతకన్న సులభముగాఁ దిరిగివచ్చెడిదానను. మీ వార్తాహరుఁడు రాజు వద్దకుఁబోయెను. వానిని రహస్యముగా బంధించిరి. వాని గుఱ్ఱము నపహరించిరి. వాఁడేమయ్యెనో నాకుఁ దెలియ లేదు. నేను వానినిఁగూర్చి తెలిసికొనుటకు నా నగరమున నాగుటకు సాధ్యముకాలేదు. ఈ మహానగరమునందలి

పరిచారిక లెంతమందియో యచట నున్నారు. రాజు పాటలీ పుత్రమునకు నిచ్చదటివారిని కొందఱిని తరలించికొనిపోయెను. అచ్చటినుండి విదిశానగరమునకు తీసికొనిపోయెను. వారి వలన సర్వవార్తలను గ్రహించితిని. అప్పటినుండి నా కొఱకు రాజచారులు వేటాడ నారంభించిరి. అచ్చటి కథ యిది.. ఆయూరు క్రొత్తగా పెంచవలసిన యవసరమే లేదు. ఆ వ్యాజముతో మీయల్లుఁడు పిలువఁబడెను. అంతఃపుర ప్రదేశమన్న స్థలములో నొక సౌధములో మీ కూతురు నల్లుఁడును నివాసముగా నుంచఁబడిరి. వారి సేవకులు, వారి పనికత్తెలు నాయింటినుండి తొలఁగించఁబడిరి. రాజుగారి యాజ్ఞచేత రాజపరిచర్యచేయు సేవకులే దాసీజనమే వారి యింట నియమింపఁబడిరి. అది మీయల్లునకు గొప్ప గౌర వముకదా! ఒకనాఁటి యర్ధరాత్రమునఁ గొంతసేపు నిదుర పోయి మీయల్లుఁడు తలుపు తెఱచికొని వాకిఁటిలోనికివచ్చెను. అట్లు జరుగును. కడచిన పది పదేనుదినములనుండి కాచి కొనియున్న రాజభటులు వారిని నోటినుండి మాటయైన రాకుండ గొంతునొక్కి వధించిరి. అతని శవ మేమైనదో యింతవఱకుఁ దెలియదు. వేత్రవతీనదియొక్క ఇసుకతిన్నె లలో నెచ్చటనో గోయిత్రవ్వి పూడ్చిపెట్టిరని చెప్పుచున్నారు. అపుడు రాజు మీయల్లునివలె లోనికిఁబోయెనట. లోన నేమిజరిగినదో యెవ్వరికినిఁ దెలియదు. తెల్లవారుకడ రాజు కోపఘూర్ణితాక్షుఁడై, క్రోధమూర్తియై జేవురించిన కన్ను లతో నొడలంతయు గోళ్ళతో గీయఁబడిన గాయములతో వెలికివచ్చెను. రెండుదినములు రాజు పరులకెవ్వరకు దర్శన

మీాయలేదట. ఆమెకు తనభర్తవధింపఁబడెనని రాజిట్లు వచ్చెనని తెలిసెను. తొలుత భర్తను వధించిరన్నవార్త తెలియదు. తెల్లవారకముందే తెలిసెను. ఆమె తనగదిలో లోన గడియ బిగించికొని యురిపోసికొని చచ్చెను. ఆయురినిఁ గూర్చి కథలుగాఁ జెప్పికొనుచున్నారు. అదియొక సన్నని త్రాడు. మైనము మొదలైన ద్రవ్యములుఁ దానికి పూర్వ మెన్నాళ్ళనుండియో రాచుచు నురివెట్టుకొన్నచో సద్యో మరణము సంభవించుటకు నా త్రాడు పదునుచేయఁబడియున్న దట. ఎప్పుడు రాజు తనభర్తను పిలిపించినాఁడో అప్పుడే యామె కీ రహస్యము తెలియుననియు తా నురిపోసికొనుటకే సిద్ధపడి వచ్చెననియుఁ జెప్పికొనుచున్నారు. ఆమె శవ మేమైనదోకూడ తెలియదు. ఆమె కుమార్తెయైన తొమ్మిది నెలలపిల్లమాత్రము వారి పూర్వ పరిచారికులు పెంచుటకు ననుమతి యీయఁబడినది. ఇది మీాకథ. అమృతవల్లీ దేవీ! మీా కాలంజరి యాయూరిలో నున్నది. ఆ బౌద్ధా రామములో నున్నది. సరిగా నీ వనుకొన్న స్థితిలోననే యున్నది. ఆస్త్రీ యందకత్తె. ఈస్త్రీ యందకత్తె. ఆమెను నీవు పొందుము. ఆమె నీమార్గమున పొందవచ్చును. ఈమె నామార్గమున పొందవచ్చును. అని యా కాలంజరి రాత్రులందు సోదెలు చెప్పుచున్నది. ఆసోదెలు వినుట కర్హులైనవారే చాముండియు, మహారాజును. నేనని చాముండికి తెలిసినచో రాజునకుఁ దెలియును. నాపేరు నిశితమతి కదా! చాముండికి నాపేరు కనిగిరియని మాత్రమే తెలియును. నేనును నీలలోచనయుఁ గలిసి యాడుకొన్నాము.

చాముండి నన్నాచోటికిఁ దీసికొని పోయినది. కాలంజరిని చూచితిని. రామదుగుపేరు చెప్పితిని. ఆమె కన్నీరు మున్నీరుగా నేడ్చినది. ఇంతలో వాఁడు వచ్చెను.”

తరువాత మూఁడు నెలలకు మహారాజాంతఃపురములో వాసుదేవుఁడును, నేఁడు మహారాణియైన వాసుదేవుని భార్యయును, మహామంత్రియు, యువరాజునైనభూమిమిత్రుఁడునుఁ గూర్చుండియుండిరి. క్రొత్తగా రాజ్యమును స్వీకరించిన తరువాత వారు ముగ్గురు సావకాశముగాఁ గొంతసేపు కూర్చుండుట కిప్పటికి తీరిక యిచ్చినది. వాసుదేవుఁడు కుమారునితో నిట్లనెను. ‘ఓయీ! అమృతవల్లి వర్తమాన మేమియుఁ దెలియలేదుగదా? వాసుదేవునిభార్య యిట్లనెను. మీ రేకపత్నీవ్రతులుగదా? ఆమెమీఁదఁ గోరిక యెందులకు? వాసు:- ఆమెమీఁద కోరికయుండి యేమి లాభము? ఉన్నచో నీవు రాజపత్ని వయ్యెడిదానవు కావు. రాజమాత వయ్యెడిదానవు. భూమి:- మహారాజా! ప్రొద్దున నాకొక వార్త వచ్చినది. కాలంజరి భర్త రామదుగు తమ దర్శనము చేయుటకు నేఁడు వచ్చునని - అతని నెవ్వరు నవరోధించ రాదని దుర్గమంతయు నాజ్ఞాపించితిని. అతనిని సూటిగా రాజాంతఃపురమునకే తీసికొని రమ్మంటిని. వాసు:- కాలంజరి యేమైనదో. భూమి:- కాలంజరి యింకొక విధముగానైనచో రామదుగు వచ్చుట సంభవించదుకదా. వాసుదేవునిభార్య యిట్లనెను. భార్య యన్నచో భర్తయు, భర్త యన్నచో భార్యయు నిట్టి ప్రేమ కలిగియుండుట నీచకులములలోఁగూడ నున్నది. ఇది మానవహృదయ ధర్మము. ఎంతమంది

రాక్షసులైనను దీనిని తొలఁగించలేరు. భూమి:- ఎందుకు తొలఁగించలేరు? బౌద్ధమతము విజృంభించినచో లోక మందఱు సన్న్యాసులేకదా? అపుడు భార్యాభర్తృ సంబంధ మేముండును? వాసు:- భార్యాభర్తృ సంబంధమేమి, సృష్టియే యుండదు. అందఱును సన్న్యాసులే. పురుషులు సన్న్యాసులు. స్త్రీలు సన్న్యాసినులు. 'ప్రజాతంతుం మా వ్యవత్సేత్సీః' అన్న వేదపురుషుఁడు నోరుమూసికొని కూర్చుండ వలయును. భూమి:- అందుకనియే బౌద్ధసన్న్యాసులు బౌద్ధ మతమునుఁ గుఱించి చెప్పుదురు. కాని సృష్టి కార్యమును నిరోధించుటలేదు. వాసుదేవునిభార్య యిట్లనెను. నేఁడు బౌద్ధులు. ఱేపు ఏ ప్రబుద్ధులు వత్తురో. ఈనాఁడు దేవభూతి వంటి చక్రవర్తి పుట్టెనుకదా? మఱల నెప్పుడే లక్షణముగల రాజు రారాదు? రాజ్యాంగము వెలయరాదు. వాసు:- నీవు మాటాడుచునే యున్నావు. ఏడ్చుచునే యున్నావు. ఆ యేడ్పునకు నీవు మాటాడెడి మాటలకు నేమి సంబంధము? భార్య:- బ్రతుకుటకు మృత్యువునకు నేమి సంబంధము? రెండునుఁ గలిసియే యుండును. భూమి:- అట్లే యుండును. శ్రీమాలి చనిపోయినదన్న దుఃఖము నాకెంత యున్నదో చనిపోయినప్పటికిని దేవభూతిమీఁద గోప మంత యున్నది. నా తండ్రి మహారాజైనాఁడన్న సంతోష మంత యున్నది. ఈ మూఁడును కలిసియే యున్నవి. ఈసృష్టియొక్క లక్షణమే మిశ్రమము. ఇంతలో నొక దౌవారికుఁడువచ్చి మహారాజా రామడుగు వచ్చినాఁ డని చెప్పెను. వాసుదేవుఁడు వాని వెంట నొక స్త్రీకూడవచ్చినదా యనెను. దౌవారికుఁడు రాలేదనెను.

రామడుగు వచ్చెను. వాసుదేవుఁడు నీ భార్య యేదోయీ యని యడిగెను. రామడుగు ప్రభూ! ఆమె తమ దర్శనము చేయుటకు సిగ్గుపడినది. కోటలోనికి వచ్చుటకు భయపడినది. తమరితో మాటాడుటకు బెరుకుగా నున్నది. నేను తమరు దయాస్వరూపులని చెప్పితిని. ఆమెకు భయము పోలేదు. నేను బలవంతము చేసితిని. చివరికామె యమృతవల్లి లేని చోటికి నేను రానన్నది. ఆమాట విన్నంతనే వాసుదేవునకు వాసుదేవుని భార్యకుఁ గన్నీళ్ళు పర్యంత మయ్యెను. గొంతుక యందుఁ బట్టుకొన్న దుఃఖము వాసుదేవుఁడు దిగమ్రింగి యిట్లనెను. "రామడుగూ! అవునోయీ! ఆమె కున్నంత కృతజ్ఞత నాకు లేదు. నాకూతును మహారాజు వధించినాఁడు. నా యల్లుని రూపు మాపినాఁడు. ఆ పగ నాకామె తీర్చి పెట్టినది. నన్ను రాజును చేసినది. నా కిష్టములేని రాజ్యమును నాకు కట్టిపెట్టినది. రాజ్యమంతయు నిశ్శత్రుకము చేసినది. ఆమె రాజనీతి వెలయించనిచో నే నీనాఁడు మహా రాజను కాను. మగధదేశ దక్షిణకోణమునుండి నామీఁదికి దండయాత్ర వచ్చెడిది. సుమ్న ప్రసుమ్న దేశములనుండి నామీఁకి దండయాత్ర వచ్చెడిది. గిరివ్రజపురమే నామీఁది కెదురు తిరిగెడిది. ఆమె నా రాజ్యస్థితిని ఇంత భద్రముగా చేసి నన్ను వదలిపోయినది. అనఁగా వాసుదేవుని భార్య యిట్లనెను. "ఓయి రామడుగూ! ఈ పోయిన శ్రీమాలి మొన్నను పోయినది. ఆమెబదు లమృతవల్లి యుండు నను కొంటిని. ఈమెను చూచియే సంతోషించుచుంటిని. ఈమె

కైనను పుట్టినదినమన్నది చేయుటకు నాఁడు నేను నోచు కొంటిని. వాసు:- ఆమె పుట్టినదినము చేయించుకొన్నది. మనకు రాజ్యము పెట్టనికోటగాఁ జేసినది. భూమి:- ఓయి రామడుగూ! అమృతవల్లి యేమైన చెప్పినదా! మేము రాజ్యము నిట్లు పాలించుకొనవలయును. ఇట్లు పాలించుకొన వలయును. అని యేమైన నుపదేశమిచ్చినదా! అనఁగా రామడుగు తాను దుఃఖించుచు మహారాజును, మహారాణిని, మహామంత్రిని నూరడించుచు మీరు దుఃఖించరాదు. అనుచు తన కొంగున గట్టియున్న కొన్ని పత్రముల మూట యూడఁదీసి వారిచేతి కిచ్చెను. మహారాజు రామడుగును చదువుమనెను. రామడుగు తనకు చదువుట చేతకాదనెను. భూమిమిత్రుని చదువుమనెను. భూమిమిత్రుఁడు చదువ నారంభించెను. "మహారాజాధిరాజ కాణ్వాయనవంశపయోధి నూత్నచంద్ర, దుష్ట దేవభూతి ప్రాణహంత, మగధరాజ్య సింహాసనస్థ శ్రీవాసుదేవ మహారాజునకు బ్రాహ్మణ ప్రభువు నకు, మీ దాసి అమృతవల్లి వ్రాయుచున్న వినయ వచన ములు. మహారాజా! ఈ పత్రములన్నియు నొకనాఁడు వ్రాసి నవి కావు. ఒకొక్క పత్ర మొకొక్క దినము వ్రాసితిని. ఏనాఁటి కథనా నాఁడుగా వ్రాసితిని. నేను చనిపోవుపఱకు వ్రాసితిని. ఈనాఁడు రాత్రి నేను చనిపోవుదు ననుకొను చుంటిని. ఱేపు మఱల వ్రాయలేనుగదా! ఈ పత్రము రామడుగు చేతికిచ్చితిని. అతఁడు తమ పాదపద్మములయందు సమర్పించును. శ్రీమాలి కూతును రామడుగువెంట పంపు

చున్నాను. గిరివ్రజములో విదురుడున్నాఁడు మీకు తెలి యును. ఈ పిల్ల నతని పెంపకములో నుంచవలయును.

మీ దాసి "అమృతవల్లి"

మాఘ శుద్ధాష్టమి.

"నేను విదిశానగరమునకు వచ్చితిని. రామడుగును వెంట తీసికొని వచ్చితిని. వినయంధర యిచ్చిన గుర్తుతోఁ గోటలోనికి ప్రవేశము కలిగినది. రామడుగును సైనికులు రానీయలేదు. రామడుగు పేదవాఁడు. సేవకుఁడు వాఁడు లేకుండనే ప్రయాణముచేయను. మీరతనిని రానీయనిచో నేను రాజుగారితో చెప్పెదను. నే నెవర ననుకొన్నారు? నాయంతటి ప్రియురాలు రాజునకు లేనేలేదు. నేనుగీసిన గీఁత రాజు దాటఁడు. ఇది నా ప్రతిజ్ఞ; అనఁగా వారు బెదరి పోయిరి; నేను రాజుగారనకుండ రాజే యనుచుంటిని; వారు మమ్ము పోనిచ్చిరి: మేము సూటిగా రాజాంతఃపురమునకే పోయితిమి;కనుగొని తొలుత చాముండివద్దకేగితిని; చాముండి దుఃఖనిమగ్నురాలై యున్నది; ఆమెవలన వార్తలుకొన్ని తెలిసెను; రాజు నీలలోచనను కోరెను; చాముండి వరుస కాదని చెప్పెను: అతఁడు వినలేదు; చాముండి 'నీవు నీలలోచనను గోరినచో నేను నీయంతఃపుర రక్షకురాలిగా నుండననెను. కాలకంఠుఁడు తన సేనతో విదిశానగరము నందు నంతర్యుద్ధము కలిగించుటకు ప్రయత్నించెను. దాని వలన రాజునకు భయమువేసెను. కాలకంఠుని సంహరిం పించుటకతఁడు ప్రయత్నించెనట. సాధ్యముకాలేదు. రాజు

నకును చాముండికిని పడుటలేదు. నేను సంతోషించితిని. ఇది మంచి వ్యవహారము సాగినది. నిశితమతి తెలివిగల ప్రాణి. కాలకంఠు నిచ్చటికి పంపుమని చెప్పిన దామె. వాసుదేవుఁడు నిశితమతిని తన యంతిపురములో నుంచికొని దానితో నాలోచన చేయవలయును. ఆ బౌద్ధారామము లోనికి నేఁడు పోవుట సులభమగును. అచట చాముండి యుండదుగదా.''

మాఘశుద్ధ నవమి:—

''ఆరాత్రిపూట రాముడుగుతో మాటాడితిని. ఓయీ! నిజముచెప్పుచున్నాను. నీభార్య ఇచ్చట నున్నది. ఆమె నొక పిశాచ మావహించినది. ఆ పిశాచము సామాన్య పిశాచముకాదు. చాలశక్తిగల పిశాచము. ఆ పిశాచము నద్దనున్న లక్షణములు పిశాచలక్షణములుకావు. రాక్షసలక్షణములుకావు. నాకే చిత్రముగానున్నది. ఆ పిశాచము యొక్క బుద్ధి యెట్టిదనఁగా నొకయధర్మమును లోకమునందు వ్యాపింపచేయవలయునన్న భావమే దానికి ప్రధానముగాఁ గనిపించుచున్నది. నీభార్య నా పిశాచము పట్టుకొన్నది. నీవేమి చేయఁగలుగుదువు? నిశితమతి చెప్పెనుగదా! కాలం జరిని వాఁ డావహించనపుడు నీపేరు చెప్పఁగా వలవల నేడ్చిన దట. ఇంతలో నాపిశాచమువచ్చి యావహించి బెదరించె నట. ఇట్టి స్థితిలో నీవేమి చేయఁగలవు? రాముడు గిట్లన్నాఁడు. ఓయమ్మ యమృతవల్లీ! నే నింకను నాభార్య నెవఁడో మహారాజపురుషుఁడు తన వశమునం దుంచుకొన్నాఁడు.

ఆమె యతని మాట వినుటలేదు. ఆమె బాధపడుచున్న దనుకొన్నాను. ఇది పిశాచ వ్యవహార మైనచో నా కింత కంటె కావలసిన దేమున్నది? నేను చిన్నప్పటినుండి యాంజనేయోపాసకుఁడను. నాకొక జోగి యొక మంత్రము నుపదేశించెను. ఆ మంత్రమును నేను దినమున కెన్ని వేల సార్లంటినో తెలియదు, నీవు నన్ను పదునెనిమిది మాసములు గిరివ్రజదుర్గమునం దుంచితివి. నా కేమిపనియున్నది? ఆ గాలి పారిపోనప్పుడు కాలంజరినిఁగూర్చి యూహించెడి వాఁడను. అంత యూహలో నీవు నాకామెను సమకూర్తు వన్న ధైర్య మున్నది. అందుచేత నెక్కువ దుఃఖపడలేదు. సర్వవేళలయందు నా యాంజనేయ మంత్రమే ధ్యానించితిని. కొన్ని కోట్ల జపము చేసియుందును. అనఁగా నేని ట్లంటిని. నీ కేమైన నాంజనేయుఁడు ప్రత్యక్షమయ్యెనా? రాముడుగు:- కాలేదు. ఎట్లగును? కాని నాకు ప్రతిదినము స్వప్నములు వచ్చుచుండెను. వానిలో కాలంజరియొక్క సర్వస్వరూపము నాకుఁ దెలియుచుండెను. నా స్వప్న వృత్తాంతములు నీతోఁ జెప్పినచో నీ వాశ్చర్యపోదువు. నేను నీతోఁ జెప్పలేదు. అవి యన్నియు వట్టి కలలనుకొంటిని. యాదాలాపము లను కొంటిని. నీవిపుడు నాభార్య నావహించినవాఁడు పిశాచమని చెప్పఁగా నాకా స్వప్నములోని వృత్తాంతము లన్నియు నిజములని తెలియుచున్నది. అయినచో నా పిశాచమునుఁ గూర్చి నీకు నేను గొన్నిఁ జెప్పెదను. వాఁడు సామాన్య పిశాచము కాదు. వాఁ డిప్పటివాఁడు కాదు. వాఁడు రెండు వేల మూఁడువందల యేండ్ల క్రిందటివాఁడు. నే నడిగితిని.

రామడుగు మఱల చెప్పెను. వాని పేరు నీకెట్లు తెలియునమ్మా? వాని పేరు జయద్రధుఁడని నీకు తెలియునే వాని పేరదే. వాఁడా భారతములోని సైంధవుఁ డున్నాఁడే ద్రౌపదినిఁ గోరిన ప్రబుద్ధుఁడు. అర్జునునిచేత శిరశ్ఛేదము చేయించుకొన్న వాఁడు. దుస్సల మగఁడు. అభిమన్యుని చావునకు హేతువైన వాఁడు. వాని మేనల్లుఁడు వీఁడు. వాఁడు నాఁటినుండి యెన్ని జన్మలెత్తెనో తెలియదు. వాఁడు మగధరాజ్యమును పట్టికొని వదలిపెట్టుటలేదు. బార్హద్రధులలో చివరివాఁడైన రిపుంజయుని భార్యను పట్టుకొనెను. ప్రద్యోతవంశము వచ్చెను. శిశునాగు నావహించెను. ఆ వంశము వచ్చెను. నందరాజ్యమునకు మౌర్యరాజ్యమునకు వాని ప్రసక్తి యక్కఱలేకపోయెను. పుష్యమిత్రుఁడు రాజ్యమునకు రాఁబోఁగా వాఁడుత్తర జ్యోతిష సింహపురాది యవనరాజ్యముల యందు విచిత్ర తాండవము చేసెను. ఇప్పుడు నా కోసము వచ్చెను. వాఁడింక నేమిచేయునో నాకు తెలియును.- ఏమిచేయునని నే నడిగితిని. రామడుగు మఱల చెప్పెను. అమ్మా! వాఁడు చెప్పినవి నాకు క్రొత్తవి కావు. నా కాల జ్ఞానపు పాటలలో నున్నవే చెప్పెను. కాని ఇన్నివేల సంవత్సరములు వాఁడొకఁడు మన పురాణములయందు చెప్పఁబడిన చరిత్రాంశముల కనుబంధము నడచుచునే యుండునట. వాఁడొక్కఁడేకాఁడు. వానితోఁబాటు మఱియు నైదాఱుగు రుండిరి. వారందఱు ప్రతిసారి జన్మ మెత్తుదురట. వానికి మిక్కిలిదగ్గఱివాఁడొకఁడు కలఁడు. వాని పేరు వెలియోనసు. మఱియొకఁ డున్నాఁడు. మచ్చిమల్లుఁడు. వాఁడు చాల

మంచివాఁడు. కాని విభీషణుఁడు లేఁడా? ఉన్నాఁడు. అనఁగా రామడుగును నేనడిగితిని. తక్కినవారి పేర్లుకూడఁ దెలియునా యని. రామడు గిట్లు చెప్పెను. వారల్వాల్వ్వలు ప్రధానము నెలియోనసు. వాఁడు చేయునట యెంత చేసినను. అది యెప్పటిమాటో. ఇంక మూఁడువేలపైన యేండ్లు గడువ వలయును. నాకు పెక్కు కలలలో వాఁడు ఈ నెలియోనసు మొదలైనవారందఱు కనిపించి నా భార్యను నాకుఁగాకుండఁ జేసెదమని బెదరించుచుండిరి. నేను భయపడనేలేదు. నే నెందుకు భయపడలేదని పెక్కుసార్లు విచారించితిని. ఈ కల యెప్పుడును నేనొక తోఁటలో కూర్చున్నట్లు, ఒక చెట్టుక్రింద కాలంజరి యున్నట్లు వీరంద ఱామె చుట్టునున్నట్లు వచ్చెడిది. ఆ చెట్టుమీఁద నొక కోఁతి కూర్చుండెడిది. నాకు భయము వేసినప్పుడెల్ల నా కోఁతివంకఁ జూచెడివాఁడను. నా భయము పోయెడిది. ఆయనయే యాంజనేయుఁ డనుకొందును.—నేని ట్లడిగితిని. ఆకోఁతి నీకేమియు వాగ్దానము చేయలేదు కదా! వానినుండి నీభార్యను హనుమ వదలింపించునని యేమి ధైర్యము. రామడు గిట్లనెను. నా కా ధైర్యమున్నది. స్వప్నములోనే రెండుమూఁడుసార్లు వారి కా కోఁతిని చూపి బెదరించితిని. ఆ కోఁతిని చూపించినపుడెల్ల వారు నాకుఁ గనిపించుట మానివేసిరి. నా ధైర్యమది.

మాఘశుద్ధ దశమి:—

ఈనాఁడు నేనును రామడుగును బౌద్ధారామమునకుఁ బోయితిమి. అచట రాజభటు లున్నారు; మమ్ము లోనికిఁ

బోనీయలేదు; ఎట్లు పోవలయును? బయటనుండి పిలచినచో నా లోపలనున్న యింటిలోనికి కేక వినిపించును; అందుచేత నేను రామడుగుతో నీవు నీ భార్యను బిగ్గరగా పిలువుము; ఆమెకు వినిపించును; ఏమి జరుగునో చూతమంటిని; అతఁడు తన భార్యను బిగ్గరగా కేకవేసెను; లంజా! లంజా! యని పిలిచెను; నేనది యేమి పిలుపంటిని; అతఁడు దానిపే రదే కదా! కొంతభాగము పేరుక్రింద పనికివచ్చునుకదా! సత్య భామను సత్యా అనవచ్చును; భామ అనవచ్చును; త్యభా అని యేల యనరాదు? కాలంజరిలో మొదటి యక్షరము చివరి యక్షరము వదలిపెట్టి ముద్దుగా పిలుచుట నా కలవా టనెను; అనఁగా నేను లంజీ యనవలయును; లంజా యనరా దంటిని; అతఁడు మఱలఁ బిలిచెను; అరగడియలో నా గృహములోనుండి 'ఓ' యన్న మాఱుమాత వినిపించి, విని పించుట తడవుగా రామడుగు లోనికిఁబరువెత్తుటయు సేవకులు వానిని గాఢముగా నాపుటకుఁ బ్రయత్నించుచుండుటయు లోపలినుండికాలంజరివచ్చి అతనినిరానిండు అని గర్జించుటయు సైనికులుభయపడి యామెవంక నొక దయ్యమునుఁ జూచినట్లు చూచుటయు వణఁకుచు నొత్తిగిలుటయు నేనును రామడు గుతో నాయింటిలోనికిఁ బోవుటయు జరిగినది. ఒక సేవ కుఁడు వెంటనేపోయి రాజుగారితో నీసంగతి చెప్పెను. మహా రాజు వెంటనే యచ్చటికి వచ్చెను. అతఁడు నన్నుచూచెను. నీ వెవ్వర వనెను. నే నిట్లంటిని. ఈమెపేరు కాలంజరి. ఈమె సోదెచెప్పును. ఇతఁ డీమెభర్త. ఈ కాలంజరి మహాభూత మొకఁ డావహించెను. ఆభూతమును నేనే యావ

హింపఁజేసితిని. నాపే రమృతవల్లి. నేను హరిసేనుని కుమార్తెను. హరిసేనుఁ డనఁగా గండదుర్గాధిపతి. పది యూళ్ళకు ప్రభువు. తమరికి జ్ఞాపకముండక పోవచ్చును. ఈమె నావహించిన పిశాచమును నే నెఱుఁగుదును. ఆపిశాచము బ్రతికి యున్నప్పుడు నాకు గురువు. అతఁడు నాకు చదువు చెప్పెను. రాజు:-నీకథ చిత్రముగా నున్నది. నీ వతనిని బ్రతికియున్నప్పు డెఱుఁగుదువు. పిశాచముగా నెట్లెఱుఁగుదువు? నీవెట్లు పంపించితివి? నే నిట్లంటిని. అతఁడు బ్రతికియున్నప్పుడుకూడ పిశాచమే. వానిని పోయి కాలంజరి నావహించు మంటిని. అతఁడువచ్చి యావహించెను. ఆమెభర్తతో నామె నెడఁబఱచు మంటిని. ఆ పిచాచ మెడఁబఱచెను. విదిశానగరమునకుఁబోయి ఎవ్వరెవ్వ రంద క్షత్రియులో ఎవ్వరెవ్వరి నెట్లు పొందవచ్చునో మహారాజున కుపదేశించు మంటిని. వచ్చి వాఁడు నేనుచెప్పినట్లు చేయుచున్నాఁడు. రాజిట్లనెను. "నీమాటలు నేను నమ్మను." నే నప్పుడు జయద్రథా యని పిలిచితిని. వాఁడు కాలంజరి నావహించెను. తాతా! నేను జ్ఞాపకమున్నానా? యంటిని. అతఁ డుంటివనెను. నేను చెప్పినమాటలు నిజమా? యబద్ధమా? యని యడిగితిని. నాకు మనసులో భయముగా నుండెను. వాఁడు కాదనునేమో? యని. కాని వాఁ డవు ననెను. అవుననుటయేకాక "ఓయి రాజా! ఈ యమృత వల్లి యెవరనుకొనుచున్నావు? గండ దుర్గాధిపతి కూతురు. ఆమెసంగతి యామెకుఁ దెలియదు. ఆమె మాలో నొకర్తుక. కాని తాటిపట్టి కెగురు జేసను. ఆమెయే న న్నిచ్చ

టికి పోమ్మన్నది. నేను వచ్చితిని" అనెను. దేవభూతియేమి చేయును. ఇట్లనెను "నీవే రేమంటివి ? అమృతవల్లియా ? నీవితని నిచ్చటి కెందుకుపంపించితివి? అని యడుగఁగా జయ ద్రథుఁ డిట్లనెను. దానికి నేను సమాధానము చెప్పెదను' ఈమె యొక కామినీగ్రహము. ఆమెను నేను పూర్వజన్మలో నావశము చేసికొంటిని. అది వేఱేకథ. ఈమెకంటె కాముకు రాలు సృష్టిలోనుండదు. కామము బహువికారములుకలది. దానిరూప మిట్లుండునని చెప్పుటకు వీలులేదు. కామము యొక్క యనంతకోటి వికారములలో నొక వికార మీామె యందున్నది. అది యెట్టిదనఁగా నీమె తానేపురుషుని వాం ఛించుచున్నదో, ఏపురుషునియందు కామము కలదో, ఆపురు షుఁడు బహుస్త్రీసంగమము చేయవలయును; తన భర్తకు తానే పరస్త్రీలను సంధానపఱచును; అది యీామె లక్ష ణము; రాజు:- ఇది విచిత్రముగానున్నది; జయ:- ఓయి రాజా! నీకుఁగూడ విచిత్రముగా నుండెడి యొక కామలక్ష ణము నేను చెప్పఁగలిగితినా? రాజు:- ఓయి పిశాచమా ! నీవు నన్నెప్పుడు వెక్కిరింతువు; నేను మహారాజునన్న భయము నీకులేదు; సరేకాని ఇతరస్త్రీలను భర్తనుఁ బొందిం చుటచేత నీమెకేమితృప్తి? జయ:-ఆమెనే యడుగుము; అనఁగా నేను జయద్రథుఁ డేమి యెత్తెత్తుచున్నాఁడో నాకు తెలియక వానినే చెప్పుమంటిని; వాఁ డిట్లనెను; ఓయిరాజా! నీ వింతవఱకు పొందిన స్త్రీలసంఖ్య యెంతయో నీకు తెలి యునా? రాజు నవ్వి తనకు తెలియదనెను; జయ:- ఓయి పిచ్చిరాజా! లెక్కపెట్టుకొనవలయును; పేర్లు వ్రాసికొన వల

యును; వారందఱిబొమ్మలు వ్రాయించి దగ్గఱ నుంచుకొన వలయును; వారివంక మాటిమాటికి చూచుచుండవలయును; స్నేహితులకు వారి చిత్రములు చూపించి నీ శృంగార రసమునుఁగూర్చి నీవు గ్రుక్కిళ్ళు మ్రింగుచుండవలయును; రాజు:-ఓయి పిశాచమా! నీ వెక్కిరింపులు చాలును; ఆమెకుఁ గలిగెడితృప్తి యెట్టిదో చెప్పుము; జయ:- ఆతృప్తియెట్టిదా? నీ వింతవఱకు పదివేలమంది స్త్రీల నెఱుఁగుదువనుకొందము; ఇప్పుడామె వచ్చినది; ఎందుకు వచ్చినది? ఆమె సౌందర్యము చూచుచున్నావుకదా! శ్రీమాలిని చూచితివికదా! శ్రీమాలికి నామెకేమైన భేదమున్నదా? ఇద్దఱు నొక్కటియే మూర్తి; కవలపిల్లలవలె నుందురు; ఇద్దఱు నాదగ్గఱ చదువుకొనిరి; శ్రీమాలిని పొందనెంచితివి; నీతోఁజెప్పితిని; శ్రీమాలి పతివ్రత; నీకామె సాధ్యపడ దని; నీవు వినలేదు; ఆమె చనిపోయెను; అందుచేత నీ యమృతవల్లి వచ్చినది; ని న్నీయమృతవల్లి యెంతప్రేమించుచున్నది? ఆ శ్రీమాలిని పొందలేక పోయితివి; ఈ యమృతవల్లిని పొందుము; శ్రీమాలిని పొందినసుఖమే పొందుదువు; నీ కొఱకీమెను నేనే రప్పించితిని. ఈమెను నీకొఱకు సిద్ధము చేసితిని. అమృతవల్లీ! నేను చెప్పినట్లు చేసితివా, దేవభూతిని పొందుటకు సిద్ధపడి వచ్చితివా! ఈ పదివేలమంది స్త్రీలిచ్చిన సుఖముకంటె దేవభూతికి నీ వెక్కువ సుఖమీయవలయును. నీ కోరిక యదియేకదా! నేఁడు నీ కోరిక తీర్చుకొనుము. రాజా! ఈమె నా మనుమరాలు. నన్ను 'తాతా' యని పిలుచుచున్నది. వినుచున్నావుకదా? ఆమెను నీ కిచ్చు

చున్నాను. నీవు పాలించుకొనుము. ఆమెయే నిన్ను పాలించును. ఆమె నిన్ను పాలించునట్లు చేసికొనుము. నీ జన్మకిట్టి స్త్రీసుఖము మఱియొకదానిని పొందలేవు. ఈ జన్మకుకాదు. వేయి జన్మలకు పొందలేవు. కామినీగ్రహముతోడి సుఖము మానవులకు లభించునా? అందులో నొక గ్రహము మనుష్య జన్మ మెత్తి స్త్రీమూర్తిని తాల్చెనేని యా సుఖము నిరవధిక బ్రహ్మానంద సదృశము. ఓయి రాజా! నీతో నొక్కమాట చెప్పవలయును. నీవు తొందఱపడకుము. అమృతవల్లి యాత్మలో గ్రహకల్ప కానిమనస్సులో నమృతకల్ప. శరీరముచేత పారిజాత సుమకల్ప. ఆమె జీవలక్షణముచేత నీయందు దాసకల్ప. ఆమె మనసున కనుకూలముగాఁ బ్రవర్తించుము. నీకు దేహాతీతమైన సౌఖ్యము కలుగును. ఆమెయే నేఁడో ఱేపో ఆమె కిష్టము వచ్చినపుడు నీవద్దకు వచ్చును. నీవు దూత్యము పంపనక్కఱలేదు. ఆమె యథేచ్ఛము సంచరించుట కాజ్ఞయిమ్ము. ఆమె యనుగ్రహ మెప్పుడు వచ్చునో. అప్పటిదాఁక విరహ మనుభవించుచుండుము.

రాజు తన చేతి ముద్రికనుఁ దీసి నా చేతి కిచ్చెను. అతని కన్నులు చూడఁగా నప్పుడే నన్ను బలాత్కారము చేయునన్నట్లు తోఁచినది. నే ని ట్లంటిని. "రాజా! పిశాచము చెప్పినట్లు చేయుము. నీకు సుఖము కలుగును. నన్ను కూడ తొందఱపడి ధార్ష్ట్యముచేసి చంపికొనకుము." రాజు వెడలిపోయెను. నేనును రాముడుగును వెడలిపోవుద మను

కొంటిమి. రాముడు గచటినుండి రానన్నాఁడు. నే నతనిని బతిమాలితిని. నీతోఁ గొంత మాటాడవలయునని చెప్పితిని. తీసికొని వెళ్ళిపోతిని.

మాఘశుద్ధైకాదశి.

ఆనాఁడు నేను రాముఁడుగును స్నానముచేసి వానితో నిట్లంటిని. ఓయీ నీవుండఁగనే జయద్రథుఁడు నిన్న రాజుతో నట్లనెను నీవున్నచో వానికి భయములేదు. భయమున్నచో నిన్ను చూచినంతనే వాఁడు పాఱిపోవలయునుకదా! వాఁడు నీభార్య నావహించెనుకదా! కలలో కోఁతిని చూపించితివి. జాగ్రదవస్థలో నేమి చూపించెదవు? నేను బ్రాహ్మణస్త్రీని. నా కీ ప్రయోగములు దెలియును. నీ వేమి చేయవలయునో చెప్పెదను; నీవొక విశ్వకర్మ గృహమునకుఁ బోయి రాగి బిళ్ళ చేయించుము; దానిమీఁద నాంజనేయ విగ్రహము చెక్కించుము; దానిని ముందు పెట్టికొని జపము చేయుము; పదివేలో, ఇరువదివేలో లక్షయో చేయుము; అంతయు హనుమదర్పణముగా నొక పళ్లెములో నీళ్లు వదలుము; ఎన్ని వేలు చేసెదవో అన్ని కొబ్బరికాయలు కొట్టుము. అవి యన్నియు నైవేద్యము చేయుము. ఈ తీర్థములోననే యా యంత్రము నుంచవలయును. నీ వనుకొన్నంత జపము పూర్తి చేసినతరువాత నా తీర్థమును తీసికొనిపోయి కాలంజరికిమ్ము. ఆ యంత్రము నామె మెడలో కట్టుము. జయద్రథుఁడువచ్చి మఱల నీ భార్య నావహించకుండ నుండుటకు మార్గమిది. ఇది తంత్రము. ఇది యంత్రము. నీ మంత్రముయొక్క

ఫలము వీనిద్వారా భాసించును. ఇంకొక మార్గము లోకము నందు లేదు.—రాముడు గంగీకరించెను. అతఁడా ప్రయత్నము మీఁద నుండెను. నేను శ్రీమాలి చనిపోయిన యింటికిఁ బోయి చూచివచ్చితిని. ఆ యంతఃపురములో నే నెచ్చటికిఁ బోవుచున్నను, స్త్రీలు పురుషులు దాసీజనము, వర్షధరులు, తృతీయాప్రకృతులు నెగఁబడి నావంక నెగాదిగఁ జూడ నారంభించిరి. నేను జయద్రథునితో నేకాంతముగా మాటాడవలయును. రాముడుగును రెండుమూఁడు దినములు జపము మీఁదఁ గూర్చుండ బెట్టవలయును. జయద్రథునితో రాత్రులందుఁ గాని మాటాడరాదు. ఆనాఁ డేకాదశి. నే నానాఁ డుపవాస ముంటిని. రాత్రి జాగరము చేసితిని. మఱునాఁటి ప్రొద్దునఁ బురోహితుని యింటికి పోయి ఉపనీతుఁడైన యతని కుమారుని బ్రాహ్మణునిఁ బెట్టికొంటిని. పవలెల్ల నిదుర పోయితిని. నే నా యంతఃపురములోఁ జేయరానిది యున్నట్లు నాకు భాసించలేదు. రాజాజ్ఞ అంత సర్వతోముఖముగా నున్నది. నాకంతటి సర్వతోభద్రముగ నున్నది.

శుద్ధ ద్వాదశినాఁటిరాత్రి.

నేను వెళ్ళుచునే యూహించుచుంటిని. నేఁడుద్వాదశి. విష్ణుప్రీతికరమైన దినము. జయద్రథుఁడు నాకే లొంగి మాటాడవలయును. వెళ్ళితిని. కాలంజరి కెదురుగాఁ గూర్చుంటిని. కాలంజరి తన భర్తనుగూర్చి యడిగెను. అమృతవల్లీ! నన్ను చెఱలోనుండి వదలించుమని యడిగెను. అందుకనియే వచ్చితినని చెప్పితిని. ఎంతసేపటికిని జయ

ద్రథుఁడు రాలేదు. నేను పిలిచితిని. ఓయి జయద్రథా! నీతోఁ జాల మాటాడవలయును. నాతో మాటాడవలయు నన్నచో నీ కిప్పుడేపేలు. రేపో ఎల్లుండియో, కాలంజరి భర్తవచ్చును. ఆంజనేయునిబిళ్ళ కాలంజరి మెడలోకట్టును. అతఁడెంతో తపస్సుచేసెను. ఆ తపఃఫలముగా నాబిళ్ళ కాలంజరి మెడలో నుండును. ఈమె మంత్రతీర్థమును పుచ్చుకొనును. ఈమెయొక్క శరీరాంతరణువులయందు తచ్ఛక్తి వ్యాపించును. నీకు ప్రవేశార్హత యుండదు. నాతో మాటాడవలయునన్నచో నిప్పుడేరమ్ము. కాలంజరి యిట్లనెను. "నాకు నీ రామడుగన్నచో భయములేదు. వాఁడు క్షుద్రుఁడు, నీచ శూద్రుఁడు - వాని మంత్రశక్తికి కూడ నేను భయపడుదునా? నేను:-అంత భయపడనివాడఁవు వానికలలో చెట్టుమీఁదనున్న కోఁతినిఁ జూపించినంత మాత్ర మున నెందుకు తోకముడిచితివి. భయములేదు. ఒప్పుకొను చున్నాను. నేను రాజువద్దకు పోకముందు నీవు నాతో మాటాడవలయునుగదా! జయ:-ఏమి మాటాడుదువు? నేను:- రేపటినుండి నీకు కాలంజరి వశముకాదు. తరువాత నెవరి నావహించెదవు? ఈసంగతి నాకుఁ గావలయును. జయ:- నేను దేవభూతి నావహించెదను. ఈరాజ్యము చేసెదను. నేను:-ఓయీ! నాకుఁ దెలియును. నేను కాలకంఠునితోఁ జెప్పితిని. నీకుఁదెలియదు. జయ:-ఓసి దుర్మార్గురాలా! నీవు నా శిష్యురాలవైన దిందులకా! నేను:- నీవు నాకు విషభోజనము నేర్పినదిందులకా? జయ:-నావృత్తి యిది.

నేను:-దాని పరిణామమిది. జయ:-నన్నెచ్చటికి పొమ్మం దువు? నేను:-నీవెచ్చటికైనఁ బొమ్ము. నీకు కాలజ్ఞానము కలదుకదా! జయ:-ఉన్నది. లేదు. నాకొక యుపకారమునుఁ జేసిపెట్టుము. నేను:- అదియేదో చెప్పుము. జయ:- నేను కాలంజరినివదలి పోవుదును. నానడుమ రామడుగునడుమను ఇది నియమము. అతఁడు కాలజ్ఞానపుపాటలు చివరిదాఁక నేఁటి నుండి పాడి వినిపించవలయును. వాని పాటలలోని కథలనుఁ బట్టి నామార్గమును నేను నిర్మించుకొందును; నేను కాలం జరిని వదలిపోవుదును; నేను:-అట్లే; రేపురాత్రికి రమ్ము;

మాఘశుద్ధ త్రయోదశినాఁటి రాత్రి:-

రామడుగు నేనును కాలంజరివద్దకుఁ బోయితిమి; రామడు గాపాటలన్నియు పాడెను; కాణ్వాయనులు మగధములను ఎనుబది యైదేండ్లు పాలింతురు; తరువాత నాంధ్ర భృత్యులు రాజ్యమునకువత్తురు; శ్రీముఖుఁ డన్నవాఁడు రాజునుచంపి రాజ్యమునకు వచ్చును; శాతవాహనులు బౌద్ధులు; జయభద్రభున కానందమయ్యెను; వారైదు వందలయేండ్లు ధాత్రిని పాలింతురు; తరువాత గుప్తవంశ మని యొకటివచ్చును; చంద్రగుప్తుఁడన్నవాఁ డాంధ్ర భృత్యులలో చివరిరాజునుచంపి, రాజగును. పెద్దచక్రవర్తి యగును. భారతదేశమునంతయు జయించును. వాని కాలములో దూరయవనదేశరాజు అలకుంధరుఁడన్నవాఁడు భారతదేశముమీఁదికి దండెత్తివచ్చి యోడిపోవును. ఈ - ఈ భాగము రామడుగు పాడుచుండఁగా జయభద్రభుఁడిట్లనెను.

ఇంక పాడనక్కఱలేదు. నాకు తెలిసినది. ఓయి రామదుగా! నీభార్యమెడలో వీరాంజనేయునిబిళ్ళ కట్టనక్కఱలేదు. నేను వెడలిపోవుచుంటిని. కట్టుకొన్నచో కట్టుకొమ్ము. నేను జయద్రథునడిగితిని. నీకెందుకంత సంతోషము? ఆ రహస్య మేదో నాతో చెప్పరాదా? యంటిని. జయ;- చెప్పినను నష్టములేదు. ఏమనఁగా ఆ యలక్షంధరుఁడు గుప్తచంద్ర గుప్తుని నాఁడు దండెత్తినట్లుకాక మౌర్య చంద్రగుప్తుని నాఁడు దండెత్తినట్లు మా వెలియోనసుతో చెప్పెదను. కలిలో పదునేనువందల యేండ్లు నాశనముచేసెదను. కాలమునే దొంగిలింతును. భగవంతుఁడు కాలస్వరూపుఁ డందురుకదా. కాలమును వంచించుట భగవంతుని వంచించుటయే. మాది భగవంతునిమీఁదిపగ. మాది పురాణవైరము. నేను వెడలి పోవుచున్నాను. అమృతవల్లీ! నీవు రాజును పొందిన తరువాత కాలంజరియు, రామదుగును విదిశానగరము దాటిపోవుటకు వీలుండదు. ఇపుడు నీవు సర్వసమర్థురాలవు.

భూమిమిత్రుఁ డిది చదివి యాపఁగా రామదుగు "అయ్యా! మేమా మఱునాఁడే బయలుదేరి వచ్చితిమి. అని చెప్పెను. భూమిమిత్రుఁడు "ఐనచో ఈ చివరికాగిత మెట్లు వచ్చినది?" అని దానిని చదువ నారంభించెను. అందులో నిట్లున్నది. "నేను పూర్ణిమనాఁడు రాజువద్దకుఁ బోవుచున్నాను. తెల్లనిచీరతాల్చి మల్లెపూలుముడిచి, ముత్యాల

హారములు ధరించి తెల్లగా వాడిచేసిన వాసుదేవుని ఖడ్గము వలె పోవుదును. వాసుదేవా! నేను నీకు మనస్సుతో భార్యను. శరీరముతో విషదిగ్ధమైన ఖడ్గమను. భూమిమిత్రుఁడు నేను బ్రతికియున్నచో నన్ను సవతితల్లిగా ద్వేషించెడివాఁడు. ఇప్పుడు నన్ను దేవతగాఁ బూజించును. మహారాణి నీభార్య నన్నుసవతిగాఁదెగడెడిది. ఇప్పుడు శ్రీమాలితో పాటు నాకొఱకుఁగూడ నేడ్చును. పూర్ణిమనాఁటి రాత్రి దేవభూతి విషమయశరీరుఁడై మరణించును. నేను తప్పించికొని రాఁగలను. వచ్చి యేమిచేయుదును? నాభర్త నన్ను స్వీకరించఁడు. అతఁ డేకపత్నీవ్రతుఁడు. నాశరీరము నా భర్తకు పనికిరాదు. ఇది విషమయము, తుచ్ఛకామము ననుసరించినను నా శరీరము దేవభూతి శరీరస్పర్శచేతన పవిత్ర మగును.” ఎందుకో తెలియదు. పది దినములు గిరివ్రజ పురము దుఃఖమును పాటించవలయునని రాజాజ్ఞ వెడలినది.

8వ నవల పులిముగ్గు.



మనసు ఫౌండేషన్

పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TRLA 101 181 |
| పుస్తకం పేరు | Gayleraoll |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 275 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, BCI ,6 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | naiya |
| స్కాన్ చేసినది | prathyusha |
| పరీక్ష చేసినది | SANDHYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | NO |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |